# బాలల శబ్దరత్నాకరం




'కూర్పరి'

ఆచార్య తూమాటి దొణప్ప





అభినందన పబ్లిషర్స్

28-10-1 కారల్ మార్క్స్ రోడ్డు, విజయవాడ-520002

బాలల శబ్దరత్నాకరం
తెలుగు టు తెలుగు డిక్షనరీ ఫర్ చిల్డ్రన్

ఎడిటర్:
ఆచార్య తూమాటి దోణప్ప

పబ్లిషర్స్
అభినందన పబ్లిషర్స్
విజయవాడ-500 002.

డైరక్టర్ ఆఫ్ పబ్లిషింగ్
**బి. బాల్జీ**

మొదటిప్రచురణ: 1991

వెల: రూ. 50/-

ఆర్ట్‌వర్క్: గోలి శివరామ్

టైప్‌సెట్టింగ్, ప్రాసెసింగ్
& ప్రింటింగ్
కళాజ్యోతిప్రాసెస్ ప్రవేట్ లిమిటెడ్
హైదరాబాద్-20.

# ప్రకాశకీయం

మా సోదరసంస్థ న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, విజయవాడ ద్వారా ఇప్పటివరకు ఎన్నో విజ్ఞానదాయకమైన పుస్తకాలు ప్రచురించి అందించిన మా నూతనసంస్థ 'అభినందన పబ్లిషర్స్,' విజయవాడ నుంచి అందరికి ఉపయోగపడే విధముగా పిల్లల పుస్తకాల ప్రచురణ ప్రారంభించి ఇటీవల ఒక 'బాలల విజ్ఞానసర్వస్వము' (సంస్కృతి భాగం) విడుదల (1990) చేసింది. బుడ్డిగ సుబ్బరాయన్‌గారి సంపాదకత్వం వహించిన ఈ పరిశీలనా (రిఫెరెన్స్) గ్రంథం మంచి పత్రికాభిప్రాయాల్ని (రివ్యూ) పొందుటయే గాక, జనాదరణ పొందింది. ఈ ఉత్సాహ, ప్రోత్సాహాలు పిల్లలకై మరొక పరిశీలనా గ్రంథం 'బాలల శబ్దరత్నాకరం'ను ప్రచురించడానికి దోహదపరిచింది. దీని సంపాదక నిర్వహణ ఆచార్య తూమాటి దొణప్పగారికి అప్పగించగా వారు శ్రమకోర్చి ఈవిధంగా సిద్ధపరచారు.

ఈనాడు ప్రాథమిక విద్య, ఉన్నత పాఠశాల విద్య మాతృభాషలోనే గరపడం జరుగుతుంది. ఈ వయోవర్గం పిల్లల నిఘంటు అవసరాలను దృష్టిలోపెట్టుకుని ఈ పుస్తకాన్ని రూపొందించడం జరిగింది. ఆయా ఆరోపాలకు ఇచ్చిన అర్థాల అవగాహన మరింత ఇనుమడింప చేయడానికి అనువుగా రేఖాచిత్రాల రూపకల్పన గోలి శివరామ్‌గారు నిర్వహించారు.

బాలల విజ్ఞానసర్వస్వం, తెలుగు-తెలుగు నిఘంటు ప్రబల శబ్దరత్నాకరంవంటి ఆకర (రిఫరెన్స్) గ్రంథాల ప్రచురణరంగంలో మా సంస్థచేస్తున్న ప్రయోగాత్మక ప్రయత్నాలను పాఠకలోకం ముఖ్యంగా విద్యాసంస్థలు సాదరంగా స్వీకరించి ప్రోత్సహిస్తాయని విశ్వసిస్తున్నాం. ఈ 'బాలల శబ్దరత్నాకరం' ముద్రణలో అత్యంత ఆధునిక లేజర్ డి.టి.పి. టైప్‌సెట్టింగ్, ఆఫ్‌సెట్ ముద్రణ వినియోగించి మీకు ఈ విధంగా మీ ముందుంచగలిగినందుకు సంతోషిస్తున్నాం.

విజయవాడ
ఫిబ్రవరి 1991

ఇట్లు
బి.బాల్జీ
డైరక్టర్ ఆఫ్ పబ్లిషింగ్
అభినందన పబ్లిషర్స్

# ఇలా చూడండి

మనసులోని భావాలను నోటిమాటగా బైటపెట్టేదే భాష. తెలుగువారు మాట్లాడేభాష, తెలుగులేక తెనుగు. దీనికే 'ఆంధ్రం' అన్నపేరుకూడ ఉంది. రెండువేల సంవత్సరాల క్రితంనుంచే తెలుగుభాష ప్రజల వాడుకలో ఉంది. తెలుగువారితోపాటు వారిభాషకూడ పెరుగుతూ వచ్చింది. ఇలా పెరిగేదశలో సంస్కృతం, ప్రాకృతం, పార్శీ, కన్నడం, తమిళం, మరాఠీ, ఉర్దూ, ఒరియా, ఇంగ్లీషు మొదలైన భాషలతో దీనికి సంబంధం కలిగింది. అందువల్ల ఎన్నోమాటలను ఈ యాభాషలనుంచి తెలుగువారు ఎరవుతెచ్చు కొని తమభాషను పెంచి పెద్దచేసుకున్నారు. సామాన్య ప్రజలేకాక, తెలుగు కవులు వారిని పోషించిన ప్రభువులు కూడా ఈ పెరుగుదలలో తోడ్పడ్డారు.

ఇలాగా పెరిగి పెద్దదైన తెలుగుభాషలోని అన్ని మాటల అర్థాలు తెలుగువారికి అందరికీ తెలియడం సాధ్యంకాదు కదా! అందుకని ఈమాట లను పోగుచేసి, వాటి అర్థాలు తెలిపే పుస్తకాలను రచించారు. వీటినే కోశాలనీ, నిఘంటువులనీ అంటారు. జ్ఞానమూ విజ్ఞానమూ పెరగాలంటే ''దేశమైనా చూడు, కోశమైనాచూడు'' అంటారు పెద్దలు. ఒకభాషలోని మాటలకు సరియైన అర్థాలు తెలిపే పుస్తకమే కోశం. తెలుగు నిఘంటువులను మొట్ట మొదట పద్యాలలో రచించారు. ఆంధ్రనామ సంగ్రహం, ఆంధ్ర నామశేషం, ఆంధ్ర భాషార్ణవం, వెంకటేశాంధ్రం, సాంబ నిఘంటువు - మొదలైనవన్నీ పద్యాలలోకూర్చిన తెలుగు నిఘంటువులు. ఇంచుమించు ఒకటే అర్థంగల వేర్వేరు మాటలను పర్యాయపదాలని అంటారు. ఇలాంటి పర్యాయ పదపట్టి కలే పద్యాలలో కూర్చిన మన తెలుగు నిఘంటువులు. శ్లోకాలలో రచించిన సంస్కృత భాషలోని అమరకోశం మొదలైన నిఘంటువులను చూచి మన తెలుగు కవులు అదే నమూనాలో వీటిని తయారుచేశారు. వీటి అవసరమూ, ఉపయోగమో బొత్తిగా తెలియకపోయినన్నూ వీధి బడులలోని పిల్లలు ఈ పద్యాలను గుడ్డి కంఠోపాఠంగా బట్టీపెట్టి అడిగినప్పుడు అప్పజెప్పేవారు.

ఇంగ్లీషువారి పరిపాలన వచ్చాక తెలుగు నిఘంటువుల రచనా పద్ధతి మారిపోయింది. అర్థాలతో మాటలను అకారాది క్రమంలో కూర్చి, నిఘంటు వులను సిద్ధపరిచారు. ఆంధ్రదీపిక, శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదలైనవి కొత్త పద్ధతిలో సిద్ధమైన నిఘంటువులు. కళాశాలల్లో

విశ్వవిద్యాలయాల తరగతులలో చదివే విద్యార్థులకూ, పండితులకూ ఇవి ఎంతో ఉపయోగకరమైనవి. ఇవి పాఠశాలలోని బాలబాలికలకు అందుబాటులో లేనివి; అంతగా అవసరంలేనివి. పిల్లల 'చేతివెన్నముద్దలు'గా చేతులలో ఇమిడిపోయే చిన్న చిన్న పుస్తకాలు వీరికి కావాలి. ఆ చూపుతో రూపెత్తినది ఈ నిఘంటువు.

ఒకటినుంచి పదోతరగతి వరకూగల విద్యార్థుల పాఠ్యగ్రంథాలనూ, ముఖ్యంగా పాఠ్యాంశాలుగా నిర్ణయించే ప్రాచీన కావ్య భాగాలనూ పరిశీలించి, అందలి కఠినపదాలను ఏర్చి, వాటిని అకారాదిక్రమంలో కూర్చి, వీలైనంత సులువైన రీతిలో వాటి అర్థాలు సూచించి దీనిని సిద్ధంచేశాము. కొన్నింటికి అర్థవివరణలతో జన్యపదాలు జతపరచి అవసరమనిపించిన చోట్ల ఆయా మాటల వివరణ సులభమైన ప్రయోగాలవల్లనూ, రేఖా చిత్రాల వల్లనూ బాలబాలికల మనస్సులకు హత్తుకొనేటట్లు చూపబడింది.

ఉన్నత పాఠశాలలలోని పైతరగతులలో ప్రకృతి వికృతులను గూర్చి తెలుగు ఉపాధ్యాయులు పిల్లలకు బోధిస్తూ ఉంటారు. సంస్కృత, ప్రాకృత భాషలనుంచి ధ్వనిపరమైన మార్పులతో వచ్చిన మాటలను తద్భవాలనీ వికృతులనీ అంటారు. వికృతిని (మార్పును) పొందినది కాబట్టి వికృతి; దీనికి మొదటి (మూల) రూపమేదో అది ప్రకృతి. ప్రకృతి వికృతుల అవసరంవల్ల వికృతి రూపాల దగ్గర సంస్కృత (సం.) ప్రాకృత (ప్రా.) భాషలలోని పదాలు చూపించాము.

ఎంతో ఎత్తైన భాష అనే మేడపైకి ఎక్కడానికి ఇది మొదటి మెట్టు మాత్రమే. పిన్నలూ, పెద్దలూ సవరణలు, వివరణలు తెలిపితే మలి కూర్పులో తగినమార్పులు చేస్తాము.

— కూర్పరి.

## సంకేతాక్షర వివరణ

ప్రా: ప్రాకృతం

సం: సంస్కృతం

పా: పారసీకభాష

<: మొనవైపున ఉన్నది
మార్పు పొందిన రూపం



తెలుగు వర్ణమాలలో మొదటి వర్ణం; బ్రహ్మ, విష్ణువు, శివుడు.

**అంకకాడు:** ముఖ్యుడు, శూరుడు; కళంకం కలవాడు; అసూయాపరుడు.

**అంకణం:** ఇంటిలో రెండు దూలాలకు మధ్య గల ప్రదేశం; ముంగిలి.

**అంకం:** తొడ; ఒడి; గుర్తు; మచ్చ; అంకె; నాటకంలో ఒకభాగం; దగ్గర; వంకరగా ఉండే పనిముట్టు.

**అంకవన్నె:** రికాబు, గుర్రాన్ని ఎక్కడానికి పక్కన అమర్చిన మెట్టు.

**అంకితం:** కృతి ఇవ్వడం; గుర్తు వేసినది; లెక్కించినది.

**అంకిలి[1]:** దొడకీలు; కీలకం.

**అంకిలి[2]:** అడ్డు; ఆపద; చెడిపోవడం.



అంకురం



అంకుశం



అంకం



అంగదట్టం



అంగన

**అంకురం:** మొలక; మొగ్గ; నీరు; నెత్తురు; వెంద్రుక.

**అంకురార్పణం:** ప్రారంభం; మొలకెత్తడానికి విత్తనాలు చల్లడం.

**అంకుశం:** ఏనుగును అదుపులో పెట్టడానికి దాని తలపై కొట్టే వాడియైన పనిముట్టు; అడ్డగింత.

**అంకుసం:** (<ప్రా. అంకుస-, సం. అంకుశం-).

**అంకె:** సంఖ్యను తెలిపేరేఖ. ౧, ౨, ౩ .. మొ.వి. తెలుగు అంకెలు, 1,2,3... మొ.వి. అరబిక్ అంకెలు; I,II,III... మొ.వి. రోమన్ అంకెలు, దగ్గర; స్వాధీనం; లోకువ.

**అంకెం:** గుర్రాన్ని ఎక్కడాని దాని పక్కన అమర్చిన లోహపుమెట్టు; ఎద్దు మొ. వాటి వేసే బరువులో సగం.

**అంగదట్టం:** గాగరా, లంగ పావడా.

**అంగన:** స్త్రీ; ఉత్తరదిక్కు కలదంటున్న ఒక ఏనుగ అష్టదిగ్గజాలలో ఒకటి. .

**అంగం[1]:** దేహం; అవయవం; భాగం; ఉపాయం.
**అంగం[2]:** రీతి, పద్ధతి, విధం.
**అంగరక్ష:** శరీరరక్షణ; పిల్లలకు దిష్టి తగులకూడదని కట్టే రేకు.
**అంగడి:** దుకాణం, షాపు; వీథి; సభ.
**అంగనం:** ముంగిలి; వాహనం; నడవడం.
**అంగరక్షకుడు:** రాజులు మొదలగు వారిని కాపాడడానికై ఏర్పరిచిన భటుడు, Body Guard.
**అంరంగ భోగాలు:** దేవతా విగ్రహానికీ, దేవాలయానికీ చేసే అలంకారాలు-నైవేద్యాలు.
**అంగలార్చు:** దుఃఖించు; భయంచేత ఏడ్చు.
**అంగలేపం:** శరీరానికి పూసే చందనం, అత్తరు మొ.వి.
**అంగవస్త్రం:** చిన్న తుండు గుడ్డ.
**అంగారకుడు:** ఒకనొక గ్రహం; కుజుడు. అంగారకవారం: మంగళవారం.
**అంగారం:** నిప్పు; బొగ్గు; ఎర్రటిది.


అంగడి


అంగుటం

అంగరక్షకుడు


అంగులీయకం


అంచ


అంగవస్త్రం


అంగారం

**అంగిలి:** లోకుత్తుక; గొంతు లోపలి భాగం. అంగిట ముల్లు: కొండనాలుక.
**అంగీకరించు:** ఒప్పుకొను.
**అంగీకారం:** ఒప్పుదల, సమ్మతి; పుచ్చుకొనడం.
**అంగుటం:** బొటనవేలు (<ప్రా. అంగుట్ఠ, సం. అంగుష్ఠ).
**అంగుళం:** వేలు; బొటనవేలు; అడుగులో పన్నెండో భాగం.
**అంగుళి:** వేలు, Finger; ఒక కొలత, అంగుళం.
**అంగుళీయకం:** ఉంగరం.
**అంఘ్రి:** పాదం; పద్యచరణం; వేరు, root.
**అంచ[1]:** హంస. (<సం. హంస-)
**అంచ[2]:** పక్క; దగ్గర.
**అంచనా:** ఊహ, estimation.
**అంచయాన:** హంస నడకవంటి నడకగల స్త్రీ
**అంచు:** కొన, చివర; చీరచెరగు, బట్టకమ్మి; పక్క.
**అంచె:** వరుస; గుంపు ప్రయాణంలోని మజలీ, విడిది. అంచెలంచెలుగా: ఒకచోట నుంచి తర్వాతిచోటుకు, ఒకస్థాయినుంచి పైస్థాయికి.

**అంజ:** పాదం; అడుగుదూరం; అంగ; సమీపం.


అంజ

**అంజనం:** కాటుక; రాతకువాడే సిరా; ఒకజాతి బల్లి; ఒంటికి పూసే పూత; దాచిన వాటిని కనిపెట్టే సాధనం.

**అంజలి:** చేమోడ్పు, నమస్కారం; దోసిలి; అభినయ హస్తవిశేషం.


అంజలి

**అంజిక:** భయం.

**అంజు:** భయపడు; సందేహించు.

**అంటు:** తాకు; పట్టుకొను; తగులుకొను; అంటురాయి; అయస్కాంతం; అంటు వ్యాధి; ఒకరినుంచి ఒకరికి సోకే జబ్బు.


అంటు

**అండ:** ఆధారం; వెనుక; పక్క; దగ్గరవారు అండగా ఉన్నారు; మా అండదండలు మీకున్నాయి.


అంతరిక్షం

**అండం:** కోడి, బాతు మొ. వాటి గుడ్డు.


అండం

**అండజం:** గుడ్డునుంచి పుట్టినది. చేప, పాము, పిట్ట, బల్లి మొ.వి.

**అండా:** పెద్ద గుండిగ; గాబు; గంగాళం.


అండా

**అండి:** చిన్న గుండిగ.

**అంటుగట్టు:** చెట్టు కొమ్మ నుంచి ఇంకో మొక్కను తయారుచేయడం. కొమ్మంటు, నేలంటు.

**అంతఃకరణం:** మనస్సు.

**అంతఃపురం:** రాణులు నివసించే భవనం.

**అంతం:** చివర; చావు; నాశనం.

**అంతరం:** లోపలిది, మనస్సు; ఇతరం; తేడా.

**అంతరంగం:** మనస్సు; లోపలిది; చాల ఇష్టమైనది.

**అంతరదామర:** ఒకజాతి నాచు, నీటి మొక్క.

**అంతరాయం:** అడ్డంకి; నడుమ నడుమ వచ్చే రాబడి.

**అంతరాత్మ:** మనస్సు.

**అంతరిక్షం:** ఆకాశం; రోదసి.

**అంతరించు:** చచ్చు; నశించు; చెడిపోవు.

**అంతర్జాతీయం:** ప్రపంచంలోని అన్ని జాతులకూ దేశాలకూ సంబంధించినది.

**అంతరువు:** భేదం; కొంచెం దూరం; ఎడం.

**అంతర్గతం:** లోపలిది; దాచినది; మరచినది; నడుమవచ్చి చేరినది; నశించినది.

**అంతర్ధానం:** మరుగు పాటు; మాయమవడం.

**అంతర్భూమి:** భూమి లోపలి భాగం.

**అంతర్యామి:** భగవంతుడు; జీవుని నడపించే వాడు; జీవాత్మ.

**అంతర్వత్ని:** గర్భవతి;చూలాలు; లోపల శిశువు కలది.

**అంతర్యుద్ధం:** ఒక దేశంలోని ప్రజలమధ్య జరిగే యుద్ధం.

**అంతర్వాణి:** పండితుడు; లోపల విద్య కలవాడు.

**అంతర్వాహిని:** కంటికి కనిపించకుండా భూమిలోపలి భాగాన ప్రవహించే నది; గంగా నదికి ఉపనదియని భావించే సరస్వతీనది. గంగా, యమునా, సరస్వతీ నదులు కలిసేచోటు (అలహాబాద్)ను త్రివేణీ సంగమం అంటారు.

**అంతర్వేది:** గంగా యమునా నదుల మధ్యగల ప్రదేశం; తూర్పు గోదావరి జిల్లాలో గోదావరీ నదీశాఖ అయిన వసిష్ఠనదీ తీరంలోని ఒక పుణ్యక్షేత్రం.


అంతస్తు


అంతర్భూమి


అంతర్వత్ని


అందలం


అందియ

**అంతస్తు:** మేడపైభాగం; స్థాయి; హోదా.

**అంతస్థం:** లోపల ఉండేది; నడుమ ఉండేది; య, ర, ల, వ- వర్ణాలకు అంతస్థాలు అని పేరు.

**అంతికం:** దగ్గరిది; తుదివరకు సాగేది.

**అంతిపురం:** రాణివాసం (<సం. అంతఃపుర-).

**అంతు:** చివర; మొత్తం; వెరసి.

**అంత్యక్రియ:** చచ్చినవ్యక్తికి చేసే సంస్కారం.

**అందనుక:** అంతవరకు; అందాక.

**అందం:** సౌందర్యం; పద్ధతి, రీతి; చక్కనిది; తగినది.

**అందలం:** పల్లకి (<ప్రా. అందోల-, సం. ఆందోల-).

**అందిక:** సమీపం; దగ్గరగా ఉన్నది; ఆలంబనం.

**అందియ, అందె:** స్త్రీలకాలినగ; బిరుదుగా కాలికి వేసుకునే ఆభరణం (<ప్రా. అందిఆ, సం. అందుక-).

**అందుపాటు:** సమీపం, వీలు.

**ఆందోళనం:** ఊగడం; అయిష్టతను తెల్పడం.

**అంధకారం:** చీకటి.

**అంధకారి:** శివుడు, అంధకుడనే రాక్షసునకు శత్రువు (అంధక+అరి).

**అంధుడు:** గుడ్డివాడు.

**అంబ:** తల్లి; పార్వతీదేవి.

**అంబకం:** కన్ను; బాణం.

**అంబరం:** ఆకాశం; వస్త్రం.

**అంబలి:** నీటిలో పిండిని పల్చగా కలిపి కాచిన పదార్థం.

**అంబారం:** ధాన్యరాశి.

**అంబారీ:** కూర్చోడానికి వీలుగా ఏనుగుపై అమర్చే పీఠం.

**అంబు:** బాణం (< సం. అంబక-).

**అంబుచరం:** నీటిలో చరించేది (చేప, మొసలి మొ.).

**అంబుజం:** నీటిలో పుట్టినది, పద్మం.

**అంబుజాసనుడు:** పద్మమే ఆసనంగా కలవాడు, బ్రహ్మ.

**అంబుదం:** నీటిని ఇచ్చేది, మేఘం.

**అంబుధరం:** నీటిని ధరించేది (మోసేది), మేఘం.


అంభోధి


అంధుడు

అంబకం


అంబారీ


అంబు


అంబుజం


అంబుధరం

**అంబుధి:** నీటికి స్థానమైనది, సముద్రం.

**అంబువు:** నీరు.

**అంభోధి:** సముద్రం, అంభోనిధి.

**అంశం:** భాగం; విషయం.

**అంశుకం:** సన్నటి వస్త్రం.

**అకటవికటం:** తారుమారు.

**అకర్మకం:** పనిలేనిది; చెడ్డపని, కర్మపదం లేని క్రియావాచకం.

**అకస్మాత్తుగా:** ఉన్నట్టుండి, హఠాత్తుగా.

**అకారణం:** కారణం లేనిది, వ్యర్థం.

**అకుంఠితం:** అడ్డులేనిది; వాడియైనది.

**అక్కజం:** ఆశ్చర్యం; శక్తికి మీరినది; అధికం.

**అక్కటికం:** దయ.

**అక్కర**[1]: తెలుగులో ఒక పద్యవిశేషం. (< ప్రా. అక్ఖర-, సం. అక్షర-).

**అక్కర**[2]: అవసరం; స్నేహం; కోరిక.

**అక్కరం:** అక్షరం (< ప్రా. అక్ఖర-, సం. అక్షర-).

**అక్కలు:** గ్రామ దేవతలు (< ప్రా. యక్షదేవతావిశేషం సం. యక్ష-).

**అక్కసం:** కోపం; బాధ; సంతాపం (<ప్రా. అక్కోస-, సం. ఆక్రోశ-).


అక్కసం

**అక్కు:** గుండె, రొమ్ము (<ప్రా. అక్ఖ - గొంతు కింది ఎముక, సం. అక్ష-).

**అక్కుపక్షి:** బక్కవాడు; దిక్కులేని వాడు.


అగడ్త

**అక్షతలు:** చూ. అక్షింతలు.

**అక్షరాస్యులు:** చదువను, రాయను వచ్చినవారు.

**అక్షయతృతీయ:** వైశాఖ శుక్ల తదియ.


అగప

**అక్షి:** కన్ను.



**అక్షింతలు:** దేవతా ప్రతిమలను పూజించేటప్పుడూ, పిన్నలను దీవించేటప్పుడూ వాడే పసుపులో కలిపిన బియ్యపు గింజలు.


అక్షింతలు

**అక్షికూటం:** కంటిపాప.

**అక్షిగోళం:** కనుగుడ్డు.

**అక్షిపటలం:** కంటిపొర.

**అక్షౌహిణి:** 21,870 రథాలు, అన్నే ఏనుగులు, 65,610 గుర్రాలు, 1,09,350 కాల్బలం కలిగిన సేన.


అగసాలి

**అఖండం:** నిండైనది, పరిపూర్ణమైనది, ముక్కలు కానిది.

**అఖాతం:** తవ్వనిది; మనుషులచే తవ్వబడని సముద్రం మొ.వి.

**అఖిలం:** సమస్తం, అంతా; దున్ననిది.

**అగచాట్లు:** ఆపదలు, కష్టాలు.

**అగడ్త:** కోటచుట్టూ తవ్విన కందకం; బురద గుంట.

**అగత్యం:** తప్పనిసరి.

**అగప:** కొయ్యగరిటె, పెద్ద తెడ్డు.

**అగమ్యం:** నడవకూడనిది, పోదగని దారి; చేరరానిది; తెలియరానిది.

**అగమ్యగోచరం:** అర్ధంకానిస్థితి.

**అగలించు:** పెల్లగించు.

**అగవుతగవులు:** సారె.

**అగసాలి:** బంగారు పనివాడు (<ప్రా. అక్కసాలిఅ; సం. అర్కశాలిక).

**అగాధం:** చాల లోతైనది; తెలియరానిది.

**అగోచరం:** కనిపించనిది.

**అగ్గడి:** ముందుభాగం (<ప్రా. అగ్గడ-, సం. అగ్రత-).

**అగ్గం:** అధీనం; సమీపించినది; అందుబాటులోనిది (<ప్రా. అగ్గ- ముందరి; సం. అగ్ర).

**అగ్గి:** నిప్పు (<ప్రా. అగ్గీ, సం. అగ్ని).

**అగ్గించు:** పొగడు (<ప్రా. అగ్ఘ-: పూజ్యత; సం. అర్ఘ్య సన్మానం, మన్నన).

**అగ్గువ:** చౌక (<ప్రా. అగ్ఘ -: హెచ్చువెల; సం. అర్ఘ-).

**అగ్ని:** నిప్పు.

**అగ్నికణం:** నిప్పురవ్వ.

**అగ్నిపర్వతం:** నిప్పుకొండ.

**అగ్నిమాంద్యం:** ఆకలితగ్గడం.

**అగ్నిమాపకయంత్రం:** మంటల్ని ఆర్పడానికి వాడే యంత్రం. ఆపు, ఆర్పు పొగొట్టు అనే అర్థాలుగల 'మాయు' అనే మాటనుంచి 'మాపకం' ను కృతకంగా సృష్టించారు. 'మాపకం' అంటే కొలిచేది అని అర్థం. చూ. ఉష్ణమాపకం).

**అగ్నిసాక్షి:** అగ్ని సాక్షిగాకలది, అగ్ని ఎదుట జరిగినది.

**అగ్రగణ్యుడు:** మొదట లెక్కించ దగిన వాడు.



అగ్గి



అగ్నిపర్వతం



అగ్నిమాపకయంత్రం



అచలం



అచ్ఛర

**అగ్రగామి:** ముందు నడచేవాడు, మొదటివాడు, మొనగాడు.

**అగ్రజ:** మొదట పుట్టినది, అక్క.

**అగ్రజుడు:** మొదట పుట్టిన వాడు, అన్న.

**అగ్రపూజ:** మొదట చేసే పూజ; అందరి కంటె పెద్దలైన వారికి చేసే సత్కారం.

**అగ్రం:** మొదటిది; ముఖ్యమైనది; చివరది.

**అగ్రాహ్యం:** తీసుకోరానిది; నమ్మదగనిది; లెక్క చేయదగనిది.

**అఘం:** పాపం; దుఃఖం; చెడ్డ అలవాటు.

**అచరం:** కదలనిది.

**అచల:** చలించనిది, భూమి.

**అచలం:** కొండ.

**అచిరకాలం:** కొద్దికాలం.

**అచేతనం:** కదలిక లేనిది; ప్రాణం లేనిది.

**అచ్ఛం:** నిర్మలం, తేటయైనది.

**అచ్ఛంగా:** అన్ని హక్కుల తోను ఇచ్చి వేయడం.

**అచ్ఛర:** అప్సరస, దేవవేశ్య (<ప్రా. అచ్ఛరా, సం. అప్సరాః).

**అచ్చికబుచ్చికలు:** కలుపుగోలు తనం; బెల్లింపు మాటలు.

**అచ్చివచ్చు:** అనుకూలమగు; కలసివచ్చు ఆ ఇల్లు అచ్చి వచ్చింది; ఈ ఇల్లు అచ్చి రాలేదు.

**అచ్చు[1]:** స్వరం Vowel, తెలుగునకు అచ్చులు పదారు.

**అచ్చు[2]:** ప్రింట్; ఉదాహరణం; గుర్తు; పద్ధతి; ప్రతిరూపం. అచ్చు కూటం: ముద్రాక్షరశాల, ప్రింటింగ్ ప్రెస్.

**అచ్చు[3]:** పరిశుద్ధి, స్వచ్ఛం; స్పష్టమైనది, తగినది.

**అచ్చు[4]:** పాచిక నేతపనిముట్టు.

**అచ్చు[5]:** అప్పుపడు; పూచీపడు; దండుగచెల్లించు.

**అచ్చెరువు:** ఆశ్చర్యం (< ప్రా. అచ్చేర-, సం. ఆశ్చర్య-).

**అచ్యుతం:** జారనిది; కారనిది; నాశనం లేనిది.

**అజగరం:** కొండచిలువ, పెద్ద పాము.

**అజయం:** ఓటమి, అపజయం.

**అజయ్యం:** జయించ శక్యం కానిది.

**అజరం:** ముసలితనం లేనిది.



అటవి



అచ్చెరువు



అడకత్తెర



అజగరం



అడబాల

**అజరామరం:** ముసలితనమూ చావూ లేనిది; శాశ్వతమైనది.

**అజాతశత్రువు:** శత్రువులు లేనివాడు; ధర్మరాజు.

**అజేయం:** గెలువ దగనిది; జయించగూడనిది.

**అజ్ఞాతం:** తెలియనిది.

**అజ్ఞాతవాసం:** ఇతరులకు తెలియ కుండా నివసించడం.

**అజ్ఞానం:** తెలియని తనం; తెలివి లేనిది.

**అటమటం:** మోసం; బాధ; వ్యర్థం; చెడిపోయినది.

**అటవి:** అడవి.

**అట్టహాసం:** పెద్దనవ్వు; ఆడంబరం; ఆర్భాటం.

**అడకత్తెర:** అడకొత్తు, వక్కలు( పోకలు) ముక్కలు చేసే సాధనం.

**అడపం:** వక్కలాకులు ఉంచే సంచి,

**అడపొడ:** ఆచూకీ, జాడఎక్కడ వెతికినా వాడి అడాపొడా లేదు.

**అడబాల:** వంటవాడు.

**అడలు:** కష్టం; భయం; దుఃఖం; ఏడుపు; బెదరు.

**అడసాల:** వంటిల్లు.

**అడిదం:** కత్తి, ఖడ్గం.

అడిదం

**అడియడు:** దాసుడు; పాదసేవకుడు.

**అడియాస:** వట్టిఆశ, నెరవేరని ఆశ.

**అడుగు[1]:** పాదం; పద్యపాదం; అడుగు దూరం; కింది చోటు

**అడుగు[2]:** ప్రశ్నించు; వేడుకొను; ఒప్పించు.

**అడుసు:** బురద.

**అడ్డంకి:** ఆటంకం.

**అడ్డగోడ్డం:** అడ్డుమాట, వెకలిమాట.

**అడ్డపాప:** పసిబిడ్డ.

**అడ్డసాళ్ళు:** జూదంలోని పాచికలు.

**అతలాకుతలం:** తారుమారైనది.

**అతిక్రమం:** కట్టుబాటును దాటడం; లెక్కచేయక పోవడం.

**అతిగమించు:** దాటిపోవు, మీరిపోవు.

**అతిథి:** చెప్పా పెట్టకుండా భోజన సమయానికి వచ్చే వ్యక్తి; పిలువగా వచ్చిన వ్యక్తి.


అతివ


అడుగు


అడుగు


అడ్డపాప


అడ్డసాళ్ళు


అత్తెం


అతిగమించు

**అతిపరిచయం:** మితిమీరిన చనువు.

**అతిరథుడు:** చాలమంది రథికులతో ఒంటరిగా యుద్ధం చేయగల వీరుడు.

**అతివ:** స్త్రీ; భార్య.

**అతివృష్టి:** అవసరాన్ని మించి కురిసిన వాన.

**అతిశయం:** ఎక్కువ, అధికం; గర్వం.

**అతిశయించు:** మీరిపోవు; వృద్ధి చెందు; ప్రకాశించు.

**అతిశయోక్తి:** గోరంత దానిని కొండంతగా చెప్పడం; ఒక అలంకారం.

**అతిసారం:** విరేచనాలు ఎక్కువగా అయ్యే జబ్బు.

**అతీతం:** అందనిది; దాటిపోయినది; చచ్చినది.

**అత్తం:** అరటిగెలలో ఒకభాగం; గుంపు.

**అత్తెం:** డేగకాలి గోళ్ళు గుచ్చుకోకుండా చేతికి కట్టుకునే తోలు కవచం.

**అదంతం:** పళ్ళురానిది, శిశువు; అవర్ణం చివరకలది.

**అదనం:** ఎక్కువ, అధికం.

**అదను:** యుక్తసమయం; తగినది.

**అదృశ్యం:** కనబడనిది; చూడరానిది.

**అద్భుతం:** ఆశ్చర్యం.

**అద్వితీయం:** సాటిలేనది; ఒంటరిది.

**అధఃపతనం:** కింద పడడం; నాశనంకావడం.

**అధమం:** తక్కువైనది; నీచమైనది; కనీసం.

**అధరం:** కిందిపెదవి; పెదవి.

**అధికమాసం:** సూర్య సంక్రమణంలేని చంద్రమాసం.

**అధిపతి:** పాలకుడు; రాజు.

**అధిక్షేపం:** తిరస్కరించడం, నిందించడం; తోసిపుచ్చడం; ధిక్కరించడం.

**అధిగమించు:** చదువు; తెలిసికొను; ధరించు; ప్రవేశించు.

**అధిరోహణం:** ఎక్కడం.

**అధివసించు:** కూర్చుండు; నివసించు.

**అధునాతనం:** ఇప్పటిది.

**అధ్యక్షించు:** పరిపాలించు; అధికారం చలాయించు.

**అధ్యయనం:** చదవడం; గురుముఖంగా వేదం చదవడం.



అధ్యాపకుడు



అద్భుతం



అధిపతి



అధిరోహణం



అనలం

**అధ్యాపకుడు:** ఉపాధ్యాయుడు.

**అధ్యాయం:** వేదపాఠం; గ్రంథంలో ఒక భాగం.

**అనంతం:** అంతంలేనిది; సమాప్తిలేనిది; మేరలులేనిది; శాశ్వతమైనది.

**అనద:** నాథుడు లేనిది; దిక్కులేని వ్యక్తి దుర్బలవ్యక్తి (సం. అనాథ-).

**అనయం:** ఎల్లప్పుడు; మిక్కిలి; మాటిమాటికి.

**అనర్గలం:** అడ్డులేనిది.

**అనర్థం:** కీడు, నష్టం; పనికిమాలినది; పేదరికం.

**అనలం:** అగ్ని.

**అనాకారి:** ఆకారంలేని వ్యక్తి; కురూపి.

**అనామకుడు:** పేరులేనివాడు; ప్రసిద్ధిలేనివాడు.

**అనామతు:** వెల నిర్ణయించకుండా నమ్మకంమీద సరకును ఇవ్వడం.

**అనామయం:** రోగం లేనిది; ఆరోగ్యం.

**అనామిక:** పేరులేనిది, ఉంగరపువేలు.

అనాస: ఒక పండు.
అనావృష్టి: బొత్తిగా వర్షాలు లేకపోవడం.
అనిత్యం: శాశ్వతం కానిది; తాత్కాలికం.
అనిమిత్తం: కారణం లేనిది; అపశకునం.
అనియతం: ఏర్పాటు లేనిది, క్రమం లేనిది.
అనిలం: గాలి.
అనుగ్రహం: దయ.
అనుజ్ఞ: అనుమతి; ఆజ్ఞ.
అనుదినం: ప్రతిదినం.
అనునయం: ఊరడింపు.
అనునాసికం: ముక్కును అనుసరించిన శ్వాసప్రవాహంకల వర్ణం (ఙ, ఞ, ణ, న, మ)
అనుపానం: మందుతో పుచ్చుకునే పదార్థం.
అనుబంధం: సంబంధం.
అనుమతి: సమ్మతి; ఒప్పుదల.
అనుమోదం: సమ్మతి; సంతోషం.
అనుయాయి: అనుచరుడు; ఆశ్రితుడు.
అనురాగం: ప్రేమ.
అనువు: పద్ధతి; ఉపాయం; నేర్పు; అవకాశం; తగినది.


అనాస


అనునయం


అపరంజి


అనుయాయి

అనృతం: అసత్యం.
అనైక్యం: ఐకమత్యం లేకపోవడం.
అన్నెం[1]: ఇతరం, వేరేది (<సం. అన్యవ్).
అన్నెం[2]: అన్యాయం, పాపం (< ప్రా. అణ్ణాయ-, సం. అన్యాయ-).
అన్వేషణం: వెదకడం.
అపకారం: కీడు; చెడ్డపని.
అపఖ్యాతి: చెడ్డపేరు.
అపచారం: తప్పు; తప్పుచేయడం; లోపం.
అపజయం: ఓడిపోవడం.
అపత్యం: సంతానం.
అపరంజి: మేలిమి బంగారం
అపరాధం: తప్పు, నేరం.
అపవాదం: అపకీర్తి; అబద్ధాలు చెప్పడం; నిందించడం.
అపశకునం: చెడ్డ శకునం.
అపహరించు: దొంగిలించు.
అపహాస్యం: ఎగతాళి.
అపాయం: కీడు, ప్రమాదం.
అపారం: అంతులేనిది; దాటడానికి వీలుకానిది.
అపార్థం: అర్థంలేనిది; తప్పు అర్థం.

**అపురూపం:** అరుదైనది, వింతయైనది.
**అపూర్వం:** పూర్వంలేనిది; కొత్తది; అరుదైనది.
**అపేక్ష:** కోరిక; ప్రేమ; ఆలోచన.
**అపోహ:** భ్రమ; తప్పు ఊహ; తప్పుగా అర్థం చేసుకొను (అప+ఊహ).
**అప్పనం:** కప్పం; పన్ను; కానుక అధీనం (<ప్రా. అప్పణం, సం. అర్పణం).
**అప్పసం:** ఎల్లప్పుడు; సరిపోవడం.
**అప్రతిష్ఠ:** అగౌరవం; నిలుకడలేనిది.
**అప్రతిహతం:** అడ్డులేనిది.
**అప్రయోజకుడు:** పనికి మాలినవాడు.
**అప్రస్తుతం:** అసందర్భం, అసంగతం.
**అప్రియం:** ఇష్టం లేనిది.
**అబద్ధం:** అసత్యం; ప్రయోజనం లేనిది.
**అబ్బురం:** ఆశ్చర్యం.
**అబ్బెసం:** అభ్యాసం, అలవాటు (< ప్రా. అబ్బేస-, సం. అభ్యాస-).


అభినయం


అభిరుచి


అభివందనం


అబ్బురం

**అభయం:** భయంలేనిది; రక్షణ.
**అభిజనం:** వంశం; కులం; జన్మభూమి.
**అభినందించు:** పొగడు; సంతోషపెట్టు; సంతోషించు.
**అభినయం:** నటన.
**అభిప్రాయం:** ఆలోచన; ఉద్దేశం; కోరిక.
**అభిమతం:** కోరిక; సమ్మతి; ఇష్టమైనది.
**అభిమానం:** ఆత్మగౌరవం; గర్వం; ప్రేమ.
**అభియోగం:** పట్టుదల; ఉత్సాహం; వ్యాజ్యం; నేరం మోపడం.
**అభిరామం:** ప్రియమైనది; మనోహరమైనది.
**అభిరుచి:** ఎక్కువ ఆసక్తి; ప్రీతి; కాంతి.
**అభిలాష:** కోరిక.
**అభివందనం:** నమస్కారం.
**అభివృద్ధి:** పెరుగుదల.
**అభీష్టం:** కోరిక; కోరినది; ఇష్టమైనది.
**అభ్యంతరం:** లోపలిది; అడ్డు.
**అభ్యర్చనం:** పూజించడం.
**అభ్యర్థన:** ప్రార్థించడం; కోరుకొనడం.

**అభ్యాగతుడు:** పండుగ పబ్బాలలో డబ్బు ఆశతో వచ్చే వ్యక్తి.
**అభ్యాసం:** అలవాటు; సాధన.
**అభ్యుదయం:** అభివృద్ధి; ఉత్సవం; మేలు.
**అమంగళం:** కీడు.
**అమడ(లు):** జంట, కవల పిల్లలు (సం. యమల-)
**అమవస:** అమాస(సం.అమావాసో)
**అమానుషం:** క్రూరం; పశుపక్షులు మొ.వి.
**అమాత్యుడు:** మంత్రి.
**అమాయకుడు:** మాయ మర్మం లేనివాడు.
**అమావాస్య:** చంద్రుడు ఏమాత్రమూ కనిపించని రోజు.
**అమూల్యం:** వెల లేనిది; విలువ కట్ట లేనిది.
**అమృతం:** చావులేనిది; తీయటిది; ఇంపైనది.
**అమోఘం:** వ్యర్థంకానిది, మేలైనది.
**అమ్ము , అంబు:** అమ్ములపొది; బాణాలు ఉంచి వీపున కట్టుకునే సాధనం.


అయస్కాంతం


అమడ


అరక


అరుగు


అరదం


అరవిందం


అమ్ము

**అయనం:** దారి; తావు; సూర్యుని గమనకాలం (ఉత్తరాయణం, దక్షిణాయనం ).
**అయస్కాంతం:** సూదంటు రాయి; ఇనుమును ఆకర్షించేది.
**అయాచితం:** అడగకుండానే ప్రాప్తించినది.
**అయోమయం:** ఇనుముతో చేసినది; ఏమీ అర్థం కాక పోవడం.
**అరక:** నాగలి.
**అరకడ:** మూపు.
**అరుగు:** తిన్నె, వేదిక (<సం. రంగ-).
**అరణం:** పెండ్లివేళ పెండ్లికొడుకు, పెండ్లి కూతురులకు ఇచ్చే డబ్బు ఇతర వస్తువులు(<సం. హరణ-).
**అరణ్యం:** అడవి.
**అరదం:** రథం (<సం. రథం-).
**అరమరికలు:** తేడాలు; అనుమానాలు.
**అరవిందం:** కమలం.
**అరసం:** రసం లేనిది; రుచిలేనిది; ద్రవంలేనిది; ఇంపు కానిది.

**అరాజకం:** రాజులేనిది, విచ్చల విడితనం (అరాచకం అనివాడుక).

**అరి:** శత్రువు.

**అరిగోలు:** ఏటిని దాటించే సాధనం.

**అరుదు:** వింత; అపురూపం; ఎప్పుడో ఒకసారి.

**అరుదెంచు:** వచ్చు; పోవు.

**అరువు:** అప్పు; ఎరవు తీసుకురావడం (అరువు బేరం).

**అర్చన:** పూజ.

**అర్జీ:** మనవిపత్రం.

**అర్థం:** భావం; ప్రయోజనం; ధనం.

**అర్ధం:** సగం.

**అర్ధాంగి:** భార్య.

**అర్భకుడు:** పిన్నవాడు; బక్కచిక్కినవాడు; మూర్ఖుడు.

**అర్మిలి:** ప్రీతి; ఆపేక్ష; మిత్రుడు.

**అర్వాచీనం:** ఇటీవలిది.

**అలం:** వ్యాపించు; కప్పు; అదుము; పూయు.

**అలజడి:** ఆపద; బాధ; శ్రమ; ఆందోళన; గందరగోళం.

**అలమటించు:** ఏడ్చు; బాధపడు.



అవతరించు



అర్చన



అర్థం

అర్ధం



అవరోహణం



అలమటించు

**అలసందలు:** బొబ్బర్లు.

**అలసుడు:** సోమరి.

**అలుపం:** కొంచెం, తక్కువ (< సం. అల్ప-).

**అల్పుడు:** నీచుడు.

**అవగుణం:** తప్పు; చెడ్డ అలవాటు.

**అవతరించు:** కిందికి దిగు; దేవతలు మానవరూపంలో పుట్టు.

**అవధానం:** ఏకాగ్రత (అష్టావధానం, శతావధానం).

**అవధి:** మేర; ఏకాగ్రత; ఎడం.

**అవని:** నేల; భూమి.

**అవరోధం:** అడ్డు; చెరసాల; అంతఃపురం.

**అవరోహణం:** దిగడం.

**అవలంబించు:** పట్టుకొను; పూనుకొను; పాటించు; స్వీకరించు.

**అవశ్యం:** తప్పనిసరి అయినది.

**అవసరం:** సమయం; ఆవశ్యకం; నైవేద్యం.

**అవాంతరం:** నడిమిది; అడ్డు.

**అవిచ్ఛిన్నం:** ఎడతెగనిది; ఎల్లప్పుడు (ఉండేది).

**అవ్యాజం:** కపటం లేనిది; సహజమైనది.

**అశ్రువు:** కన్నీరు.
**అశ్లీలం:** అసభ్యం (చెప్పరానిది).
**అశ్వం:** గుర్రం.
**అష్టదిక్కులు:** ఎనిమిది దిక్కులు.
**అసడ్డ:** అశ్రద్ధ, ఉపేక్ష. (< ప్రా. అసడ్ఢా, సం. అశ్రద్ధా).
**అసము:** కీర్తి (< సం. యశస్-).
**అసలు[1]:** బురద, సారం.
**అసలు[2]:** మూలధనం.
**అసహ్యం:** సహించరానిది; రోత.


అశ్రువు


అశ్వం


అస్థి


అస్థిపంజరం

**అస్త్రం:** మంత్రంచే ప్రయోగించే బాణం.
**అస్థి:** ఎముక; గింజ; టెంక.
**అస్థిపంజరం:** ఎముకలగూడు.
**అస్పృశ్యత:** అంటరానితనం.
**అస్పృశ్యం:** అంటరానిది.
**అస్వస్థత:** అనారోగ్యం.
**అహంకారం:** గర్వం; కోపం.
**అహరహం:** దినదినం; ఎల్లప్పుడు.
**అహోరాత్రం:** పగలును రేయును; ఎల్లప్పుడు.


అస్వస్థత

# ఆ

**ఆ:** తెలుగు వర్ణమాలలో రెండో అచ్చు; దూరంగా కనిపిస్తున్న వస్తువును, వ్యక్తిని తెలిపే నిర్దిష్టార్థకం( ఆయిల్లు ఆ బాలుడు మొ. వి. ).

**ఆంత్రం:** పేగులకు సంబంధించినది.

**ఆందోళం:** ఊగిస లాట; సందేహం; ఉయ్యాల.

**ఆంధ్రం:** ఆంధ్రజాతి; ఆంధ్ర ప్రదేశ్; ఆంధ్రభాష.

**ఆంధ్రుడు:** తెలుగువాడు.

**ఆకట్టుకొను:** ఆకర్షించు; తనదనిపించుకొను.

**ఆకతాయి:** పోకిరి, తుంటరి.

**ఆకరం:** స్థానం; ఉత్పత్తిస్థానం.

**ఆకళించు:** తెలుసుకొను; కలిగించు.

**ఆకసం:** ఆకాశం.

**ఆకాంక్ష:** కోరు.

**ఆకాశవాణి:** అశరీర వాణి; రేడియో.


ఆకురాయి


ఆచార్యుడు


ఆంధ్రం


ఆకసం


ఆఘ్రాణించు

**ఆకురాయి:** కత్తి మొదలైన ఆయుధాలకు పదునుబెట్టే పనిముట్టు.

**ఆక్రమించు:** బలాత్కారంగా వశపరుచుకొను; ఓడించు; అతిక్రమించు.

**ఆక్రోశించు:** ఏడ్చు; బిగ్గరగా పిలుచు; గట్టిగా చెప్పు.

**ఆక్షేపించు:** తిరస్కరించు; బెదరించు; అడ్డగించు.

**ఆఖ్యానం:** కథ; పూర్వకథను చెప్పడం; జవాబు.

**ఆగంతుకుడు:** చెప్పకుండా వచ్చినవాడు.

**ఆగడం:** అల్లరిపని, కొంటెపని; మోసం; అవమానం; దుర్మార్గం.

**ఆగమనం:** రావడం.

**ఆగ్రహం:** పట్టుదల; ఆక్రమణం; కోపం.

**ఆఘాయిత్యం:** కొద్దిగా జరిగిన దానిని కొండంతలుగాచేసి కావించే అరపు, ఏడ్పు మొ. వి.

**ఆఘ్రాణించు:** వాసనచూచు.

**ఆచరించు:** చేయు.

**ఆచార్యుడు:** ఉపాధ్యాయుడు.

**ఆచూకి:** జాడ, పోబడి.

**ఆచ్ఛాదనం:** కప్పడం; తప్పులను కప్పిపెట్టడం; వస్త్రం.

**ఆజ్యం:** నెయ్యి.

**ఆటంకం:** అడ్డంకి.

**ఆటపట్టు:** ఆటలాడేచోటు; నివాసస్థానం.

**ఆడవిడుపు:** సెలవురోజులలో బడిపిల్లలను వదలిపెట్టడం.

**ఆడంబరం:** పటాటోపం, బడాయి, గర్వం.

**ఆణిముత్యం:** మేలైన ముత్యం; మంచిది.

**ఆతిథ్యం:** అతిథికి చేసే సత్కారం.

**ఆత్మ:** జీవాత్మ; పరమాత్మ; మనస్సు, దేహం.

**ఆత్మస్తుతి:** తన్నుతాను పొగడుకోవడం.

**ఆద:** మనస్సు (< ప్రా. ఆద-, సం. ఆత్మన్).

**ఆదరువు:** ఆధారం. (< సం. ఆధార-).

**ఆదర్శం:** చూచి నేర్చుకోదగినది; అనుసరించ దగినది; అద్దం.


ఆచ్ఛాదనం


ఆది


ఆడంబరం


ఆన


ఆనతి


ఆననం

**ఆదాయం:** పుచ్చుకొనడం; రాబడి.

**ఆది[1]:** మొదటిది; సమానం; మూలం.

**ఆది[2]:** నగలు, దుస్తులు మొదలైనవి తయారు చేయడానికి ఇచ్చిన కొలత; ఈ కొలతను తెలిపేది (ఉంగరం, చొక్కా మొ.వి.).

**ఆదుకొను:** అవసరం వచ్చినపుడు సాయపడు; రక్షించు.

**ఆదుర్దా:** తొందర; భయం.

**ఆదేశించు:** ఆజ్ఞాపించు.

**ఆధి:** కుదువ, తాకట్టు.

**ఆధిపత్యం:** అధికారం.

**ఆధునికం:** ఇప్పటిది, కొత్తది.

**ఆధ్యాత్మికం:** ఆత్మకు సంబంధించినది.

**ఆన:** ఉత్తరువు, ఒట్టు, తోడు (< పా. ఆణా-, సం. ఆజ్ఞా).

**ఆనతి:** ఆజ్ఞ (< ప్రా. ఆణత్తి సం. ఆజ్ఞప్తి).

**ఆననం:** ముఖం; నోరు.

**ఆనవాలు:** గుర్తు.

**ఆపాదించు:** కలిగించు; లేనిది ఉన్నట్టు తెలుపు.

**ఆప్తుడు:** నమ్మదగినవాడు; మేలుకోరేవాడు.
**ఆప్యాయనం:** ప్రీతిని కలిగించు నది; సంతోష పెట్టడం; తృప్తి.
**ఆభరణం:** నగ; బాగా పోషిం చడం.
**ఆమడ:** నాల్గు కోసుల దూరం; 10 మైళ్ళదూరం.
**ఆమతించు:** పిలుచు, విందునకు ఆహ్వానించు (< ప్రా. ఆమంత-, సం. ఆమం త్రణ-).
**ఆమని:** వసంత రుతువు; తృప్తి కరం.
**ఆమూలాగ్రం:** వేరునుంచిచివరి వరకు; మొదటినుంచి చివరిదాక.
**ఆమెత:** విందు (< ప్రా. ఆమం తణ-, సం.ఆమంత్రణ).
**ఆమోదం:** అంగీకారం; ఆనందం; పరిమళం.
**ఆమ్రేడించు:** రెండు మూడు సార్లు పలుకు ( ఓహోహో, ఔరౌర-మొ.వి. ).
**ఆమ్లజని:** ప్రాణవాయువు.
**ఆయకం:** కుదువ, తాకట్టు.


ఆయవారం


ఆభరణం


ఆరగించు


ఆరతి


ఆరామం

**ఆయవారం:** బిచ్చమెత్తడం; బిచ్చమెత్తిన బియ్యం మొ.వి. (< సం. యాయా వర-).
**ఆయాసం:** అలసట, శ్రమ.
**ఆయుర్దాయం:** ఆయువు, జీవిత కాలం.
**ఆయుష్మంతుడు:** బహుకాలం జీవించేవాడు.
**ఆరంభం:** మొదలు; ప్రయత్నం.
**ఆరగించు:** తిను; తాగు.
**ఆరడి:** నింద; కష్టం; నష్టం.
**ఆరతి:** కర్పూరం మొ.వి. వెలి గించి ఇచ్చే నివాళి (< ప్రా. ఆరత్తియం, సం. ఆరాత్రి కమ్).
**ఆరాటం:** బాధ; సంతాపం; దుఃఖం.
**ఆరాధన:** గురువులను, పెద్ద లను, దేవతలను పూజిం చడం-సేవించడం.
**ఆరామం:** తోట; బౌద్ధుల కట్టడం.
**ఆరితేరు:** నిపుణతను పొందు.
**ఆరెకుడు:** తలారి, గ్రామ సంరక్ష కుడు (< ప్రా. ఆరక్ఖ-, సం. ఆరక్షక-).

**ఆరోపించు:** లేనిది మోపు, లేనిది కల్పించు.

**ఆరోహణం:** పైకి ఎక్కడం; మెట్లదారి; మొలకెత్తడం.

**ఆర్జనం:** సంపాదించడం.

**ఆర్జవం:** మంచినడవడి.

**ఆర్భాటం:** చెలరేగడం; బడాయి; హడావిడి. (ఇది సంస్కృతపదం కాదు. ఆర్చు - ఆర్పు+పాటం: బిగ్గరగా అరవడం).

**ఆర్యావర్తం:** వింధ్య హిమాలయాల నడిమిదేశం.

**ఆలంబనం:** ఆధారం.

**ఆలకించు:** విను (< ప్రా. ఆలక్ఖ-: తెలుసుకొను, సం. ఆలక్ష-చూచి తెలుసుకొను).

**ఆలవాలం:** స్థానం.

**ఆలించు:** విను.

**ఆలిచిప్ప:** నత్తగుల్ల.

**ఆలు:** స్త్రీ; భార్య.

**ఆలోకించు:** చూచు; ఆలోచించు, విమర్శించు.

**ఆవరణం:** ప్రాకారం, ప్రహరి; చుట్టునూగల స్థలం.

**ఆవరించు:** చుట్టుకొను; ఆక్రమించు.


ఆరోహణం


ఆవాసం


ఆవిర్భవించు


ఆలంబనం


ఆలిచిప్ప


ఆవరణం


ఆశీర్వచనం

**ఆవళి(లి):** గుంపు; వరుస (దీపావళి, ముక్తావళి, మృగావలి).

**ఆవశ్యకం:** తప్పనిసరి, ముఖ్యమైనది.

**ఆవాసం:** ఇల్లు, నివాసం; ఉండడం.

**ఆవించు:** ఆవిరితో ఉడికించు.

**ఆవిర్భవించు:** పుట్టు.

**ఆవిష్కరించు:** ప్రకటించు, వెల్లడించు.

**ఆవృతం:** ఆవరించినది, మూసినది, కప్పినది రక్షించబడినది (మేఘావృతం-మేఘాలచే కప్పబడినది).

**ఆవృత్తం:** పదే పదే వల్లించబడినది; వెనుకకు తిరిగినది; మరలినది.

**ఆవేదన:** బాధ.

**ఆవేదనం:** విన్నవించడం; వ్యాజ్యెం తేవడం.

**ఆశ:** కోరిక; దిక్కు.

**ఆశయం:** ఆధారం; స్థానం; అభిప్రాయం; లక్ష్యం.

**ఆశీర్వచనం:** దీవెన.

**ఆశుకవిత్వం:** అప్పటికప్పుడు వేగంగా చెప్పే కవిత్వం.

**ఆశుతోషుడు:** సులభంగా సంతోషించే వాడు.

**ఆశ్రమం:** మునిపల్లె; మఠం.

**ఆశ్రయం:** ఇల్లు; ఆధారం.

**ఆశ్వాసనం:** ఊరడించడం, ఓదార్చడం.

**ఆశ్వికుడు:** గుర్రపురౌతు.

**ఆస:** ఆశ, కోరిక (< ప్రా. ఆసా, సం. ఆశా).

**ఆసనం:** కూర్చుండడం; చాప, పీట మొ.వి.

**ఆస్కారం:** ఆధారం.

**ఆస్తి:** సొత్తు, సర్వస్వం; డబ్బు, ఇల్లు, పొలం మొ.వి.


ఆశ్రమం


ఆశ్వికుడు


ఆసనం


ఆహ్లాదం


ఆహ్వానం

**ఆస్తికుడు:** దేవుడు ఉన్నాడని నమ్మేవాడు.

**ఆస్థానం:** రాజసభ.

**ఆస్వాదించు:** చవిచూచు; తాగు; అనుభవించు.

**ఆహి:** కుదువ, తాకట్టు (< ప్రా. ఆహి-, సం. ఆధి-).

**ఆహుతి:** మంత్రాలతో దేవతలను ఉద్దేశించి అగ్నిలో వేల్చడం; మంటలో పడడం.

**ఆహ్లాదం:** సంతోషం.

**ఆహ్వానం:** పిలుపు.

# ఇ

**ఇ:** తెలుగు వర్ణమాలలో మూడో అచ్చు.

**ఇంకిపోవు:** నేలలో అడగిపోవు, ఎండిపోవు.

**ఇంకు:** ఎండిపోవు; నశించు; క్షీణించు.

**ఇంగలం, ఇంగిలం:** నిప్పు, అగ్గి. (< ప్రా. ఇంగాల-, సం. అంగార-).

**ఇంగితం:** మనస్సులోని భావాన్ని తెలిపే చేష్ట అభిప్రాయం.

**ఇంచుమించుగా:** సుమారుగా, రమారమి.

**ఇంటికాపు:** గృహస్థు

**ఇంటివేల్పు:** కులదైవం, గృహదేవత, ఇలవేల్పు.

**ఇంటిల్లిపాది:** ఇంటిలోని అందరూ.

**ఇంతి:** స్త్రీ; ఇల్లాలు; చెలికత్తె (< ప్రా. ఇత్థీ, సం. స్త్రీ).


ఇందిర


ఇంద్రచాపం


ఇంగలం


ఇంధనం


ఇంటికాపు


ఇంటిల్లిపాది

ఇట్టి

**ఇందిర:** లక్ష్మీదేవి.

**ఇందీవరం:** తామరపువ్వు.

**ఇందుప్పు:** సైంధవ లవణం (ఇందు+ఉప్పు).

**ఇందుడు:** చంద్రుడు. ఇందు వారం: సోమవారం.

**ఇంద్రచాపం:** ఇంద్రధనుస్సు.

**ఇంద్రజాలం:** గారడీ; కనుకట్టు విద్య; మోసపుచ్చడం.

**ఇంద్రియాలు:** కన్ను, ముక్కు, చెవి, నాలుక, కాలు, చేయి మొ. శరీరావయవాలు.

**ఇంధనం:** వెలిగించేది, మండించేది; వంటకట్టెలు, పెట్రోలు మొ.వి.

**ఇంపు:** తీపి; అందం; ఆనందం; ఇష్టం.

**ఇక్కట్టు:** ఆపద, ఇబ్బంది; ఇరుకైనది.

**ఇక్షుయంత్రం:** చెరకు గానుగ.

**ఇచ్ఛ:** కోరిక; మనస్సు; ప్రియమైనది (< ప్రా. ఇచ్ఛా, సం. ఇచ్ఛా). ఇచ్ఛకాలు: ముఖప్రీతి మాటలు.

**ఇట్టి:** ఇటుక.

**ఇటిక:** ( ప్రా. ఇట్టగా, సం. ఇష్టికా).

**ఇటుక:** పోతపోసి కాల్చిన మట్టి దిమ్మ.

**ఇడుమలు:** కష్టాలు.

**ఇతిహాసం:** వెనుక ఎప్పుడో జరిగిన కథ (భారతం, రామాయణం మొ వి.).

**ఇనుమడి:** రెట్టింపు, రెండు రెట్లు. ఇనుమడించు: రెట్టింపు అగు.

**ఇరవు:** ఇల్లు, స్థానం; అనుకూలం.

**ఇరుగు:** పక్కన ఉన్నది; దగ్గరలో ఉన్నది. ఇరుగుపొరుగు: పక్కల ఉన్నవారు.

**ఇరుసు:** బండి అక్షం, బండి చక్రపు కుండలను కలిపి ఉంచే ఇనుపగడారు.


ఇలకోడి


ఇల్లాలు


ఇస్లాం


ఇరుసు

**ఇలకోడి:** ఈల పురుగు, చిమ్మట.

**ఇలాయి:** గుడ్డతో చేసిన వత్తులు వేసే దివిటీ.

**ఇల్లటం, ఇల్లంట్రం, ఇల్లరికం:** అల్లుడు తన భార్యతో అత్తవారింటనే కాపురముండడం.

**ఇల్లాలు:** భార్య, గృహిణి; స్త్రీ.

**ఇవము:** మంచు; చల్లనిది (< ప్రా. హిమం, సం. హిమః).

**ఇసుము:** ఇసుక; కొంచెం.

**ఇస్లాం:** శాంతిమార్గం; మహమ్మదీయ మతం.

**ఇహం:** ఈలోకం; ఈలోకంలోని సుఖం. ఇహమూ పరమూ: ఈలోకం ఆలోకం (రెండు లోకాలకు సంబంధించిన కష్టసుఖాలు).

# ఈ

ఈ: తెలుగు వర్ణమాలలో నాలుగో అచ్చు.

ఈ: దగ్గరలో ఉన్నదానిని (వారిని) తెల్పుతుంది.

ఈక: పక్షిరెక్క.


ఈక

ఈటె: బల్లెం.


ఈటె

ఈడు: వయస్సు; సమానం ఈడుజోడు.


ఈత

ఈత[1]: ఈదడం.

ఈత[2]: పశువులు ఈనడం.

ఈత[3]: ఈతచెట్టు.

ఈచపోవు: ఎండిపోవు; సత్తువ లేనిదగు.

ఈడేరు: వయస్సువచ్చి ఉండు; పెరుగు; పూర్తిఅగు; కలుగు; నెగ్గు. కోరిక ఈడేరింది.

ఈతిబాధలు: అతివృష్టి అనావృష్టి.... మొ. బాధలు.

ఈదలు: ఈతచెట్ల గుంపు.


ఈన



ఈరసం


ఈత


ఈశానుడు

ఈన, ఈనె: ఆకుమధ్యలో ఉండే నరం.

ఈను: పశువులు పిల్లలను పెట్టు.

ఈపి, ఈరు: పేలు పెట్టిన గుడ్లు.

ఈరసం: కోపం; అసూయ, ఓర్వలేని తనం. (< సం. ఈర్ష, ఈర్ష్య).

ఈరు[1]: రెండు. ఈరారు:12, ఈరేడు:14, ఈరైదు: 10, ఈరెనిమిది:16

ఈరు[2]: హీనం, అల్పం. ఈరెండ : నీరెండ. ఈరెలుగు: హీనస్వరం.

ఈర్వెన: ఈపిని తీసే దువ్వెన.

ఈర్ష్య: ఓర్వలేనితనం.

ఈలకరచు: ప్రాణాలుబిగబట్టు.

ఈలువు: మంచి నడవడి; కులాచారం.

ఈళం, ఈడం: సింహళం, శ్రీలంక.

ఈవి, ఈగి: దానం.

ఈశానుడు: శివుడు.

ఈశాన్యం: ఉత్తరానికి తూర్పునకు మధ్యగల దిక్కు.

**ఈశుడు:** ప్రభువు, రాజు; శివుడు, భర్త.
**ఈశ్వరి:** దుర్గ; లక్ష్మి.
**ఈశ్వరుడు:** ప్రభువు, అధిపతి; సమర్థుడు, యజమానుడు; మగడు; శివుడు.


ఈశుడు


ఈసడించు

**ఈసడించు:** నిరసించు; అసహ్యించుకొను; పగబట్టు.
**ఈసు:** పగ, ద్వేషం; అసూయ; కోపం; నింద (< ప్రా. ఈసా, సం. ఈర్ష్యా).

# ఉ

**ఉ:** తెలుగు వర్ణమాలలో అయిదో అచ్చు.

**ఉంకించు:** పూనుకొను.

**ఉంకువ:** ఓలి, శుల్కం, కన్యా శుల్కం (< ప్రా. సుంక-: సం. శుల్క-).

**ఉంగరం:** చేతివేలికి పెట్టుకునే నగ.

**ఉంగుటం:** బొటనవేలు (< ప్రా. అంగుట్ఠ, సం. అంగుష్ఠ-).

**ఉండ:** గుళిక, పిండితోగాని, మట్టితోగాని గుండ్రంగా చేసినది. ఉండవిల్లు: ఉండలు వేసే విల్లు, వడిసెలవంటిది.

**ఉండ్రాళ్ళు:** ఉడికించిన వరి పిండిని ఉండలుగాజేసి ఆవిరిపై వండిన భక్ష్యాలు (గణపతికి ప్రీతిపాత్రమంటారు).

**ఉక్కిరిబిక్కిరి:** ఊపిరి ఆడక పోడవం.

**ఉక్కివం:** మోసం, వంచన, (< ప్రా. ఉక్కేవ, సం. ఉత్క్షప-). ఉక్కిడు, ఉక్కివుడు; చెడ్డవాడు; మోసగాడు; ఎవరినీ లెక్కచేయని వాడు.



ఉగాది



ఉంగరం



ఉంగుటం



ఉండ్రాళ్ళు



ఉగ్గం

**ఉక్కెర:** పిండీ బెల్లమూ కలిపిచేసిన తినుబండారం (< ప్రా. ఉక్కేర, సం. ఉత్కరికా).

**ఉగాది:** చాంద్రమానంలోని సంవత్సరంలో మొదటి రోజు, తెలుగువారి ఉగాది (యుగాది).

**ఉగ్గడన:** ప్రకటించడం, తెల్పడం (< ప్రా. ఉగ్ఘాడణం, ఉగ్ఘాడణా, సం. ఉద్ఘాటన). ఉగ్గడించు: తెలుపు, ప్రకటించు స్తుతించు, పొగడు.

**ఉగ్గడువు:** ఎక్కువ, అధికం (< ప్రా. ఉగ్ఘాడ, సం. ఉద్గాఢ).

**ఉగ్గం:** చేతితో పట్టుకోవడానికై కుండ మొదలైనవాటి మూతికి కట్టేతాడు (< ప్రా. ఉగ్గహ, సం. ఉద్గ్రాహ-).

**ఉగ్గు:** చనుబాలతో రంగరించి బిడ్డలకు పట్టే ఆముదం

మొ.వి. ఉగ్గుబాలు: ఉగ్గుబాలతో పెట్టిన విద్య: చిన్ననాటినుంచే అలవాటు చేసినది.
**ఉగ్రం:** భయంకరం; క్రూరమైనది; పొడుగైనది.
**ఉగ్రాణం:** సామానులు ధాన్యం ఉంచే గది.
**ఉగ్రుడు:** శివుడు.
**ఉచితం:** తగినది; తేరగా వచ్చినది.
**ఉచ్చరించు:** పలుకు; చెప్పు.
**ఉచ్చారణం:** పలకడం.
**ఉచ్చైశ్రవం:** నిక్కిన చెవులు గలది; ఇంద్రుని గుర్రం.
**ఉచ్ఛ్వాసం:** గాలిని లోనికి పీల్చుకొనడం.
**ఉజ్జగించు:** విడుచు; పోగొట్టు; తోసివేయు.
**ఉజ్జనం:** విడిచి పెట్టడం, తోసివేయడం, తొలగిపోవడం (< ప్రా. ఉజ్ఝణం, సం. ఉజ్ఝణ-). ఉజ్జగించు: విడుచు, ఉజ్జగింపు: వదలడం, విడుపు, ఉజ్జగిల్లు: తొలగు, పోవు.
**ఉజ్జాయింపు:** ఊహ.
**ఉజ్జి, ఉజ్జీ, ఉద్ది:** సాటి; జత; పోటీదారుడు.


ఉజ్జ్వలం


ఉడాయించు


ఉడుపులు


ఉచ్ఛ్వాసం


ఉదయించు

**ఉజ్జ్వలం:** ప్రకాశించేది; అడ్డు లేనిది.
**ఉటంకించు:** పేర్కొను; సంగ్రహంగా చెప్పు.
**ఉట్టంకించు:** పొగడు.
**ఉట్రవడియం:** ఒక రకం వడియం. ఉట్రవడియంగా: తెకతేరగా.
**ఉడాయించు:** పారిపోవు.
**ఉడుగర:** కానుక, బహుమతి.
**ఉడుపులు:** దుస్తులు.
**ఉత్తరించు:** ఖండించు.
**ఉత్తీర్ణం:** పరీక్షలలో పాసవడం.
**ఉత్తేజనం:** ప్రేరణ; ప్రోత్సాహం.
**ఉత్పలం:** కలువ.
**ఉత్పాతం:** చెడుసూచన; ఉపద్రవం.
**ఉత్సవం:** పండుగ; వేడుక. ఆనందం; ఉబలాటం; కోరిక; ప్రయత్నం.
**ఉదకం:** నీరు.
**ఉదధి:** సముద్రం.
**ఉదయించు:** పుట్టు; సూర్యుడుగాని చంద్రుడుగాని ఉదయమగు
**ఉదరం:** కడుపు.
**ఉదాసీనుడు:** ఏమీ పట్టించుకోనివాడు.

**ఉదాహరణం:** చెప్పడం; మాదిరికిచూపేది, తార్కాణం.
**ఉద్దం:** చెప్పు, పాదరక్ష. (< ప్రా. ఉద్దాహ-, సం. ఉద్వాహ ).
**ఉద్దరువు, ఉద్దర:** అరువు (< ప్రా. ఉద్ధార-, సం. ఉద్ధారః).
**ఉద్దేశం:** అభిప్రాయం; కోరిక; లక్ష్యం.
**ఉద్ధరించు:** బాగుచేయు, మేలు చేయు; ఆపదల నుంచి కాపాడు; మీదికెత్తు.
**ఉద్బోధించు:** ప్రేరేపించు; మేలుకొలుపు.
**ఉద్భవించు:** పుట్టు.
**ఉద్యమం:** ప్రయత్నం, పూనిక; కలసికట్టుగా ఒక లక్ష్యం కోసం ప్రయత్నించడం.
**ఉద్వాసన:** ఇంటినుంచిగాని, ఊరినుంచిగాని, ఏదైనా పదవినుంచిగాని వెడలగొట్టడం, తొలగించడం.
**ఉన్నతం:** ఎత్తయినది; గొప్పది.
**ఉన్ని:** గొర్రె మొ. వాటిబొచ్చు (< ప్రా. ఉణ్ణా-, సం. ఉర్ణా, ఊర్ణా).
**ఉన్మాదం:** పిచ్చి, వెర్రి.


ఉద్దం


ఉపన్యసించు


ఉన్నతం

**ఉపకథ:** పెద్దకథలో వచ్చే చిన్నకథ.
**ఉపకరణం:** సాధనం, పనిముట్టు.
**ఉపకారం:** మేలు.
**ఉపక్రమించు:** మొదలు పెట్టు.
**ఉపద్రవం:** ఆపద; బాధ.
**ఉపన్యసించు:** చెప్పు; విస్తరించి చెప్పు.
**ఉపన్యాసకుడు:** అధ్యాపకుడు.
**ఉపమ:** ఉపాయం.
**ఉపరితలం:** పైభాగం.
**ఉపవాసం:** పస్తు, తిండి తినక ఉండడం.
**ఉపశ్లోకించు:** పొగడు, స్తుతించు.
**ఉపసంహరించు:** మరలించు, నివారించు, విరమించుకొను, అణచుకొను.
**ఉపాఖ్యానం:** చిన్నకథ; ముఖ్యకథలో వచ్చే కథ.
**ఉపాధి:** బతుకుదెరువు.
**ఉపాసం:** పస్తు. (<సం. ఉపవాస).
**ఉప్పరం:** పైభాగం; ఆకాశం (< ప్రా. ఉప్పర, సం. ఉప్పర-).

**ఉప్పరిగ:** మేడ; మేడపైభాగం (< సం. ఉపకారికా).

**ఉప్పెన:** సముద్రపు పొంగు (< ప్రా. ఉప్పేణ-, సం. ఉత్ప్లవయతి).

**ఉబ్బసం:** శ్వాసరోగం, వగర్పు.

**ఉభయచరం:** నీటిలోనూ, నేల పైనా తిరిగేది- తాబేలు. నీటి లోను, భూమిమీదా, ఆకా శంలోనూ తిరిగేది- పక్షి.

**ఉమ్మ:** ఉక్క, వేడి (< ప్రా. ఉమ్హా, సం. ఊష్మ). ఉమ్మ గించు: ఉక్కపోయు. ఉమ్మ గిల్లు: వార్చిన అన్నం మొద లైనవి లోపలి ఆవిరిచే ఉడ కడం.

**ఉమ్మడి:** చాలమందికి హక్కు ఉండడం. ఉమ్మడి కుటుంబం.

**ఉరం:** రొమ్ము. ఉరగం- రొమ్ముతో నడచేది, పాము.

**ఉరువు:** రూపం, వస్తువు (< ప్రా. రూవ-, సం. రూప-).

**ఉర్రూతలూగు:** మిక్కిలి కుతూహలపడు.

**ఉర్లగడ్డలు:** బంగాళా దుంపలు

**ఉలిపికట్టె:** చెడ్డవాడు; పొగరు బోతు; ఎవరితోనూ చేరని వాడు.



ఉలూకం





ఉభయచరం

ఉష్ట్రం



ఉర్లగడ్డలు

**ఉలుపా:** కానుక.

**ఉలూకం:** గుడ్లగూబ.

**ఉల్క:** ఆకాశంనుంచి రాలిపడే చుక్క.

**ఉల్లంఘించు:** అతిక్రమించు; అనాదరంచేయు, నియమా లను దాటిపోవు.

**ఉల్లసమాడు:** (ఉల్లసము+ ఆడు): ఎత్తిపొడుచు, పరిహా సంచేయు.

**ఉల్లాసం:** ఆనందం, హాయి.

**ఉవిద:** స్త్రీ. (< సం. యువతి).

**ఉవ్విళ్ళూరు:** ఉబలాటపడు.

**ఉషస్సు:** తెల్లవారడానికి ముందు వచ్చే వెలుగు.

**ఉష్ట్రం:** ఒంటె.

**ఉష్ణం:** వేడిమి.

**ఉష్ణమాపకం:** వేడిమిని కొలిచే సాధనం.

**ఉష్ణమండలం:** ఉష్ణోగ్రత ఎక్కు వగా ఉండే ప్రాంతం.

**ఉష్ణోగ్రత:** వేడియొక్క తీవ్రత.

**ఉసికొలుపు:** పురికొలుపు; (కుక్కలు మొ. వాటిని) ప్రేరేపించు.

**ఉసురు:** ప్రాణం; ఆయుస్సు.

# ఊ

**ఊ:** తెలుగు వర్ణమాలలో ఆరో అచ్చు.

**ఊక:** ధాన్యపుపొట్టు, ఊకదంపుడు: పనికిరానిది.

**ఊగులాట:** అటూ ఇటూ ఊగడం; ఎటూ తేల్చుకో లేకపోవడం.

**ఊచకోత:** మూలముట్టుగ నరకివేయడం.

**ఊచపోవు:** కృశించు, క్షీణించు.

**ఊచముట్టుగా:** ఏమీ మిగలకుండా.

**ఊట:** ఊరినద్రవం; నీటిబుగ్గ; సారం.

**ఊడ:** మర్రి మొదలైన చెట్టు కొమ్మలనుంచి కిందికి దిగే వేరు.

**ఊడిగం:** సేవ; దాస్యం.

**ఊడ్పులు:** నాట్లువేయడం.


ఊదువత్తి


ఊపిరి


ఊరడించు


ఊడ


ఊసరవెల్లి


ఊడ్పులు

**ఊత:** ఆధారం, తోడ్పాటు.

**ఊదువత్తి:** అగరువత్తి

**ఊపిరి:** ఊర్పు, శ్వాసం; ప్రాణం. ఊపిరికుట్టు: ఊపిరి విడిచేటప్పుడు పుట్టే నొప్పి. ఊపిరితిత్తులు రొమ్ము: ఊపిరి పీల్చే తిత్తులు.

**ఊబి:** బురద.

**ఊరడించు:** ఓదార్చు.

**ఊరార్చు:** ఓదార్చు.

**ఊరుపు:** ఊపిరి; శ్వాసం.

**ఊరువు:** తొడ.

**ఊర్ధ్వం:** నిట్టనిలువుగా ఉన్నది; మీదిది; ఎత్తైనది. ఊర్ధ్వపుండ్రం: నిలువు బొట్టు.

**ఊళ:** నక్కకూత.

**ఊషరం:** చవుటినేల.

**ఊసర:** చవుటిది, చవుటినేల (<ప్రా. ఊసర-, సం. ఊషర-).

**ఊసరవెల్లి:** మూడు రంగుల తొండ.

**ఊసులు:** కబుర్లు.

# ఋ

**ఋ:** సంస్కృత వర్ణమాలలోని ఒక వర్ణం.

**ఋక్షం:** ఎలుగుబంటి.



ఋక్షం

**ఋగ్వేదం:** నాలుగువేదాలలో మొదటిది.

**ఋజువు:** మంచిది; వంకర లేనిది; కపటం లేనిది; ఋజువర్తనం: మంచి నడవడి.

**ఋణం:** అప్పు. ఋణదాత: అప్పిచ్చేవాడు. ఋణశేషం: మిగిలినఅప్పు.

**ఋతం:** సత్యం; పూజించదగినది.

**ఋతువు:** రెండు నెలలకాలం (వసంత ఋతువు,మొ. వి.).

**ఋషి:** ముని.



ఋషి

# ఎ

**ఎ:** తెలుగు వర్ణమాలలోని ఏడో అచ్చు.

**ఎంచు:** లెక్కించు; పొగడు; ఊహించు.

**ఎండగట్టు:** పొలానికి నీరు పెట్టకుండా ఉండు; తప్పులను నిరూపించు.

**ఎండమావులు:** ఎండలో నీటివలె కనిపించే సూర్యకిరణాల ఛాయలు (మావులు: మగ గుర్రాలు).

**ఎండుగులు:** ఎండబోసిన ధాన్యం.

**ఎండ్రకాయ, ఎండ్రి:** పీత.

**ఎకరం:** 4840 చ. గజాల స్థలం.

**ఎకరా:** ఏనుగులను కట్టివేసే మొగసాల.

**ఎకసక్కెం:** వేళాకోళం.

**ఎకాయెకి:** ఆగకుండా.

**ఎకిమీడు:** ప్రభువు, ఏలిక; శ్రేష్ఠుడు.


ఎగతాళి


ఎంచు


ఎండ్రకాయ


ఎనుం

**ఎక్కటి:** దిక్కులేనిది; ఒంటరితనం; శూరుడు; ద్వంద్వ యుద్ధం. (< ప్రా. ఎక్కట్ఠ-, సం. ఏకస్థ-).

**ఎగతాళి:** పరిహాసం.

**ఎగసన:** ఎక్కువ. ఏండ్లు ఎగసన బుద్ధులు దిగసన.

**ఎగ్గు:** కీడు; నేరం; తప్పు; నింద.

**ఎచ్చరిక:** జాగ్రత్త.

**ఎట్టకేలకు:** చిట్టచివరకు.

**ఎడద:** గుండె; మనస్సు.

**ఎడనీరు:** లేత కొబ్బరికాయ లోని నీరు.

**ఎడబాటు:** విడిపోవడం.

**ఎడ్డెతనం:** మొరటుతనం.

**ఎత్తిపొడుచు:** తప్పులు బైటబెట్టి మనస్సును నొప్పించు.

**ఎత్తు:** తూనిక; బరువు; పోలిక; ఉపాయం, పన్నుగడ.

**ఎత్తులిడు:** ప్రోత్సాహించు.

**ఎద్దడి:** లేకపోవడం. ఎద్దడినేల: నీరులేని భూమి. నీటిఎద్దడి: నీరు సరిగా లేకపోవడం,మేపు ఎద్దడి: మేతలేక పోవడం.

**ఎనుం:** గేదె, బర్రె.

**ఎరవు:** బదులు, ఎరవు సొమ్ము.

**ఎరుక:** తెలివి; జ్ఞానం; సోదె.

**ఎరువు:** బలంకోసం మొక్కలకు వేసే పేడ మొ. వి.

**ఎలుగు**[1]**:** ఎలుగుబంటి.

**ఎలుగు**[2]**:** కంఠస్వరం; పిలుపు.

**ఎల్లలు:** సరిహద్దులు.




**ఎల్లిదం, ఏలిదం:** చులకన; తిరస్కారం, అవమానం (< ప్రా. హేలిత-).

**ఎల్లిదుడు:** చేతకానివాడు; నీచుడు.

**ఎసరుపెట్టు:** హాని కలిగించు.

# ఏ

**ఏ:** తెలుగు వర్ణమాలలోని ఎనిమిదో అచ్చు.

**ఏకతం:** ఒంటరిగా ఉన్నది, రహస్యంగా ఉన్నది (< ప్రా. ఏకంత-, సం. ఏకాంత).

**ఏకం:** ఒకటి; ముఖ్యం.

**ఏకాంతం:** రహస్య స్థలం; రహస్య విషయం; ఒంటరిగా.

**ఏకాకి:** ఒంటరివాడు.

**ఏకాదశం:** పదకొండోది.

**ఏకీభవించు:** ఒక్కటిగా అగు, ఎదుటి వారి అభిప్రాయంతో కలియు.

**ఏకులు:** ఏకిన దూది చుట్టలు.

**ఏకైకం:** ఒకటొకటి.

**ఏకోదరులు:** ఒక తల్లి కడుపున పుట్టినవారు.

**ఏటవాలు:** పక్కకు వంగినది; వంపు.


ఏనిక


ఏరు


ఏకులు


ఏటవాలు

**ఏడుగడ:** రక్షకుడు; రక్షణ.

**ఏతం, ఏతాం:** బావుల నుంచి పొలాలకు నీరుతోడే సాధనం.

**ఏతెంచు:** వచ్చు; జరుగు, కలుగు.

**ఏనిక:** ఏనుగు.

**ఏపు:** అతిశయం; అభివృద్ధి; గర్వం.

**ఏమరిపాటు:** మరచిపోవడం; జాగ్రత్త లేక పోవడం.

**ఏరాలు:** తోడి కోడలు (ఏర+ ఆలు; < ప్రా. ఇయర-, ఏర-, సం. ఇతర-).

**ఏరు[1]:** ఎద్దులు కట్టి దున్నడానికి సిద్ధం చేసిన నాగలి.

**ఏరు[2]:** నొప్పి.

**ఏరు[3]:** నది.

**ఏరువాక:** ఏటేటా చేసే దుక్కి సాగు ప్రారంభం; ఏరువాక పండగ.

**ఏలిక:** యజమానుడు; రాజు.

**ఏవగించు:** అసహ్యించుకొను; వదలిపెట్టు.

# ఐ

**ఐ:** తెలుగు వర్ణమాలలోని తొమ్మిదో అచ్చు.

**ఐకమత్యం:** ఒకే అభిప్రాయం కలిగి ఉండడం; కలిసి మెలసి ఉండడం.

**ఐక్యం:** ఐకమత్యం, ఏకత్వం, ఒక్కటిగా ఉండడం.

**ఐదవ:** ముత్తైదువ; భర్తగల స్త్రీ. (< సం. అవిధవా: విధవకానిది). ఐదువతనం, ఐదువరాలు.


ఐమూల


ఐరావతం


ఐరేని


ఐదవ

**ఐపు:** జాడ, పోబడి, ఆచూకీ; తప్పు. వాడు ఐపు లేకుండా పోయాడు.

**ఐమూల:** రెండు దిక్కులకు నడుమగల మూల.

**ఐరావణం, ఐరావతం:** ఇంద్రుని ఏనుగు.

**ఐరేని:** రంగు రంగులతో చిత్రించిన పెళ్ళి కుండలు. (< ప్రా. అయిరాణీ: ఇంద్రాణి అనే దేవతను గూర్చి ముత్తైదవలు చేసే వ్రతం, సం. ఆహరణ- నివేదన చేయడం, బలి ఇవ్వడం).

**ఐశ్వర్యం:** సంపద; పాలకత్వం.

**ఐహికం:** ఈలోకానికిసంబంధించినది.

# ఒ

**ఒ:** తెలుగు వర్ణమాలలోని పదో అచ్చు.

**ఒంకె:** చిలుక కొయ్య.


ఒంకె

**ఒంటరి:** ఏకాకి.

**ఒంటిపాటు:** ఒంటరిగా ఉండడం.

**ఒంటు:** సరిపడు, అనుకూలపడు.

**ఒక్కపొద్దు:** ఒకపూట తిని ఉపవాసం ఉండడం.

**ఒగ్గం:** ఏనుగులు మొదలైన జంతువులను పట్టుకోవడానికి తవ్వే గొయ్యి. (< ప్రా. ఒగ్గహ-, సం. ఉపగ్రహ-).

**ఒగ్గు:** (వినడానికి చెవిని) పెట్టు; పందెంవేయు; వల, బోను మొ.వి. పన్ను; నిలుపు; ఇష్టపడు.

**ఒజ్జ:** ఉపాధ్యాయుడు, పురోహితుడు, ఆదర్శప్రాయం. (< ప్రా. ఒజ్జయ-, ఉవజ్ఝాయ-,


ఒట్టియ


ఒడిసెల


ఒడ్డాణం


ఒజ్జ

సం. ఉపాధ్యాయ-). ఒజ్జబంతి: విద్యార్థులు చూచి రాయడానికి ఉపాధ్యాయుడు రాసే పంక్తి, వరవడి.

**ఒట్టియ, ఒట్టె:** ఒంటె. (< ప్రా. ఒట్టియ-, ఉట్టియ-, సం. ఉష్ట్ర-).

**ఒడయడు:** యజమానుడు; ప్రభువు; స్వామి.

**ఒడలు:** శరీరం.

**ఒడికట్టు:** అన్నింటికి సిద్ధపడు.

**ఒడిసెల:** పిట్టలను తోలేందుకు రాళ్ళు విసరడానికి వాడే తాడు.

**ఒడుపు:** అనుకూలం; మాయ; ఉపాయం.

**ఒడ్డనం:** జూదంలో ఒడ్డిన వస్తువు; సేసలను తీర్చే పద్ధతి.

**ఒడ్డాణం:** స్త్రీలు నడుమున ధరించే నగ.

**ఒడ్డారం:** వంకరమాట; పోటీ; ఎదిరించడం, బడాయి.

**ఒడ్డు:**[1] గట్టు. ఒడ్డుకొను: తప్పుకొను. ఒడ్డెక్కు: విజయం సాధించు; ఆపదనుంచి బైటపడు.

**ఒడ్డు²:** పందెంలో ఒడ్డు; పడ వేయు; వల మొ. వాటిని వేయు; అడ్డగించు.

**ఒడ్డు³:** పెద్దది; వెడల్పు., ఒడ్డూ పొడుగూ.

**ఒడ్డోలగం:** నిండుకొలువు; పెద్ద సభ. (ఒడ్డు+ ఓలగం).

**ఒదరు:** వదరు; తిట్టు.

**ఒదుగు:** ఇమిడిపోవు; వెను దీయు; దాగుకొను.

**ఒద్దిక:** ప్రేమ; స్నేహం; అనుకూలం.

**ఒనగూడు:**. కలుగు; జనించు; కలియు.

**ఒనరించు:** చేయు; ఏర్పరుచు; ఇచ్చు.

**ఒప్పందం:** ఒడంబడిక.

**ఒప్పగించు:** వశపరచు, స్వాధీనంచేయు, అర్పించు. (<ప్రా. ఒప్పు , సం. అర్పిత-).

**ఒప్పరికించు:** ఉపేక్షించు (< సం. అపపరీక్ష).



ఒడ్డోలగం



ఒర



ఒళవు

**ఒప్పిదం:** తగినది; అందమైనది; వేడుక.

**ఒప్పు:** అందం; గుణం; సమ్మతి; సరైనది. ఒప్పుల కుప్ప: అందాలరాసి, మంచి గుణాలుకలది.

**ఒర:** కత్తి మొ. ఆయుధాలను ఉంచేపొది.

**ఒరగల్లు:** గీటురాయి.

**ఒరగు:** వంగు; ఆనుకొను,ఒరగు దిండు: ఆనుకునే దిండు.

**ఒరగొడ్డెం:** హేళనం; మర్యాద మీరిన మాట.

**ఒల్లమి:** ఇష్టపడకుండడం; అనాదరం.

**ఒళవు:** మర్మం, రహస్యం; రహస్య సమాచారం.

**ఒసగు:** ఇచ్చు. ఒసగులు: కానుకలు.

**ఒసులు:** సడలిపోవు; తొలగిపోవు.

# ఓ

ఓ: తెలుగు వర్ణమాలలోని పద కొండో అచ్చు.
ఓ: పిలవడాన్ని తెలుపుతుంది.
ఓంద్ర: గాడిద కూత.
ఓంద్రించు: ఓంద్ర పెట్టు.
ఓకరింత: డోకు, రోత.
ఓగిరం: అన్నం, ఆహారం. (< ప్రా. ఓగర: బియ్యం, ఓగిర-: మింగడం. ఓయిరం, ఓరం, ఓవిరం. పులిహోర: పుల్లటి అన్నం, పులి+ఓరెం.
ఓగు: కీడు; ఒట్టు; చెడ్డవాడు, నీచుడు. బాగోగులు: మంచి చెడ్డలు. ఓగుల వాడు: చెడ్డవాడు.
ఓజు: శిల్పి.
ఓటు: భయం; సంకోచం; వినయం.
ఓటమి: అపజయం; ఓడి పోవడం.


ఓడ


ఓడుబిళ్ళ


ఓంద్ర


ఓగిరం


ఓజు


ఓలలాడు

ఓడ: నావ. ఓడ రేవు: ఓడలు నిలిచే చోటు.
ఓడిక: ప్రవాహం.
ఓడు: ఓడిపోవు; భయపడు; పరుగెత్తు.
ఓడుబిళ్ళ: ఇంటిపై కప్పే పెంకు.
ఓదం: ఏనుగులను పట్టుకోవడానికి తవ్వే గొయ్యి (< ప్రా. ఓవాయ, అవవాద-, సం. అవపాత-).
ఓనామాలు: వర్ణమాల; ప్రారంభం. వారింకా ఓనామాలలోనే ఉన్నారు.
ఓరిమి: ఓర్పు; సహనం.
ఓలగం: కొలువుకూటం, సభ. కొలువు, సేవ. (< ప్రా. ఓలగ్గ-, సం. అవలగ్న-).
ఓలం: చాటు, దాపరికం; మరుగుచోటు.
ఓలలాడు: నీరు మొదలైనవాటిలో విహరించు; ఈదు.
ఓలి[1]: వరుస; క్రమం.
ఓలి[2]: కన్యాశుల్కం.
ఓవరి: లోపలిగది; అంతఃపురం (< ప్రా. ఓవరఅ: చిన్నగది: సం. అపవరక).

**ఓసరించు:** పక్కకు తొలగు, తొలగజేయు. వదలివేయు. ఓసరింత, ఓసరిల్లు, ఓసరు: తొలగిపోవడం. (<ప్రా. ఓసర-, జారు, వెనుకకు తొలగు, సం. అపసర-, తప్పుకొను, తొలగు).


ఓహటం

**ఓహటం:** జంకడం, భయపడడం, వెనుదీయడం. (<ప్రా. ఓహట్ట-: వెనుదీయడం; పారదోలడం, సం. అపహట్ట-: చలించడం, అపహస్త-: గెంటడం, తోయడం).

# ఔ

ఔ: తెలుగు వర్ణమాలలోని పన్నెండో అచ్చు.
ఔ: అవును.
ఔకు: బలంలేనిది; లోపం.
ఔగాములు: సత్యా సత్యాలు; మంచి చెడ్డలు, సుఖ దుఃఖాలు.
ఔచిత్యం: తగినది.


ఔదల


ఔ


ఔషధం

ఔదల: తల; ముందల: ఔదల తన్ను; తలదన్ను, మించి పోవు, ఔదలవంచు: తల వంచు.
ఔదార్యం: దానగుణం; గొప్ప తనం.
ఔరుసౌరుగా: అలసిపోయి నదిగా; క్షీణించినదిగా.
ఔషధం: మందు.
ఔసు: సొగసు, ఒయ్యారం. ఔసుకాడు: సొగసుగాడు, అందగాడు.

# క

**క:** తెలుగు వర్ణమాలలోని మొదటిహల్లు.

**కంకణం:** చేతి కడియం. కంకణం కట్టుకొను: ఒకపని చేయడానికి గట్టిగా పూనుకొను.

**కంకాళం:** ఎముకల గూడు; అస్థిపంజరం.

**కంకి:** జొన్నమొ. వాటిఎన్ను.

**కంగారు:** ఆదుర్దా, కలవరం; ఆస్ట్రేలియాలోని ఒక జంతువు.

**కంచం:** పళ్ళెం; కంచుతోచేసిన భోజనపాత్ర. (< ప్రా. కంసం, సం. కాంస్య–)

**కంచె:** రక్షణకోసం పొలం చుట్టూవేసేకంప.

**కంటకం[1]:** ద్వేషం; వైరం; విరుద్ధం, సరిపడనిది.

**కంటకం[2]:** ముల్లు.


కంటగించు


కంటె


కండె

కంకి


కంగారు


కంచం


కంచె


కంటకం

**కంటగించు:** కోపపడు; ద్వేషం చూపు.

**కంటె[1]:** ఒకనగ.

**కంటె[1]:** పంచమీ విభక్తి ప్రత్యయం. రామునికంటె లక్ష్మణుడు చిన్న.

**కండకావరం:** గర్వం.

**కండూతి:** దురద, తీట.

**కండె:** ఊచకు చుట్టిన దారపు చుట్టు; జొన్నమొ. వాటి కంకి.

**కంత:** కన్నం, రంధ్రం.

**కందకం:** అగడ్త.

**కందరం:** గుహ.

**కందుడు:** కుమారస్వామి. (< ప్రా. ఖంద–, సం. స్కంద–).

**కంపనం:** కదలేది; వణకడం.

**కంబళి:** గొంగడి.

**కకపాల, కక్కపాల:** యోగులు మొదలైనవారు చంకన వేలాడదీసుకునే సంచి. (< ప్రా. కక్ఖపాల–, సం. కక్షపాల–).

**కక్కసం:** క్రూరం, ఘోరం (< ప్రా. కక్కస–, సం. కర్కశ).

**కక్ష్య:** అంతస్తు; తరగతి; గ్రహాలుతిరిగేమార్గం.

**కచేరి, కచ్చేరీ:** కార్యస్థానం, ఆఫీసు (<ప్రా. కచ్చారం-, సం. కృత్యాగార-).

**కచ్చ:** వెనుకదోపుకునే దోవతి కొంగు; గోచి, మొలగుడ్డ. (<ప్రా. కచ్చా, సం. కక్షా).

**కచ్చడం:** గోచి; చీర (<సం. కక్షాపట-).

**కజ్జం[1] కజ్జ, కజ్జెం:** అరిసె. (<ప్రా. ఖజ్జ-, సం. ఖాద్య-).

**కజ్జం[2] కర్జం:** పని, కార్యం. (<ప్రా. కజ్జం: చేయవలసిన పని, సం. కార్య-).

**కటకటాలు:** ఇనుపచువ్వలతో ఏర్పరచిన తలుపులు, చెరసాల.

**కటాక్షించు:** అనుగ్రహించు; దయతో చూచు.

**కటారి, కటారం:** చిన్నకత్తి బాకు (<ప్రా. కట్టారీ, సం. కర్తారికా).

**కట్టడి:** ఆజ్ఞ, కట్టుపాటు; నిర్బంధం.

**కట్టిపెట్టు:** చాలించు; దాచి పెట్టు; ఇల్లుమొ.వి నిర్మించు; బంధించు.

**కట్టుబడి:** ఏర్పాటు.


కచ్చ


కటకటాలు


కతుకు


కటారి
కత్తిపీట
కథాకళి

**కఠినం:** గట్టిది; దయలేనిది; బాధించునది.

**కదుగు:** పూనుకొను; సాహసించు; మొదలుపెట్టు.

**కడగండ్లు:** ఇబ్బందులు, కష్టాలు.

**కడగొట్టు:** చివరిది. కడగొట్టు కొడుకు: అందరికంటె చివరి కొడుకు.

**కడతేర్చు:** చంపు; పోగొట్టు.

**కడుపు:** పొట్ట. కడుపులో చల్ల కదలకుండ: ఏమాత్రం శమపడకుండ. కడుపు మంట: ఓర్వలేనితనం.

**కణం:** గింజ; నీటిబొట్టు; చిన్నభాగం.

**కతుకు:** తిను; కుక్కలు మొ.వి. కొంచెం కొంచెంగా నాలుకతో తాగు.

**కత్తిపీట:** కూరలు మొ.వి. తరగ డానికై వంకరకత్తి అమర్చిన పీట.

**కత్తులబోను:** కత్తులు అమర్చి నబోను. కత్తులబోనుకాపురం: అన్నిరకాల కష్టాలు గల అత్తింటికాపురం.

**కథాకళి:** కేరళ రాష్ట్రంలోని ఒక నృత్యరీతి.

**కదంబం[1]:** కలగలుపు, మిశ్రం.

**కదంబం[2]:** కడిమిచెట్టు.

**కదుపు:** మంద, గుంపు. కదుపులుకట్టు: గుంపుగా కూడు.

**కదుం:** బొప్పి, దెబ్బతగిలిన చోట నెత్తురు గడ్డకట్టగా ఏర్పడినవాపు.

**కథనం:** చెప్పడం.

**కనకం:** బంగారం.

**కనికరం:** దయ, జాలి.

**కనిష్ఠం:** చాలచిన్నది, అన్నిటికంటె చిన్నది; చిట్టచివరిది.

**కనుమ:** కొండలమధ్యదారి. పడమటికనుమలు.

**కనుం:** సంక్రాంతి పండుగకు తర్వాతిరోజు.

**కన్నాకు:** ముఖ్యుడు. భీష్ముడు కౌరవులకు కన్నాకు.

**కన్నియ, కన్నె:** బాలిక; కూతురు; లేతది. (< ప్రా. కణ్ణా, సం. కన్యకా).

**కన్నుమూయు:** మరణించు; నిద్రించు; మోసగించు.

**కపాలం:** తలపుర్రె.

**కపోతం:** పావురం. శ్వేతకపోతం శాంతికి గుర్తు.


కదంబం


కదుపు


కమఠం


కమ్మరి


కనుమ


కపాలం


కరం

కపోతం

**కప్పం:** పన్ను; కానుక.

**కప్పురం, కపురం:** కర్పూరం. (< ప్రా. కప్పూర–, సం. కర్పూర).

**కబళం:** అన్నపుముద్ద. కబళించు: మింగు.

**కబ్బం:** కావ్యం. (< ప్రా. కబ్బం, సం. కావ్య–).

**కమఠం:** తాబేలు.

**కమసాలి, కమ్మసాలి:** బంగారం మొదలైన లోహాలతో పనిచేసేవ్యక్తి. తెగ (< ప్రా. కమ్మసాలా, సం. కర్మశాలా).

**కమ్మరి:** ఇనుపపనిచేసే వ్యక్తి; తెగ (< ప్రా. కమ్మార–, సం. కర్మకార–).

**కయ్య:** కాలువ; పొలంలో కొంత భాగం.

**కయ్యం:** కలహం; యుద్ధం. కయ్యానికి కాలుదువ్వు: పోట్లాటకు సిద్ధమగు.

**కరదీపిక:** దివిటీ, చేతిలోని దీపం; మార్గదర్శకం.

**కరం:** చేయి, కిరణం, ఏనుగుతొండం; పన్ను.

**కరవాలం:** కత్తి, ఖడ్గం.

**కరి:** తొండంగలది, ఏనుగు.

**కర్కాటరేఖ:** భూమధ్యరేఖకు $22\frac{1}{2}$ డిగ్రీల ఉత్తరంగా గుర్తించిన అక్షాంశరేఖ.

**కర్కాటకం:** ఎండ్రకాయ.

**కర్కోటకం:** పురాణాలలో ప్రసిద్ధమైన ఒక పాము పేరు.

**కర్కోటకుడు:** చాలచెడ్డవాడు.

**కర్జం:** పని; చేయదగినది.

**కర్ణం:** చెవి; త్రిభుజంలో సమకోణానికిఎదురుగాఉండేరేఖ.

**కర్ణభేరి:** చెవిలోపలి డప్పువంటి పొర.

**కర్ణాకర్ణి:** వరుసగా ఒకరినుంచి ఒకరు వినడం. ఆవిషయం కర్ణాకర్ణిగా విన్నాము.

**కర్త:** చేసేవాడు; యజమానుడు.

**కర్తవ్యం:** చేయవలసినది.

**కర్షకుడు:** రైతు.

**కళంకం:** గుర్తు; మచ్చ; చెడ్డపేరు; తప్పు.

**కలంకారీ:** గుడ్డలపై వేసే అద్దకం. బందరు కలంకారీ చీరలు విలువైనవి.

**కలకంఠం:** తీయటిగొంతు కలది, కోయిల.


కరి


కర్కాటకం


కలశం


కలహంస


కర్ణం


కలుగు




కర్షకుడు


కళ్యాణం


కలకంఠం

**కలకలం:** జనం గుంపులో పుట్టిన అరవులు.

**కలవరం:** కలత, చింత; కలవరించడం.

**కలశం:** పూజలో వాడే కుండ లేక చెంబు; గుడిగోపురం మీది కలశం.

**కలహం:** పోట్లాట; యుద్ధం.

**కలహంస:** రాజహంస.

**కలాలి:** కల్లు–సారాయి అమ్మేవాడు.

**కలిమి:** సంపద; పుట్టుక. కలిమి లేములు కావడి కుండలు.

**కలుగు:** కన్నం, బొరియ, గుహ.

**కలుషం:** నిందించదగినది, పాపం; మురికి.

**కల్పనం:** లేనిదిమోపడం; ఊహ; ఏర్పాటు.

**కల్మషం:** పాపంగలది; మురికి గలది.

**కళ్యాణం:** పెళ్ళి; ఉత్సవం, వేడుక; శుభం.

**కల్లి[1]:** అబద్ధం; నేరం; హాని.

**కల్లి[2]:** తోట, దొడ్డి మొ..వాటికి వేసే ముళ్లకంచె.

**కల్లోలం:** గలభా; సంతోషం; పెద్దఅల.
**కళత్రం:** భార్య.
**కళాసీ:** ఓడమీది పనివాడు.
**కళ్ళం:** ధాన్యం నూర్చేచోటు.
**కవ:** రెండు; జత; జోడు. కవలలు: అమడపిల్లలు.
**కశేరుక:** వెన్నెముక.
**కసరు:** కోపపడు; విసుగుకొను; చలించు; దోషం.
**కసాయి:** కటికవాడు; దయలేనివాడు.
**కసి:** కోపం.
**కసుగందు:** పసిబిడ్డ.
**కసుమాలం:** మురికి పదార్థం; రోతకలిగించేది, చెడ్డది.
**కాంక్ష:** కోరిక.
**కాంచనం:** బంగారం.
**కాంచు:** చూచు; గ్రహించు; బిడ్డనుకను.
**కాండం:** గ్రంథంలోని భాగం; చెట్టుబోదె.
**కాంతారం:** పెద్దఅడవి.
**కాంతి:** వెలుగు; అందం.
**కాందిశీకుడు:** రక్షణకోరి ఇతర దేశాలకూ, ప్రాంతాలకూ వలసవెళ్ళేవాడు.


కాకితం


కాగడా


కవ


కానుక


కసుగందు


కామధేనువు


కాంతి


కాయం

**కాకతాళీయం:** అనుకోకుండా జరిగేది.
**కాకితం, కాగదం, కాగితం:** పేపర్ (< పా. కాగజ్).
**కాగడా:** దివిటీ.
**కాచు:** రక్షించు; ఎదురుచూచు; క్షమించు.
**కాటకం:** కరవు.
**కాణాచి:** తాతముత్తాతల నుంచి వచ్చినది; ఎన్నోతరాలుగా ఉంటున్న నివాసం.
**కాన:** అడవి.
**కానుక:** బహుమతి.
**కాపరి:** కాచేవాడు; రక్షకుడు.
**కాపు:** రక్షణ, కావలి; రక్షకుడు.
**కాపురం:** నివాసం; సంసారం.
**కామధేనువు:** కోరినవాటిని ఇచ్చే ఆవు (దేవలోకంలోనిది).
**కామాటం:** కూలిపని.
**కామాటి:** కూలిపనివాడు.
**కాయకం:** జీవనోపాధి, వృత్తి.
**కారాగారం:** చెరసాల.
**కాయం:** దేహం.
**కారు[1]:** కాలం, సమయం. తొలుకారు, ముక్కారు.

**కారు²:** నలుపు. కారుచీకటి: దట్టమైనచీకటి. కారు నలుపు: ఎక్కువ నలుపు.
**కారు³:** అడవి. కారుకోడి: అడవికోడి. కారుచిచ్చు: అడవిలో చెట్లు ఒకదానిని ఒకటి తగలడంవల్ల కలిగే రాపిడిలో పుట్టే నిప్పు, దవానలం.
**కారుణ్యం:** దయ.
**కార్యదర్శి:** పనులు నిర్వహించేవాడు.
**కాలధర్మం:** మరణం.
**కాలసర్పం:** నల్లతాచు పాము.
**కాళె:** బూరగొమ్ము, బాకా, వాద్యవిశేషం (< ప్రా. కాహళియా, సం. కాహళికా).
**కావరం:** గర్వం. కండకావరం.
**కావి:** ఎరుపు; కాషాయవస్త్రం.
**కాషాయం:** ఎర్రటిది; ఎర్రటి వస్త్రం.
**కింకరుడు:** సేవకుడు, దాసుడు.
**కించిత్తు:** కొంచెం.
**కికురించు, కిక్కురించు:** మోసగించు; పోగొట్టు.


కారు


కారు

కిరీటం


కాలసర్పం

కీచకం


కీటకం


కీరం


కింకరుడు

**కిక్కురుమనక:** నిశ్శబ్దంగా, నోరెత్తకుండా.
**కిటుకు:** చెడ్డపని; మోసం; రహస్యం; చిక్కు.
**కినియు:** కోపించు; ద్వేషించు.
**కినుక, కిన్క:** కోపం.
**కిమ్మనక:** నోరెత్తక, మాట్లాడక.
**కిరీటం:** రాజులు తలపై ధరించే భూషణం.
**కిరీటి:** అర్జునుడు.
**కిలారం, కీలారం:** పసులమంద.
**కిశోరం:** శిశువు; పిల్ల.
**కీచకం:** వెదురుబొంగు.
**కీచురాయి:** రాత్రిపూట రొద చేసే ఒక పురుగు, చిమ్మట.
**కీచులాడు:** దెబ్బలాడు; వాదులాడు.
**కీటకం:** పురుగు.
**కీడు:** చెడుపు, చేటు; తప్పు; పాపం.
**కీరం:** చిలుక.
**కీర్తన:** పొగడ్త; చెప్పడం; పాట.
**కీర్తి:** మంచిపేరు. కీర్తించు: పొగుడు. కీర్తిశేషుడు: కీర్తియే మిగిలినవాడు, చనిపోయిన వ్యక్తి.

**కీలు:** శరీరంలో ఎముకలను కలిపేభాగం, అతుకు; రహస్యం; ఉపాయం; ముడి; మోసం. కీలుబొమ్మ: మర బొమ్మ. కీలుముడి: జారు ముడి.

**కుంచం:** నాల్గుమానికల కొలత.

**కుంచె:** గుత్తిగాకట్టిన నెమలియీకల కట్ట; బొమ్మలువేసే బ్రష్షు.

**కుంజరం:** ఏనుగు.

**కుంటుపడు:** తగ్గు; ఆగిపోవు; నడవలేనిదగు; చెడు; తెగిపోవు.

**కుండలం:** చెవిపోగు.

**కుండలీకరణం:** సున్నచుట్టడం; బ్రాకెట్.

**కుందకం:** అడ్డు; లోపం.

**కుందనం:** అపరంజి; మేలిమి బంగారం.

**కుంది, కుందె:** దాన్యం చెదరిపోకుండ రోటి చుట్టూ ఉంచే కుదురు; రాతిరోలు; దీపపాత్ర.

**కుందు:** ఏడ్చు; బాధపడు; తగ్గిపోవు; దుఃఖం; తక్కువది.


కుంభం


కుక్కగొడుగు


కుంచె


కుంజరం


కుక్కుటం


కుంది


కుటీరం

**కుందేటికొమ్ము:** లేని వస్తువు, అసంభవ విషయం.

**కుంభం:** కడవ; కుండ; ఏనుగు తలపైభాగం. కుంభవృష్టి: కడవలతో గుమ్మరించినట్లు కురిసే పెద్దవాన.

**కుక్కగొడుగు:** పుట్టగొడుగు.

**కుక్కి:** తాళ్ళుతెగిగాని వదులైగాని పల్లం పడిన మంచం.

**కుక్కుటం:** కోడి.

**కుక్షి:** కడుపు.

**కుచ్ఛితం:** నీచమైనది (<ప్రా. కుచ్ఛిత–, సం. కుత్సిత–).

**కుచ్చెలు:** మడత, పింజె; పావడా; పిడుకలు మొ. వాటిపోగు, రాసి.

**కుజుడు:** అంగారక గ్రహం. కుజవారం: మంగళవారం.

**కుటిలం:** వంకరైనది; మోసంతో కూడినది.

**కుటీరం:** గుడిసె.

**కుటుంబం:** తల్లి, తండ్రి, పిల్లలు మొ. వారు; సమాన లక్షణాలుగల ప్రాణులవర్గం.

**కుట్టుసురు:** కొరప్రాణం, కొద్దిగామిగిలిన ప్రాణం.

**కుట్ర:** ద్రోహబుద్ధితో చేసేపన్నుగడ; క్రూరం. అంతా కలిసి వానిపై కుట్రపన్నారు.

**కుడితి:** బియ్యం మొ.వి కడిగిన నీళ్ళు; పశువులు తాగడానికి పిండి పొట్టుకలిపిన నీళ్ళు.

**కుడుం:** ఉండ్రం, మోదకం.

**కుడ్యం:** గోడ.

**కుతి:** దుఃఖం; జాలి; ఆసక్తి.

**కుతూహలం:** అభిలాష; సంతోషం; ఆశ్చర్యకరమైనది.

**కుత్తుక:** గొంతు. కుత్తుక బంటిగా: గొంతుదాకా; విందు భోజనం కుత్తుక **బంటిగా తిన్నారు.**

**కుదుపు:** కదలించు; కదలిక.

**కుదురు:** స్థిరపడు. పెళ్ళికుదిరింది; దొరకు: ఇల్లు కుదిరింది; స్థిరమైనది; వంశం; పొందిక.

**కుదువ:** తాకట్టు.

**కునుకు:** నిద్ర; నిద్రచేతూగు. కోడికునుకు: కొద్ది నిద్ర, పట్టీపట్టని నిద్ర.


కుప్ప


కుప్పిగంతు


కుడ్యం


కుమ్మరి


కుత్తుక


కురంగం


కురులు

**కుప్ప:** రాసి; ధాన్యం, గడ్డి మొ.వాటి పోగు. కుప్పతెప్పలుగా: ఎక్కువగా

**కుప్పసం:** చొక్కా; రైక; పాము కుబుసం (<ప్రా. కుప్పాస–, సం. కూర్పాస–).

**కుప్పిగంతు:** చిన్నగంతు; చిన్నపిల్లల ఆట. హనుమంతుని ముందు కుప్పిగంతులు.

**కుములు:** లోలోపల బాధపడు; సడలిపోవు.

**కుమ్మరి:** కుండ మొదలైన మట్టిపాత్రలు చేసేవాడు. (<ప్రా. కుంభార–, సం. కుంభకార–).

**కుమ్మరించు:** కడవ మొ. వాటి నుంచి నీళ్లను పారబోయు. కుండలతో కుమ్మరించినట్లు వాన కురిసింది.

**కుమ్ములాడు:** పోట్లాడు.

**కురంగం:** జింక.

**కురుక్షేత్రం:** భారతయుద్ధం జరిగినచోటు

**కురుచ:** పొట్టి; తక్కువ; కొద్ది కాలం.

**కురులు:** తలవెంట్రుకలు.

కురూపి: వికృతరూపంగల వ్యక్తి.

కులిశం: ఇంద్రునిచేతి వజ్రాయుధం.

కుళ్ళు: పళ్ళు మొ.వి పాడగు. మామిడిపండు కుళ్ళింది. దుఃఖించు; చింత; చెడ్డ తలంపు. వాడుకుళ్ళుమనిషి. కుళ్ళుబోతు: అసూయాపరుడు.

కుశలం: క్షేమం; నేర్పు . కుశలప్రశ్న: క్షేమసమాచారం అడగడం.

కుశాగ్రబుద్ధి: చాల చురుకైనవాడు.

కుసుమం: పువ్వు.


కురూపి


కూడలి


కూన


కూపం

కుస్తరించు: బుజ్జగించు; ఊరడించు; ఒప్పించు; ధరించు.

కుహరం: రంధ్రం; గుహ; తొఱ్ఱ.


కుహరం

కూకటివేరు: తల్లివేరు.

కూచం: గుంజ.

కూచీచేయు: దండెత్తు, సైన్యంతో బయలుదేరు.


కూచం

కూటం[1]: గుంపు, రాసి; అసత్యం, మోసం కూటసాక్ష్యం: తప్పుడు సాక్ష్యం.

కూటం[2]: సభాభవనం; చావడి, కొలువుకూటం.

కూడలి: దారులు నదులు కలిసే చోటు.

కూడు[1]: అన్నం, తిండి.

కూడు[2]: గుంపుగాచేరు; కలసి ఉండు, సంకలనంచేయు.

కూన: పశు పక్షుల శిశువు. పిల్లికూన, పులికూన; శిశువు.

కూనరాగం: లోలోపల మెల్లగా పాడుకునే రాగం.

కూపం: నుయ్యి; గుంట. కూపకూర్మం: నూతిలోని తాబేలు; కూపస్థమండూకం: నూతిలోని కప్ప. (తాను ఉండే తావు తప్ప ఇతర ఇతర (ప్రపంచం తెలీనిది).

కూరిమి, కూర్మి: ప్రేమ; స్నేహం.

కూర్కు: నిద్ర.

కూర్చు: కలుపు, చేర్చు; అంటించు, అతుకు కూడబెట్టు, పొగుచేయు, రచించు.

కూర్పరి: రచయిత.

**కూలం:** చెరువు, నది మొ. వాటిగట్టు. కూలంకషం: గట్లను తాకేది, కూలంకషంగా: పూర్తిగా.

**కూళ:** వెడ్డవాడు; అవివేకి; దరిద్రుడు.

**కృకలాసం:** తొండ; ఊసరవెల్లి.

**కృతకృత్యుడు:** అవసరమైన పని చేసినవాడు—పనిని నెరవేర్చినవాడు.

**కృతఘ్నుడు:** చేసిన మేలు మరచినవాడు.

**కృతజ్ఞుడు:** చేసినమేలు మరవనివాడు.

**కృతి:** గ్రంథం; నేర్పరి; ధన్యుడు.

**కృత్రిమం:** సహజం కానిది, కల్పితమైనది; కృత్రిమమైత్రి.

**కృప:** దయ.

**కృపణుడు:** పిసినిగొట్టు, లోభి; బీదవాడు.

**కృపాణం:** కత్తి.

**కృపాళుడు:** దయగలవాడు

**కృశించు:** చిక్కిపోవు, సన్నగిల్లు.

**కృషి:** సేద్యం; శ్రమ.

**కృషీవలుడు:** రైతు

**కృష్ణజన్మస్థానం:** శ్రీకృష్ణుడు పుట్టినచోటు, చెరసాల.


కూలం


కెరటం


కేంద్రం


కృకలాసం


కేతనం


కేసరి

కృపాణం


కృశించు


కృషీవలుడు

**కృష్ణాజినం:** నల్లని జింకతోలు.

**కెందమ్మి:** ఎర్రతామర.

**కెంపు:** ఎరుపు; పద్మరాగమణి.

**కెరటం.** అల.

**కేంద్రం:** వృత్తం మధ్యభాగం; మూలస్థానం.

**కేటాయించు:** భాగాలుచేసి పంచు, వేరుచేయు.

**కేతనం:** జండా; ఇల్లు.

**కేరడం:** గేలి పరిహాసం; చమత్కారపుమాట; తిరస్కారపుమాట.

**కేరింత:** నవ్వు; ఉత్సాహంగా వేసే కేక.

**కేలు:** చేయి, కేలుమోడ్చు: నమస్కరించు.

**కేసరి:** సింహం (మెడమీద కేసరం—జూలు కలది).

**కైంకర్యం:** సేవ.

**కైపు:** మత్తు, మైకం; కపటం.

**కైలాటం:** మోసం; కీడు.

**కైలాసం:** శివపార్వతుల నివాసస్థానం.

**కైవసం:** స్వాధీనం.

**కైవారం:** చేయెత్తి పొగడడం; స్తోత్రం.

**కైవాలు:** పంట బాగాపండి వంగు; పండిపోవు.

**కొంకనక్క:** చిన్నజాతినక్క, పిరికినక్క.

**కొంకర:** వంకర, వంపు—చలికి ఒళ్ళంతా కొంకర్లు పోయింది.

**కొంగు:** చీరచెరగు. కొంగుబంగారం: తనకుతానే దొరికే వస్తువు.

**కొండెక్కు (కొండ+ఎక్కు):** ఉన్నత స్థితికి వచ్చు; గర్వం చేత మితిమీరు; ఆరిపోవు. దీపం కొండెక్కింది.

**కొండెం:** చాడీ.

**కొక్కరాయి:** కొంగ.

**కొత్వాలు:** పోలీసు అధికారి

**కొప్పెర:** వెడల్పు మూతిగల చిన్నపాత్ర.

**కొయ్య:** మూర్ఖుడు – కొరకరాని కొయ్య. ఎంతచెప్పినా వినని వాడు.

**కొలుచు[1]:** కొలతవేయు; ధాన్యం.

**కొలుచు[2]:** సేవించు; నమస్కరించు.


కైవాలు


కొంకనక్క


కొల్లాయి


కొక్కరాయి


కొప్పెర


కోదండం


కోనేరు

**కొలుపు[1]:** ఇష్టపడు; పనికివచ్చు.

**కొలుపు[2]:** సేవ; నమస్కారం; జాతర.

**కొలువు:** సేవ; రాజసభ; ఉద్యోగం.

**కొల్ల:** దోపిడీ; సమృద్ధి. కొల్లగొట్టు: దోపిడీచేయు; కోకొల్లలుగా: దండిగా.

**కొల్లాయి:** చిన్న అంగవస్త్రం.

**కొసరు:** కోరు; కోరిక; సంకోచించు; సరకులు కొనేవారికి అమ్మకపుదారుడు ఇచ్చే పెచ్చు.

**కోడిగం:** వంచన; ఎగతాళి; కొంటెతనం.

**కోదండం[1]:** తప్పుచేసిన పిల్లలను పట్టుకొని వేలాడదీసే తాడు.

**కోదండం[2]:** విల్లు.

**కోన[1]:** అడవి.

**కోన[2]:** మూల; లోయ.

**కోనేరు:** దేవునిగుడి ఆవరణలోని చెరువు.

**కోపు:** వైపు; బలపంకడ్డీ; విల్లు కొన; నమస్కారం.

కోయిల[1]: దేవాలయం (కో + ఇల్ = దేవునిఇల్లు).

కోయిల[2]: కోకిల. (< ప్రా. కోఇల–, సం. కోకిల–).

కోరు[1]: కోరికను తెలుపు; ఎదురుచూచు.

కోరు[2]: గీరు; గీరినకొబ్బెర; పంటలో భాగం. సంగోరు: సగం భాగం. ఇరుగోరు: రెండు భాగాలు.

కోర: కోరపల్లు; పల్లు. కోరలు తీసినపాము.

కోలాటం: చేతికోలలతో తాళం వేస్తూ ఆడే ఆట.

కోలాహలం: కలకలం; హడావిడి.

కోలుపులి: పెద్దపులి.

కోవిదుడు: తెలిసినవాడు, పండితుడు.

కోశం: నిఘంటువు; మొగ్గ; పెట్టె; కత్తిఒర; సామాను ఉంచేగది; ఖజానా.

కోశాధికారి: ఖజానాకు అధికారి; ట్రెజరర్.

కోస్తా: సముద్ర తీరప్రాంతం. కోస్తాజిల్లాలు: శ్రీకాకుళం నుంచి నెల్లూరుదాక గల జిల్లాలు).


కోయిల


కోయిల


కోర


కౌముది


కోలుపులి


కోశం


కోస్తా

కౌంతేయులు: కుంతి కొడుకులు (ధర్మరాజు, భీముడు, అర్జునుడు).

కౌటిల్యుడు: అర్థశాస్త్రం రచించిన చాణక్యుడు చంద్రగుప్త మౌర్యుని మంత్రి.

కౌతుకం: వేడుక; సంతోషం; తెలుసుకోవాలన్న గట్టి కోరిక.

కౌద్దాలికుడు: గుద్దలితో తవ్వి దుంపలు తిని జీవించేవాడు.

కౌపీనం: గోచి; పుట్టగోచి.

కౌమారం: బాల్యం తరువాతి దశ.

కౌముది: వెన్నెల.

క్రతువు: యజ్ఞం.

క్రమశిక్షణ: సకాలంలో సక్రమంగా పనులు చెయ్యడం.

క్రమ్మర: మరల. క్రమ్మరించు: మరలించు. క్రమ్మరు: మరలివచ్చు).

క్రయం[1]: వెల; కొనుగోలు.

క్రవ్యాదం: మాంసం తినే జంతువు. క్రవ్యాదుడు: రాక్షసుడు.

క్రారవడి: సంయుక్త హల్లులలో రెండోదైన రేఫంగుర్తు.
క్రిక్కిరియు: నడుమ ఖాళీ లేకుండా ఉండు.
క్రితం: పూర్వం, మునుపు.
క్రిమి: పురుగు, కృమి.
క్రియ: క్రియావాచకం; పని; విధం; ఉపాయం.
క్రీడాకారులు: ఆటగాళ్ళు.
క్రీడావనం: ఉద్యానవనం, ఆటతోట.
క్రీడి: అర్జునుడు.
క్రీనీడ: కిందినీడ. దీపం క్రీనీడలో కూర్చున్నారు.
క్రుంకు: అస్తమించు; మునిగి స్నానం చేయు, చచ్చు; అడుగునకు పోవు.


క్రీడాకారులు


క్రేపు


క్రిమి


క్రోడం

క్రూరుడు: చెడ్డవాడు.
క్రేపు: దూడ.
క్రొక్కారు: వానాకాలం.
క్రోడం: పంది.
క్రోడీకరణం: అన్ని విషయాలను ఒకచోట చేర్చడం. క్రోడీకరించు: ఒకచోట చేర్చు.
క్రోధం: కోపం.
క్లిష్టం: కష్టం; క్షీణించినది; వాడినది, చెదరినది.
క్లేశం: దుఃఖం; బాధ; కోపం.
క్వాచిత్కం: అక్కడక్కడ అప్పుడప్పుడు జరిగేది.

# క్ష

**క్షంతవ్యుడు:** మన్నించ దగిన వాడు.

**క్షణభంగురం:** క్షణకాలంలో నశించేది.

**క్షమ:** ఓర్పు.

**క్షమాపణం:** మన్నించుమని వేడుకొనడం.

**క్షామం:** కరవు.

**క్షారం:** ఉప్పు.

**క్షాళనం:** శుద్ధిచేయడం, కడగడం.

**క్షీణించు:** తగ్గిపోవు; నశించు.

**క్షీరం:** పాలు.

**క్షీరదం:** పిల్లలకు పాలిచ్చి పోషించే జీవి.

**క్షుణ్ణంగా:** పూర్తిగా.

**క్షేత్రం:** పొలం; పుణ్యస్థలం; నివాసం.

**క్షేమం:** కుశలం; ఉన్నదానిని రక్షించుకొనడం. యోగక్షేమాలు: లేనిది సంపాదించడం, ఉన్నదానిని రక్షించుకొనడం.

**క్షోభించు:** కలతపడు.

**క్ష్మ:** భూమి, క్ష్మాపతి: రాజు.



ఖండిక



ఖగం



క్షామం



ఖడ్గం



ఖరం



క్షేత్రం

# ఖ

**ఖండం:** సగం; భాగం; ఖండించ బడినది,ఖండకథ; చిన్నకథ.
ఖండకావ్యం: చిన్నకావ్యం, చిన్నచిన్న శీర్షికలుగల కవిత లను చేర్చికూర్చిన కావ్యం.

**ఖండిక:** చిన్నపల్లె.

**ఖగం:** పక్షి, ఆకాశంలో తిరిగేది. ఖగపతి: పక్షులకు రాజు, గరుత్మంతుడు.

**ఖగోళం:** ఆకాశగోళం

**ఖజానా:** ట్రెజరీ.

**ఖడ్గం:** కత్తి. ఖడ్గమృగం: మొగ మున కొమ్ముగల అడవి జంతువు.

**ఖరం:** గాడిద.

**ఖరాబు:** మురికి; చెడ్డవాడు.

**ఖరీదు:** వెల.

**ఖలుడు:** చెడ్డవాడు; నీచుడు.

**ఖాణం:** గుర్రాలకు వా దాణా (< ప్రా. ఖాయణ— సం. ఖాదన—).

**ఖాదీ:** ఖద్దరు.

**ఖాయం:** స్థిరం. ఉద్యోగం ఖాయ మయింది.

**ఖిలం:** చెడినది; పాడుపడినది; మిగిలినది.

**ఖుషి:** సంతోషం; జల్సా.

**ఖ్యాతి:** కీర్తి, ప్రశంస.

# గ

గంగడోలు: ఆవులకు, ఎడ్లకు మెడకిందవేలాడే పెద్దతోలు.

గంగాధరుడు: తలమీద గంగను ధరించినవాడు, శివుడు.

గంగాళం: వెడల్పు మూతిగల పెద్దపాత్ర.

గంగిగోవు: సాధువైన ఆవు.

గంగిరెద్దు: బిచ్చగాళ్ళు అలంకరించి ఆడించే ఎద్దు.

గంజి: అన్నం వార్చిన రసం.

గంటం: తాటాకులమీద రాయడానికివాడే లోహసాధనం.

గండగొడ్డలి: పెద్ద గొడ్డలి.

గండపెండరం, గండపెండారం, గండపెండెరం, గండపెడేరం: ప్రభువులు కవులకు, వీరులకు కాలికి తొడిగేఅందె.

గండభేరుండం: రెండుతలలు, మూడు కళ్ళుగల ఒకపక్షి.

గండం: ఆపద.


గంత


గంగడోలు


గంగాళం


గంగిరెద్దు


గండగొడ్డలి


గజం


గజాననుడు

గండి: కన్నం; గొయ్యి; బిలం; సందు.

గంత: బొంత; గానుగెద్దు కళ్ళు కుకట్టే తోలుమూత; ఎద్దులు మొ.వాటిమీద వేసే గోనె సంచి.

గంతు: దూకడం; మిడిసిపాటు.

గందరగోళం: గలభా; గోలతో కూడిన అల్లరి; ఏమీ తెలియని స్థితి.

గంధకం: బాణాసంచాలో వాడే పేలుడుపదార్థం.

గంధం: మంచివాసన; చందనం మొ.వాటిని అరగదీయగా వచ్చినగందం.

గగనం: ఆకాశం; దొరకనిది.

గగురుపాటు: భయం వల్లగాని, సంతోషం వల్లగాని ఒంటిమీది వెంట్రుకలు నిక్కబొడుచుకోవడం.

గజం[1]: ఇనుపఊచ; మూడడుగుల కొలత

గజం[2]: ఏనుగు.

గజాననుడు: వినాయకుడు, ఏనుగు ముఖం కలవాడు.

గజిబిజి: కలత; ఉద్రేకం; అల్లరి, సందడి.

గడన: సంపాదన. గడించు: సంపాదించు.

గడియ[1]: తలుపునకు అడ్డుగా వేసే కర్ర.

గడియ[2]: 24 నిమిషాలకాలం (< పా. ఘడియా, సం. ఘటికా).

గడ్డపార: గునపం.

గణించు: ఆలోచించు; లెక్క పెట్టు; పాటించు.

గణుతి: ప్రసిద్ధి; పొగడ్త; ఎన్నిక.

గతం: జరిగిపోయినది.

గత్తర: అలజడి, అల్లరి.

గదాధరుడు: గదను ధరించిన వాడు, విష్ణువు.

గదురు: చెడుకంపు.

గద్దించు: బెదరించు, అదలించు; భయపెట్టు.

గద్దె: సింహాసనం; పీట; పువ్వు లోని దుద్దు.

గద్యం: వచనం.

గని: భూమిలో బొగ్గు లోహాలు దొరికేచోటు; తరగనిది.

గనిమ: పాదు మడి మొ.వాటి గట్టు.

గప్పాలు: గొప్పలు చెప్పుకునే మాటలు, జంబాలు.


గడియ
గమ్యం


గడ్డపార
గరాటు


గరీబు


గద్దె


గర్దభం

గమనం: వెళ్ళడం, ప్రయాణం. గమనించు: తెలుసుకొను; చూచు.

గమనిక: సూచన; పద్ధతి.

గమ్యం: చేరదగినది, లక్ష్యం.

గయ్యాళి: జగడగొండి.

గరళం: విషం.

గరాటా, గరాటు: నూనె మొద లైన ద్రవాలను ఒకపాత్ర నుంచి మరొక పాత్రలోనికి పోసేటప్పుడు తొణికిపో కుండా ఉండడానికివాడే సాధనం.

గరాసు: చెడ్డవాడు.

గరిడిముచ్చు: ఆరితేరినదొంగ.

గరిడీ: సాము నేర్చుకొనేచోటు.

గరిష్ఠం: చాల బరువైనది; మిక్కిలి పెద్దది.

గరీబు: పేదవాడు.

గరుసు[1]: గులకరాయి; గట్టినేల.

గరుసు[1]: మేర.

గర్తం: గొయ్యి; పల్లం.

గర్దభం: గాడిద.

గర్భదరిద్రుడు: పుట్టుకనుంచి బీదవాడు.

గర్వం: కావరం, అహంకారం.

గర్హించు: నిందించు.

గలాభా: అల్లరి; జగడం.

గలీబు: తలగడ మొ.వాటికి తొడిగే గొసెన.


గలీబు

గవాక్షం: కిటికీ.

గవి: గుహ.

గస్తీ, గస్తు: కావలి; కావలివాడు; వాచ్ మన్.


గస్తీ

గాంగేయుడు: గంగాపుత్రుడు, భీష్ముడు.

గాడీ: బండి.


గాడీ

గాడుపు: గాలి వడగాడ్పు.

గాత్రం: శరీరం; కంఠస్వరం.

గాథ: కథ; గానం; పాట.

గాదం: కసవు, గడ్డి; గడ్డీగాదం.

గాదిలి: ప్రేమ.


గిరి

గాధేయుడు: గాధి అనేరాజు కొడుకు, విశ్వామిత్రుడు.

గానుగ: నూనె చెరకురసం తీసే యంత్రం.

గాబరా: కంగారు; భయం.

గాయకుడు: పాట పాడేవాడు.


గాయకుడు

గారడీ: ఇంద్రజాలం; విష మంత్రం.

గారాబం: పిల్లలమీద పెద్దల కుండే ప్రేమ, వాత్సల్యం; ప్రియమైనది.


గారాబం

గారె: మినపపప్పు రుబ్బిచేసే వడ. వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి, కడుపునిండిన వానికి గారెలు చేదు.

గార్దభం: గడిద.

గాలం: చేపలు పట్టేపరికరం.

గాలించు: వెదకు.

గిట్టు[1]: చనిపోవు.

గిట్టు[1]: సరిపడు; అనుకూలమగు. కూలిగిట్టలేదు; నీళ్ళు గిట్టలేదు.

గిడ్డంగి: సరకులు నిల్వ ఉంచే చోటు.

గిరాకీ: పెరిగిన కొనుగోలు.

గిరి: కొండ. గిరిధరుడు: కొండను ధరించినవాడు, కృష్ణుడు.

గిలి: భయం. పులిపోయినా గిలి పోలేదు.

గీతం: పాట.

గీర్వాణం: సంస్కృతభాష; గర్వం.

గుంటక: నేలను చదునుచేసే సేద్యపు పరికరం.

గుండం: నిప్పుల గుంట; ఏటిలో లోతుభాగం; సుడి గుండం.

గుండె: గుండెకాయ; హృదయం.

గుగ్గిలం: గుగ్గిలపు చెట్టుబంక (దీనిని అగ్గిపై వేస్తే సువాసన గలపొగ వస్తుంది).

గుగ్గిళ్ళు: ఉడికించిన ఉలవలు, అనుములు, సెనగలు మొదలైనవి.

గుజ్జు: పొట్టి; పొట్టివాడు; పొట్టి కొయ్య.

గుట్టు: మర్మం; మోసం; ధైర్యం.

గుడం: బెల్లం.

గుడారం: డేరా.

గుడి: దేవాలయం; గుండ్రంగా గీసినగీత; ఇ కారం గుర్తు. ఇంటికంటె గుడిపదిలం.

గుడిసె: కంబాలు, గోడలు, వెన్ను పట్టెలేకుండా ఏర్పరచిన గుండుపాక.

గుణకారం: హెచ్చవేత.

గుణింతం: అచ్చులను హల్లులతో చేర్చడం.

గునపం: గడ్డపార.

గుబాళించు: మంచి వాసన వేయు, పరిమళించు.

గుబురు: దట్టం; గుంపు.

గుమి: గుంపు; రాశి. గుమిగూడు: గుంపుగా చేరు.


గుండె


గుల్ల


గువ్వ


గూడు


గుడి


గుడిసె

గృధ్రం


గేదగి


గేదె


గుమి

గుయ్యారం: గుహ; చెరసాల.

గురి: లక్ష్యం, విశ్వాసం; గుర్తు.

గులాం: బానిస; నీచుడు.

గుల్ల: బోలు, గట్టిదికానిది; బొబ్బ పొక్కు; నత్తమొ. జలచరాల కవచం.

గువ్వ: పావురం; పిట్ట.

గుసగుస: రహస్యపు మాట.

గూటం: గుంజ; మేకు.

గూడ[1]: బుట్ట; తాటాకు గొడుగు.

గూడ[2]: పక్షులగూడు; పంజరం; నివాసం.

గూన: లోతైన కుండ.

గృధ్రం: గద్ద.

గృహం: ఇల్లు; గృహిణి: భార్య.

గెల: పండ్లులేక పువ్వుల గెల.

గేదగి: మొగలి చెట్టు; మొగలి పువ్వు (<ప్రా. కేదగి, సం. కేతక).

గేదె: బర్రె, ఎనుము.

గేయం: పాట.

గేలి: పరిహాసం, వేళాకోళం. గేలి సేయు: వేళాకోళం చేయు.

గేస్తు: గృహస్థుడు, ఇంటి యజమానుడు. గేస్తురాలు: భార్య.

**గేహం:** ఇల్లు.
**గొంగ:** శత్రువు, పగవాడు.
**గొంగళి:** కంబళి.
**గొంతి:** పాండవుల తల్లి, కుంతి.
**గొంతెమ్మ:** ఒక గ్రామదేవత. గొంతెమ్మ కోరిక: అసాధ్యమైన కోరిక.
**గొంది:** మూల; మరుగుచోటు; చిన్నసందు.
**గొగ్గి:** ఎచ్చుతగ్గులుకలది. గొగ్గిపళ్ళు: ఎచ్చుతగ్గులు గల దంతాలు.
**గొజ్జగి, గొజ్జెంగ:** రేకులచేమంతి (< ప్రా. కుజ్జగి-, సం. కుబ్జక-) గొజ్జగినీరు: పన్నీరు.
**గొడవ:** కలహం; కీడు: పీడ; తప్పు; అల్లరి.
**గొడ్డు[1]:** ఫలించనిది, వట్టిది; సంతతిలేనిది. గొడ్డుమాటలు: పనికిరాని మాటలు.
**గొడ్డు[2]:** ఆవు, ఎద్దుమొ.వి.
**గొనం:** మంచిగుణం (< ప్రా. గుణ-, సం. గుణ-).
**గొరిజ, గొరిసె:** పశువుల కాలి గిట్ట.


గేహం


గోడా


గొజ్జగి


గోపాలుడు


గోపురం


గొరిజ

**గొర్రు:** విత్తనాలు విత్తడంలో వాడే పరికరం.
**గోకులం:** ఆవులమంద; వ్రేపల్లె; పసులకొట్టం.
**గోచరం:** స్థానం; పొలం; కనిపించేది. గోచరించు: తోచు, అగపడు.
**గోడా:** గుర్రం (< ప్రా. ఘోడా, సం. ఘోటక-).
**గోడు:** ఏడ్పు; దుఃఖం; బాధ. గోడాడు: ఏడ్చు.
**గోత్రం:** వంశం, గుంపు.
**గోద[1]:** ఎద్దు. గొడ్డూగోదా.
**గోద[2]:** గోదాదేవి; వైష్ణవులు పూజించే దేవత.
**గోనె:** జనపనార సంచి (< ప్రా. గోణి, సం. గోణీ).
**గోపాలుడు:** గోవులను కాసేవాడు; శ్రీకృష్ణుడు.
**గోపురం:** దేవాలయంముఖంలో కట్టిన ఎత్తైన ద్వారం.
**గోప్యం:** రహస్యం.
**గోమయం:** పేడ.
**గోమాయువు:** నక్క.
**గోము:** గారాబం.
**గోరుగల్లు:** గోళ్ళు తీసే సాధనం.

**గోరుచుట్టు:** గోటిచుట్టూ లేచే కురుపు.
**గోళం:** గుండ్రటిది; అగ్ని గోళం; భూగోళం.
**గౌరవం:** గొప్పతనం; మర్యాద. గౌరవించు: గౌరవం చేయు.
**గౌలు:** దుర్వాసన.
**గౌళి:** బల్లి.
**గ్రంథం:** పుస్తకం. గ్రంథాలయం: లైబ్రరీ.
**గ్రహం: సూర్యుడు.** సూర్యుని చుట్టూ తిరిగే గోళం. గ్రహపతి: సూర్యుడు.
**గ్రహణం:** తీసుకొనడం, తెలుసుకొనడం; పట్టుకొనడం; సూర్యచంద్ర గ్రహణాలు.
**గ్రాంథికం:** గ్రంథాలకు సంబంధించినది. గ్రాంథికభాష: ప్రాచీన కావ్యాలలోని భాష.
**గ్రామం:** పల్లెటూరు. గ్రామసింహం: కుక్క; గ్రామీణులు: పల్లెటూరివారు.
**గ్రీష్మం:** వేడిమి ; వేసవికాలం.
**ఘంట:** గంట; 60 నిమిషాల కాలం.
**ఘంటాపథం:** రాజమార్గం. ఘంటాపథంగా: గట్టిగా, నమ్మకంగాధ పోటీలో


గోళం


ఘటం


గౌళి


గ్రంథం

ఘట్టం


గ్రామం


ఘనీభవించు

తాను గెలుస్తానని ఘంటాపథంగా అంటున్నాడు.
**ఘటం:** కుండ, కడవ; ఒక వాద్యం; పెద్దఘటం: గొప్ప వ్యక్తి.
**ఘటనం:** సంఘటనం; ప్రయత్నం; కూర్పు .
**ఘటాఘటీలు:** చాలగొప్పవారు.
**ఘటిక:** విద్యాసంస్థ.
**ఘటికుడు:** సమర్థుడు.
**ఘట్టం:** రేవు (స్నానఘట్టం); దృశ్యం; సీతారాముల పెళ్ళి ఘట్టం చూడ ముచ్చటగా ఉంటుంది.
**ఘనం:** గట్టిది; మేఘం; సమానమైన మూడుసంఖ్యలను గుణించగా వచ్చిన సంఖ్య.
**ఘనత:** గొప్పతనం.
**ఘనమూలం:** సమానమైన మూడు సంఖ్యలను గుణించగా వచ్చిన లబ్ధానికి మూలమైనసంఖ్య. 27 = 3 X 3 X 3. ఇక్కడ 27 కు ఘనమూల సంఖ్య '3'.
**ఘనీభవించు:** గడ్డకట్టు.
**ఘర్మం:** ఎండ; వేడిమి; చెమట.

**ఘర్షణ:** రాపిడి; కొట్లాట.

**ఘాతకుడు:** హింసించేవాడు; చంపేవాడు.

**ఘీంకరించు:** ఏనుగు అరచు.

**ఘుటిక:** గుళిక, మాత్ర.

**ఘూకం:** గుడ్లగూబ.

**ఘూర్ణిల్లు:** మోగు; తిరుగుడు పడు. సముద్రం ఘూర్ణిల్లింది.



ఘుటిక



ఘూకం



ఘీంకరించు



ఘోటకం

**ఘోటకం:** గుర్రం.

**ఘోరం:** భయంకరం.

**ఘోష:** అరపు, గోల. ఘోషించు: చాటు, ప్రకటించు.

**ఘ్రాణం:** ముక్కు; వాసన చూడడం.



ఘ్రాణం

# చ

**చంచలం:** నిలకడలేనిది, కదలేనిది. **చంచలించు:** కదలు; జంకు.

**చందనం:** మంచిగంధపు చెట్టు; మంచిగంధం.

**చందురు[1]:** చంద్రుడు (<ప్రా.చంద-, సం.చంద్ర-).

**చందురు[1]:** అందం; అందమైనది.

**చందుగు:** నగలు పెట్టుకునే చిన్నపెట్టె (<ఉర్దూ సందూక్).

**చందురుడు:** చంద్రుడు (<సం.చంద్రః).

**చంద్రాలోకం:** వెన్నెల.

**చకితం:** భయపడినది; భయం, దిగులు.

**చక్కెర:** పంచదార (< ప్రా.సక్కరా, సం.శర్కరా).

**చక్రధరుడు:** సుదర్శనమనే పేరుగల చక్రం ధరించిన వాడు, విష్ణువు.


చక్రపాణి


చదర


చదరంగం


చందుగు


చందురుడు


చదరం

**చక్రపాణి:** చక్రం చేతిలోకలవాడు, విష్ణువు.

**చక్రం:** బండిచక్రం; సైన్యం; సమూహం.

**చక్రవడ్డీ:** వడ్డీకివడ్డీ.

**చట్టం[1]:** పట్టెలతో అమర్చిన బండి, మంచం మొ.వాటి భాగం.

**చట్టం[2]:** శాసనం (<ప్రా.సట్టం, సం-శాస్త్రమ్).

**చతుర్థి:** నాల్గోతిథి, చవితి; నాల్గో విభక్తి

**చదర:** చిన్నచాప.

**చదరంగం:** ఏనుగులు, గుర్రాలు, రథాలు, బంట్లు అనే నాల్గు అంగాలుకలది; ఒకఆట.

**చదరం:** చదునైనది; చౌకం.

**చదలు:** ఆకాశం.

**చదుకం:** నాల్గుదారులు కలిసే చోటు (<సం.చతుష్క-).

**చదువరి:** విద్యావంతుడు.

**చమత్కారం:** నేర్పు; ఆశ్చర్యం

**చరణం:** కాలు; పద్యపాదం.

**చరిత్ర:** జరిగిపోయిన సంఘటనల క్రమ వివరణ; నడవడిక.

**చర్య:** నడవడి; పని; ప్రతిక్రియ; ఆచారం.

**చలనం:** కదలిక; వణకడం.

**చవుక:** వెలతక్కువ; అనాదరం.

**చషకం:** గిన్నె; పాత్ర.

**చాంద్రమానం:** చంద్రుని గతిని బట్టి ఏర్పరిచిన కాలమానం.

**చాకచక్యం:** నేర్పు .

**చాపం:** విల్లు; ధనుస్సు; వృత్తంలో భాగం.

**చాయ:** రంగు; కాంతి; రీతి; పోలిక; చోటు.

**చింత[1]:** చింతచెట్టు.

**చింత[2]:** ఆలోచన; దుఃఖం; తలంపు.

**చిందర[1]:** కోపం, చీదర.

**చిందర[2]:** చీలిక, ముక్క, చిల్లి. చిందరవందర: ముక్కలు ముక్కలుగా, చెల్లాచెదరైనది; తారుమారైనది.

**చిందు:** నీళ్ళు మొ.వి ఒలికిపోవు; వ్యాపించు, ఒకరకమైన నాట్యం; కోపం; చిందులు తొక్కు: కోపంతో గంతులు వేయు.

**చింబోతు:** మేకపోతు.

**చికిత్స:** వైద్యం.


చిచ్చుబుడ్డి


చషకం


చాపం


చింత


చిత్రం


చింబోతు


చికిత్స

**చిచ్చు:** అగ్గి, నిప్పు. చిచ్చుబుడ్డి: ఒకరకమైన బాణసంచా.

**చిటారుకొమ్మ:** చెట్టుచివరి కొమ్మ.

**చిట్టడవి:** దట్టమైన చిన్న అడవి.

**చిడిముడి:** తొందర; కోపం; ఓర్పులేనితనం. చిడిముడి పాటు: తొట్రుపాటు; కంగారు, చిరాకు.

**చిత్రం:** వింత; చిత్రించిన బొమ్మ, చిత్రకారుడు: బొమ్మలు వేసేవాడు.

**చిదుకు:** నలిగిపోవు; నీరు ఉబుకు.

**చిదుగు:** ఎండిన చిన్నపుల్ల.

**చిదుము:** గిల్లు; పొడుచు; పూలు కోయు; నరకివేయు, చంపు; పారవేయు.

**చిరకాలం:** చాలకాలం.

**చిరంజీవి:** చాలకాలం బతికేవ్యక్తి.

**చిరాకు:** కోపం; విసుగు.

**చిరునామా:** అడ్రస్సు. (<ఉ సర్నామా).

**చిలుము:** ఇత్తడి, ఇనుము, రాగి మొదలైన లోహాలపై కలిగే మురికి.

**చిలువ:** నోటిలో విషం కలది, పాము.

**చిల్లగింజ:** నీటిని తేర్చడానికి వాడేగింజ, ఇందుగ.

**చిల్లపెంకు:** పగిలిన కుండ మొ.వాటి ముక్క.


చిల్లపెంకు

**చిహ్నం:** గుర్తు.


చిహ్నం

**చీటికిమాటికి:** మాటిమాటికి.

**చీడ:** పైర్లకు సోకేరోగం. **చీడపురుగు:** పైర్లకు పీడకలిగించే పురుగు.


చీడ

**చీనాంబరం:** చీనా దేశపు సిల్కుతో నేసిన వస్త్రం; పట్టుగుడ్డ.

**చీరణం:** చిన్నఉలి.


చీరణం

**చీరు[1]:** చీల్చు; గీరు; ఖండించు.

**చీరు[2]:** పిలుచు.

**చీల:** మేకు; బండి ఇరుసు చివరి సీల.

**చీలమండ:** కాలిమడమలకు రెండు వైపులా ఉండే కీలు.

**చీలు:** పగులు, బద్దలగు, చీల్చు: ఖండించు, ముక్కలుచేయు


చీలు

**చీవాట్లు:** తిట్లు, చీవాట్లుతిను, చీవాట్లు పెట్టు.

**చుక్క:** నక్షత్రం; బొట్టు; నీటి చుక్క; చుక్కలురాలాయి, చుక్కబొట్టు. **చుక్కెదురు:** హానికరం, చెడుపు.


చుక్క

**చుక్కాని, చుక్కాను:** పడవను నడపే సాధనం.

**చురక:** వాత.

**చురకత్తి:** చిన్నకత్తి.


చురకత్తి

**చురుకు:** సూక్ష్మబుద్ధిగలది; వాడియైనది, వేగం; వేడిమి.

**చులకన:** తేలిక; వేగం; గౌరవం లేకపోవడం.

**చువ్వ:** సన్నగా పొడుగుగా ఉండేరివ్వ.

**చూడికి, చూడ్కి:** చూపు; కన్ను; రీతి.

**చూపరి:** చూడదగినవాడు, అందగాడు.

**చూరు[1]:** ఇంటికప్పు మొ.వాటి అంచు. **చూరెలుక:** ఇంటికప్పులలో ఉండే ఎలుక.


చూరు

చీల

**చూరు[2]:** వక్కలు, బెల్లం మొ.వాటి పొడి.

**చూరు[3]:** పొగచూరు.

**చూర్ణం:** పిండి, పొడి; పొడి చేయడం; సున్నం.

**చూలు:** సంతానం.

**చెంగనాలు:** ఆవుదూడలు వేసే గంతులు.


చెంగనాలు

**చెంగలి:** దగ్గర; పక్కల.

**చెంగలించు:** నవ్వు; ఎక్కువగు; ఉత్సాహపడు.
**చెంగలువ:** ఎర్రకలువ.
**చెంగు:** తొలగిపోవు; కదలు; బట్ట అంచు. చెంగున: ఒక్క సారిగాదూకడం.
**చెంచు:** గిరిజనులలో ఒకతెగ. చెంచిత, చెంచెత: పైతెగ స్త్రీ.
**చెండు[1]:** ఖండించు; చంపు; పోగొట్టు. చెండాడు: చీల్చు, చంపు. చీల్చిచెండాడు.
**చెండు[2]:** బంతి; పూలగుత్తి.
**చెంత:** దగ్గర; వైపు.
**చెందమ్మి:** ఎర్రతామర పువ్వు.
**చెంబడి:** చేపలు పట్టేవాడు.

**చెట్ట[1]:** ఆపద, అశుభం; చెడ్డ వాడు.
**చెట్ట[2]:** చేయి.
**చెట్టపట్టాలు:** చేయిచేయి కలుపుకోవడం.
**చెట్టపట్టు:** పెళ్లాడు.
**చెణుకు:** చమత్కారం.
**చెదలు:** పుట్టలుపెట్టే చీమలు
**చెదారం:** చెత్త
**చెన్ను:** అందం, కాంతి; ఎర్రటిది


చెరసాల


చెలగాటం


చెలిమి


చెండు


చెంబడి


చేదుడ్డు


చేను

**చెర:** జైలు.
**చెరబట్టు:** బందీగా పట్టుకొను
**చెరసాల:** జైలు
**చెలగాటం:** సరదా, పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణ సంకటం
**చెలమ:** నీరు ఊరేది; వంకలు, ఎండిన చెరువులు మొ. వాటిలో తవ్వే గొయ్యి.
**చెలరేగు:** అతిశయించు; విజృంభించు.
**చెలిమి:** స్నేహం.
**చెలియలికట్ట:** సముద్రపు గట్టు.
**చెల్లాచెదరు:** ఎక్కువగా చెదరిపోవు.
**చేటు:** కీడు, ఆపద.
**చేటుకాలం:** చెడిపొయ్యేకాలం.
**చేడియ:** స్త్రీ; భార్య (<ప్రా. చేడియా, సం. చేటికా).
**చేతప్పు:** రాయడంలో తప్పు.
**చేదుడ్డు:** చేతికర్ర
**చేదోడు:** తోడ్పాటు, సహాయం
**చేదోడువాదోడు:** చేతిసాయం, మాటసాయం.
**చేను:** పైరు; పొలం.

**చేపుణికిళ్ళు:** చేతులతో తడవుకోవడాలు.

**చేర్చుక్క:** పాపటలో పెట్టుకునే నగ.


చేర్చుక్క

**చేరువ:** దగ్గర ఉన్నది, సమీపకాలం.

**చేవ:** బలం; ధైర్యం; పొగరు; సారం; గట్టితనం.

**చేష్ట:** పని; నడవడి.

**చైతన్యం:** కదలిక; ఉత్సాహం; తెలివి.


చౌడోలీ

**చైత్యం:** బౌద్ధస్తూపం; దేవాలయం.


చైత్యం

**చొక్కం:** కల్తీలేనిది; అందమైనది; కాంతి. చొక్కపు బంగారం: కల్తీలేని బంగారు. (< ప్రా. చోక్ఖ-, సం. చోక్ష-).


చొప్ప

**చొప్ప:** జొన్న మొ. వాటి దంటు.

**చొప్పడు:** దొరకు; కలుగు; సాధ్యమగు.

**చొరవ:** సాహసం; ప్రవేశం.

**చోదకుడు:** ప్రేరేపించేవాడు; నడపేవాడు

**చోద్యం:** వింత.

**చోరుడు:** దొంగ; నవనీత చోరుడు: వెన్నను దొంగిలించేవాడు, కృష్ణుడు.


చోరుడు

**చౌకం:** నాలుగు; నలుచదరపు గది; చదరపు తుండుగుడ్డ. (< ప్రా. చవుక్క, సం. చతుష్క-).

**చౌడోలీ:** అంబారీ; కూర్చుండడానికి ఏనుగు వీపు మీద అమర్చినతొట్టి.

**చౌదరి:** పెత్తనకాడుగా ఉండే రైతు.

**చౌదరితనం:** గొప్పతనం; అధికారం.

**చౌర్యం:** దొంగతనం.

**ఛందం:** చంపకమాల, శార్దూలం మొదలైనపద్యాలలో ఒకటి

**ఛందస్సు:** పద్యాలు రాసే పద్ధతులు తెలిపే శాస్త్రం, వేదాంగాలు ఆరింటిలో ఒకటి

**ఛత్రం:** గొడుగు; ఛత్రధరుడు, ఛత్రధారి: గొడుగు పట్టుకున్నవాడు


ఛత్రం

**ఛలం:** నెపం; ఉన్నదానిని కప్పిపుచ్చడం; కపటం; మోసం.

**ఛాందసం:** వేద సంబంధమైనవి; లోకజ్ఞానం లేకపోవడం; ఛాదస్తం

**ఛాత్రుడు:** శిష్యుడు.
**ఛాయ:** నీడ; ప్రతిబింబం; కాంతి; పోలిక; ఛాయా చిత్రం; ఫోటో
**ఛిద్రం:** తప్పు; బెజ్జం; తిట్టడం
**ఛిన్నం:** నరకబడినది; వేరు చేయబడినది; ఛిన్నాభిన్నం; ముక్కలు ముక్కలు


ఛిన్నం


ఛాత్రుడు


ఛురిక




ఛాయ

**ఛురిక:** చిన్న కత్తి
**ఛేదనం:** నరకడం; తుంచడం; ఛేదించు; నరకు; తుంచు


ఛేదనం

# జ

జంకు: భయపడు; బెదరు; సందేహించు; భయం.
జంకెన: బెదరింపు.
జంగ: పాదం; దాటు; పంగ (<ప్రా. జంఘా; సం. జంఘా).
జంజాటం: లేనిపోని తగులాటం; ఆర్భాటం.
జంట: జత; తోడు; అండ; వెంబడి; రెట్టింపు.
జండా, జెండా: పతాకం.
జంపాల: ఉయ్యాల; జోలపాట.
జగజెట్టి: గొప్పమల్లుడు; శ్రేష్ఠుడు.
జగడం: కలహం; యుద్ధం; వాదులాట.
జగదంబ: జగత్తునకు తల్లి; లక్ష్మి; పార్వతి.
జట్టి: వెల; బేరం; అమ్మకం; అమ్మకపుసరకు.
జట్టు: గుంపు; సమానులైనవారి గుంపు; స్నేహం; జత; వారి జట్టులో పదిమంది ఆటగాళ్ళున్నారు.


జఠరిక


జడుపు


జంగ


జత


జండా


జనపదం


జన్నం

జఠరిక: గుండెలోని కిందిఅర.
జడి: విడువకుండా కురిసే వాన; ముసురు: జడిపట్టు; ముసురుపట్టు.
జడుపు: భయం.
జడిపించు: భయపెట్టు.
జడ్డిగం: నిత్తడానికివెదగొర్తిమీద అమర్చే 3, 4, 6 కన్నాలుగల క్రపిడుత.
జత: స్నేహం; జట్టు; సాటి; జత పరుచు: కలుపు.
జతనం: ప్రయత్నం; ఉత్సాహం; సిద్ధంగా ఉండడ (<సం. యత్న-).
జనకుడు: తండ్రి.
జనని: తల్లి.
జనపదం: పల్లెటూరు
జనశ్రుతి: ప్రజలు సమాచారం.
జన్నం: యజ్ఞం (<ప్రా. సం-యజ్ఞ-).
జన్మదినం: పుట్టినరోజు
జన్మభూమి: మాతృదేశం
జముడు: యముడు (<ప్రా. జమో, సం. యమః).
జమున: యమునా నది (<ప్రా. జమునా, సం-యమునా).

**జయంతి:** అవతారపురుషులు పుట్టినరోజు; బుద్ధజయంతి, శంకర జయంతి; గాంధీజయంతి.

**జర:** ముసలితనం.


జర

**జరతారు:** వెండి బంగారు మొ. వాటి పూత పూసిన పోగు (< ఉ. జర్+తార్: బంగారు తీగ).


జలాశయం

**జరామగణాలు:** ముసలితనమూ చావూ.

**జరి/జరీ:** వెండిమొ. వాటిపూత గల పోగు.


జలచరం

**జలచరం:** నీటిలో తిరిగేవి; చేప; మొసలి మొ. వి.

**జలజం:** నీటిలో పుట్టినది; తామరపువ్వు మొ. వి.


జలజం

**జలదం:** నీటిని ఇచ్చేది; మేఘం.


జలదం

**జలదరించు:** వణకు; భయపడు; చలించు.

**జలదుర్గం:** చుట్టునూ నీరుగల కోట.

**జలధరం:** నీటిని మోసేది; మేఘం.

**జలధి:** నీటికి ఆధారమైనది; సముద్రం.

**జలపోసనం:** వెండి బంగారు మొ.వాటి పూత (<పా జర్‌పోష్: బంగారుపూత).

**జలాక్షరం:** నీటిమీది రాత; శాశ్వతం కానిది; వ్యతిరేకం- శిలాక్షరం.

**జలాశయం:** చెరువు; సముద్రం.

**జవదాటు:** మేరమీరు; దాటిపోవు.

**జవనిక:** తెర (<ప్రా. జవణియా, సం. యవనికా).

**జవ్వనం:** పదారేండ్లకు మీది వయస్సు (<ప్రా. జవ్వణ-, సం. యౌవన-).

**జాగా:** చోటు; నివాసస్థానం (<ఉ. జాగా).

**జాగారం/జాగరం:** మేల్కొని ఉండడం; జాగ్రత్తగా ఉండడం.

**జాగిలం:** వేటకుక్క.


జాగిలం

**జాగీరు:** ప్రభువులు సన్మానంగా ఇచ్చిన భూమి (<ఉ. జాగీర్).

**జాడ:** గుర్తు; అడుగుల గుర్తు; దారి; నడవడి; వార్త.


జాడ

**జాడించు:** దులుపు; కొట్టు; చీవాట్లు పెట్టు; బట్టలను నీళ్ళలో తడిపి పిండు.

**జాణ:** నేర్పరి; సమర్థుడు; సమర్థురాలు; నెల్లూరు నెరజాణ.

**జాతర:** తీర్థయాత్ర; గ్రామదేవతల ఉత్సవం; అల్లరి. పిల్లలు నానా జాతర చేస్తున్నారు.

**జాతిపిత:** దేశీయులకు తండ్రి వంటివాడు; గాంధీజీ.

**జాతీయం:** జాతికి సంబంధించినది; నానుడి.

**జానపదం:** పల్లెటూళ్ళకు సంబంధించినది; ఆట పాట మాట మొ.వి.

**జాను:** అందమైన; స్పష్టమైనది; జాను తెనుగు: స్పష్టమైన తెనుగుభాష.

**జాప్యం:** ఆలస్యం.

**జాబితా:** పట్టిక; సరకుల జాబితా రాయండి.

**జాబిల్లి:** చంద్రుడు. నిండు జాబిల్లి: పూర్ణచంద్రుడు.

**జాబు:** ఉత్తరం.

**జామాత:** అల్లుడు.

**జాము:** మూడుగంటల కాలం (<ప్రా. జామ-, సం. యామ).

**జాలం[1]:** ఆలస్యం.

**జాలం[2]:** వల; కిటికీ; కపటం; మాయ; ఇంద్రజాలం.

**జాలరి:** చేపలు పట్టేవాడు.


జాతర


జాతిపిత


జిహ్వ


జాబిల్లి


జాబు


జీర్ణమండలం


జాలరి

**జాలి:** దుఃఖం; శ్రమ; వేదన; కోరిక.

**జాలు:** ప్రవాహం; నది.

**జాళువా:** బంగారు.

**జావ:** గంజి.

**జావాహిరి/ జవాహిరి:** రత్నాల ఆభరణాలు.

**జిజ్ఞాస:** తెలుసు కోవాలన్న కోరిక.

**జిత్తు:** ఉపాయం; మోసం (<ప్రా. జుత్తి, సం. యుక్తి).

**జిత్తులమారి:** మోసకారి.

**జిల:** దురద.

**జిలిబిలి:** ఇంపైనది; సొగసైనది; జిలిబిలిపలుకులు.

**జిహ్వ:** నాలుక.

**జీతం:** వేతనం; కూలి.

**జీర్ణక్రియ:** తిన్న ఆహారం జీర్ణమయ్యే విధానం.

**జీర్ణమండలం:** తిన్న తిండి శరీరంలో జీర్ణమయ్యే భాగం.

**జీర్ణరసం:** ఆహారం అరగడానికి జీర్ణమండలంలో ఊరే ద్రవం.

**జీర్ణించుకొను:** అరగించుకొను; సరిగా అర్థం చేసుకొను.

**జీవనం:** బతుకుతెరువు.

**జీవం:** ప్రాణం; జీవించి ఉన్నది.

**జీవితం:** జీవనం; బ్రతుకు; జీవిత కాలం.

**జులుం:** దౌర్జన్యం (<ఉ. జుల్మ్).

**జూటు:** మోసం; అబద్ధం (<ఉ. ఝూట్).

**జూలు¹:** సింహం మొ. వాటి మెడ మీది జుట్టు.

**జూలు²:** ఏనుగు మీద కప్పే కంబళి.

**జెండా:** పతాకం.

**జెర్రి:** చాల కాళ్ళు గల విషపు పురుగు.

జెర్రి

**జేజే:** జయం జయం; నమస్కారం; దేవత; జయ జయ ధ్వని.

**జేన:** బొటనవేలి నుంచి చిటికెన వేలి దాకా గల కొలత; జేనెడు పొట్ట.

**జోడు:** జత; కవచం; మిత్రుడు.

**జోదు:** యోధుడు (< సం. యోధః).

**జోలి:** విషయం; పని.


జోదు


జోహారు


జూలు


జ్యోతి


జేన


జ్వాల


ఝంకారం

**జోహారు:** నమస్కారం.

**జ్ఞాతి:** దాయాది.

**జ్ఞానం:** తెలివి; తెలుసుకోవడం.

**జ్ఞానేంద్రియం:** చర్మం; కన్ను; చెవి; నాలుక; ముక్కు; తెలుసుకోవడానికి సాధనమైనది.

**జ్యేష్ఠుడు:** వయస్సులో పెద్ద వాడు; అన్న.

**జ్యోతి:** సూర్యుడు; వెలుగు; దీపం.

**జ్యోతిషం:** వేదాంగాలు ఆరింటిలో ఒక శాస్త్రం.

**జ్యోత్స్న:** వెన్నెల.

**జ్వలనం:** మండేది; ప్రకాశించేది.

**జ్వాల:** మంట.

**ఝంకారం:** తుమ్మెదలు చేసే ధ్వని.

**ఝంఝ:** వానతో పాటు ఝుమ్మని వీచేగాలి.

**ఝరి:** సెలయేరు.

**ఝషం:** చేప.


ఝషం

# ట

టంకం: ఒక నాణెం; వెలిగారం.
టంకవాటు: ఒక బంగారు నాణెం.
టంకసాల: నాణేలు ముద్రించే చోటు.
టంకారం: వింటి తాడు చేసే ధ్వని.
టంగువారు: గుర్రం మీది జీను జారకుండా ఉండడానికి బిగుతుగా కట్టే తోలుపట్టెడ.
టక్కరి: మోసకారి.
టక్కు: మోసం; అసత్యం.
టక్కులాడు: మోసగాడు.
టపా: పోస్టు.
టపాకాయ: బాణాసంచా.
టాంగనా: ఒక జాతి గుర్రం.
టాంటాం: డప్పువేసి చెప్పడం; ప్రచారం.


టిట్టిభం


టీకాలు


టెంక


టెంకాయ


టపాకాయ

టిట్టిభం: టిటీ అని కూసే పక్షి, లకుముకి పిట్ట.
టిప్పణి: అర్థవివరణ.
టీక: అర్థవివరణ.
టీకాలు: మశూచి మొ. జబ్బులు రాకుండా ఉండేందుకు వాడే సూదిమందు; టీకాలు వేయు: టీకాలు పొడిపించు; టీకామందు.
టూకీ: సంగ్రహం. టూకీగా చెప్పండి.
టెంక: తాడి, మామిడి మొ.వాటి కాయలలోని విత్తనం..
టెంకాయ: కొబ్బరికాయ..
టెంకి: స్థానం; ఇల్లు; జలాశయం. టెంకిపెట్టుకొను: నివసించు..
టెక్కు: గర్వం; విలాసం, అందం..
టెక్కెం: జెండా..
టోపి: కుళ్ళాయి.


టోపి

# ఠ

ఠవర: నేర్పరి, జాణ.

ఠాణం: స్థానం, చోటు. (<ప్రా. ఠాణం, సం. స్థాన-).



ఠాణా



ఠీవి

ఠాణా: కావలిస్థలం. పోలీసు ఠాణా.

ఠావు: స్థానం; నివాసస్థలం.

ఠింగణా: పొట్టివాడు.

ఠీవి: సొగసు; వైభవం, గొప్పతనం. రాచఠీవి: ప్రభువుల దర్జా.

ఠేవ: పద్ధతి, రీతి.

# డ

డంకా: ఢక్కా.
డంబం, డంబు: ఆడంబరం, బడాయి; మోసం; గర్వం. డంబాలు: బడాయిమాటలు.
డగ్గుత్తిక: గద్గదస్వరం.
డమరుకం: ఒకచర్మవాద్యం.
డయ్యు: అలసిపోవు, డీలాపడు; చిక్కిపోవు; తగ్గు; పాడగు.
డా: ఎడమది. డాకన్ను: ఎడమ కన్ను. డాకాలు: ఎడమ కాలు. డాచేయి: ఎడమచేయి.
డాగు: గుర్తు; మచ్చ, మరక, కళంకం. గుడ్డపై సిరాపడి డాగు అయింది.
డాలు: కత్తిదెబ్బ తగలకుండా అడ్డుకునే సాధనం.


డాలు


డింభకుడు


డంకా


డమరుకం


డెక్క


డేరా


డాగు


డోల

డింకీ: పరీక్షలో ఫెయిలవడం.
డింగరీడు: సేవకుడు; భక్తుడు.
డిందు: తగ్గిపోవు, అలసిపోవు; లీనమగు; మునిగిపోవు; చచ్చు.
డింభకుడు: బాలుడు.
డిల్లి, డిల్లీ: భారతదేశానికి రాజధాని (< సం. దేహళీ ఇంటి గడప) డిల్లికిడిల్లేపలెకుపల్లే.
డీలా: నీరసం; అలసట; దుర్బలం.
డెందం: హృదయం; రొమ్ము; అభిప్రాయం.
డెక్క: గిట్ట.
డేరా: గుడారం.
డొంక: పొద; పల్లపుదారి.
డొక్క: పొట్ట; ఎముకలగూడు; కడుపు పక్కభాగం.
డొల్లు: దొరలు; వేలాడు; ఊడిపోవు; తెగిపడు.
డోల: ఉయ్యాల.
డోలీ: ఉయ్యాలవంటి పల్లకీ.
డొలు: బడాయి, దంభం.



**తంటా:** మోసం; కష్టం; చాడీ.
**తంటాలుపడు:** కష్టపడు
**తంటాలమారి:** వంచకుడు; పొగరుబోతు, చాడీకోరు.
**తండం:** గుంపు, రాశి, తండతండాలు, తండోపతండాలు: గుంపులుగుంపులు, ఒక గుంపు తర్వాత మరొక గుంపు, లెక్కలేనంతమంది.
**తంతి:** తీగ, టెలిగ్రాం (ప్రా. తంతీ, సం. తంత్రీ).
**తంత్రం:** ఉపాయం; రాజనీతి.
**తంపర:** దట్టం.
**తామరతంపర:** ఎక్కువగా అభివృద్ధిచెందినది.
**తగరం:** ఒకలోహం.
**తగరు:** పొట్టేలు.
**తగవు:** తగినది, న్యాయమైనది; జగడం.
**తటపటాయించు:** వెనుకముందాడు.


తటం


తథాగతుడు


తంతి


తగరు


తపస్సు

**తటం:** ఏటిగట్టు.
**తటస్థం:** ఏ పక్షమూ వహించకుండా ఉండు, ఉదాసీనం.
**తటాకం:** చెరువు.
**తత్తర:** తొందర, కలత.
**తత్తరపడు:** తొందరపడు.
**తత్తరపాటు:** తొట్రుపాటు.
**తత్త్వం:** స్వభావం; సత్యం.
**తథాగతుడు:** బుద్ధుడు.
**తథ్యం:** సత్యం.
**తద్దె:** పండుగదినమైన తదియ.
**అట్లతద్దె:** ఆశ్వయుజ బహుళ తదియ.
**ఉండ్రాలతద్దె:** భాద్రపద బహుళ తదియ.



**తనయ:** కూతురు.
**తనయుడు:** కొడుకు.
**తనివి:** తృప్తి.
**తనూజ:** కూతురు.
**తనూజుడు:** కొడుకు.
**తపస్వి:** తపస్సుచేయువాడు.
**తపస్సు:** గట్టి నియమాలతో చేసే కృషి; వ్రత నియమం; ఏకాగ్రత.
**తప్పిదం:** నేరం, పొరపాటు.
**తబుక:** గింజలేని కాయ, తాలూ తబుక.

**తబుకు:** పళ్ళెం; తాంబూల పాత్ర.

**తమస్సు:** చీకటి; అజ్ఞానం.

**తరంగం:** అల.

**తరంగిణి:** అలలుకలది, నది.

**తరణం:** ఈదడం, దాటడం.

**తరణోపాయం:** చిక్కులనుంచి బైటపడే ఉపాయం.

**తరవాణి:** పులియబెట్టిన గంజి.

**తరుణం:** అనుకూల సమయం; కొత్తది.

**తరుణి:** స్త్రీ.

తరుణి

**తరువు:** చెట్టు.

**తర్కించు:** ఊహించు; తలంచు.

**తర్జనం:** బెదరింపు.

**తర్జన:** చూపుడువేలు, బెదరించడంలోవాడే వేలు.

**తర్జుమా:** ఒక భాషనుంచి మరొక భాషలోకి మార్చడం, అనువాదం.

**తల:** శిరస్సు.

**తలదాల్చు:** వినయంతో గ్రహించు.

**తలతిరుగు:** గర్వంకలుగు.

**తలదాచుకొను:** శరణుపొందు, ఆశ్రయంపొందు.



తబుకు



తరంగం



తరణం



తరువు



తలియ



తర్జన



తల

**తలదూర్చు:** ప్రవేశించు, అనవసరంగా ఒక విషయంలో జోక్యం చేసుకొను.

**తలపైకెక్కించుకొను:** ఎక్కువగా ఆదరించు.

**తలమీదికివచ్చు:** ప్రాణాపాయం కలుగు.

**తలపడు:** సిద్ధపడు; సమీపించు.

**తలపెట్టు:** పూనుకొను; తలపోయు; ఆలోచించు.

**తలవంపు:** అవమానం.

**తలియ, తెలె:** కంచం, భోజన పాత్రం. (ప్రా. థాలియా, సం. స్థాలికా, స్థాలీ).

**తల్లక్రిందులు:** తారుమారు.

**తల్లడం:** బాధ; భయం; వణకడం

**తల్లడించు:** వణుకు; జంకు; దుఃఖించు.

**తాండ్ర:** ఎండించి ముక్కలుగా కోసిన పళ్ళరసం, మామిడి తాండ్ర.

**తాంబాళం:** వెడల్పాటి పళ్ళెం.

**తాకట్టు:** కుదువ.

**తాకట్టుపెట్టు:** కుదువపెట్టు.

**తాటించు:** ఒకదానితో ఒకటి తాకించు; కొట్టు.

**తాత్కాలికం:** ఆకాలమందు మాత్రమే ఉండేవి; కొద్దికాలానికి పరిమితమైనది.

**తాత్పర్యం:** అభిప్రాయం; ఆసక్తి.

**తామసం:** కోపం; ఆలస్యం; చీకటి.

**తామసించు:** ఆలస్యంచేయు.

**తామ్రం:** రాగి; రాగివంటి ఎరుపు రంగు.

**తాయం:** అరుదైన వస్తువు.

**తాయిలం:** బుజ్జగించడానికిగాను బాలలకిచ్చే తిను బండారం.

**తాయెత్తు:** అలంకారం కోసంగాని, దృష్టిదోషం తగలరాదనిగాని బాలల గొంతునో, మొలనో, సందిటనో కట్టే రాగి/వెండిరేకు చుట్ట.

**తార/తారక:** నక్షత్రం.

**తార్కాణం:** దృష్టాంతం, నిదర్శనం, ఉదాహరణ.

**తారతమ్యం:** తేడా, ఎక్కువ తక్కువలు.

**తారసం:** సంభవించినది; కనిపించినది; ఎదురుపడినది; సమీపించినది.


తారసపడు


తాళిబొట్టు


తాయెత్తు


తార


తావడం

**తారసపడు:** సమీపించు; ఎదురుగావచ్చు.

**తారుమారు:** అటుదిటు ఇటుదటు మారడం, క్రమం తప్పడం.

**తాలిమి:** ఓర్పు; ధైర్యం.

**తాళపత్రం:** తాటాకు, తాటాకుతో చేసిన చెవికమ్మ.

**తాళి:** మంగళసూత్రం; పతకం.

**తాళిబొట్టు:** మంగళసూత్రంతో కట్టే బంగారునగ; పుస్తె.

**తాళింపు:** నూనె మొ. వాటిలో వేయించడం; తిరగబోత.

**తాళిక:** ఓర్పు, శాంతి; ఓర్చుకోదగినది.

**తాళు:** ఓర్చుకొను, సహించు; నిదానించు.

**తావడం, తావళం:** సరం, హారం; భక్తులు-సన్యాసులు ధరించే రుద్రాక్షలు మొ. వాటిదండ.

**తావరం:** స్థానం; స్థిరమైనది (<ప్రా. థావర-, సం. స్థావర-).

**తావలం:** స్థానం, ఉండేచోటు; ఆధారం; అవకాశం; దృష్టాంతం.

**తావి:** వాసన; మంచివాసన; పళ్ళ పాచి; చెడువాసన.

**తావికొను:** రుచిచూచు; వాసన చూచు.

**తావు:** చోటు.

**తిగ:** మూడు.

**తిగకంటి:** మూడుకళ్ళు గల వాడు, శివుడు.

**తిట్ట:** కుప్ప, గుట్ట; సేనల గుంపు.

**తిత్తిరి:** తీతువుపిట్ట.

**తిప్ప:** దిబ్బ; రాశి; చిన్నకొండ.

**తిప్పలు:** బాధలు.

**తిమింగలం:** పెద్దపెద్ద చేపలను మింగే జలజంతువు.

**తిమిరం:** చీకటి.

**తిరం:** స్థిరం, నిశ్చలం; శాశ్వతం (<ప్రా. థిర–, సం. స్థిర–).

**తిరస్కరించు:** కాదను; అవమానించు.

**తిరస్కారం:** అవమానించడం; తిట్టడం.

**తిరిపం:** బిచ్చం; భిక్షుకవృత్తి.

**తిరు:** పవిత్రం; మంచిది.

**తిరునాళ్ళు:** దేవుని ఉత్సవ దినం (<తమిళం: తిరు–, సం. శ్రీ).


తిర్లిక


తిలకం


తిప్ప


తిమింగలం


తిరిపం

**తిర్లిక:** దేవతా విగ్రహాల ముందు ఉంచే దీపం (తమిళం: తిరువిళక్కు).

**తిలకం:** బొట్టు; శ్రేష్ఠం.

**తిలకించు:** చూచు; మెచ్చుకొను; బొట్టుపెట్టు.

**తివురు:** పూనుకొను; తిరుగు; త్వరపడు; కుతూహలపడు

**తీండ్ర:** గట్టికోరిక; కోపం; వేడిమి.

**తీక్ష్ణం:** వాడియైనది; చురుకైనది; వేడిమి.

**తీరం:** గట్టు, ఒడ్డు.

**తీర్థం:** పుణ్యక్షేత్రం; రేవు, ఘట్టం; పవిత్రజలం.

**తీవరం:** తొందర; చిరాకు (<సం. తీవ్రమ్).

**తీవ్రం:** వాడిమిగలది; వేడిమి గలది; ఎక్కువైనది.

**తుంటరి:** చెడ్డవాడు; అల్లరివ్యక్తి.

**తుచ్ఛం:** నీచం; చిన్నది.

**తుద:** చివర; చివరిది; చేటు; తర్వాత. తుదముట్టు: ముగిసిపోవు; గతించు.

**తునుము:** నరకు; తుంచు, కోయు; చీల్చు; చంపు.

**తుపాను:** గాలివాన (< ఉర్దూ. తుఫాన్).

**తురంగం:** గుర్రం.


తురంగం

**తుల:** త్రాసు; సమానం తుల తూగు: సాటియగు.

**తులం:** ఒకతూనిక, రూపాయి ఎత్తు.

**తులాదానం:** తనఎత్తు తూనిక గల బంగారు మొ.వాటిని దానం చేయడం.


తుల

**తులాభారం:** తనఎత్తు బరువు గల బంగారు మొ.వాటితో తూగి దానం చేయడం.

**తులువ:** తుంటరి; దుష్టుడు; అవివేకి.


తేజం

**తుళువ:** ఒకదేశం; కృష్ణదేవ రాయల వంశనామం.

**తుషారం:** చల్లనిది; మంచు; తుంపర.

**తూ.చా.తప్పకుండా:** ఏదీ వదలివేయకుండా.

తూపు

**తూపు:** బాణం.

**తృణప్రాయం:** గడ్డిపోచతో సమానమైనది; అల్పమైనది.


తేరు

**తృణీకరించు:** గడ్డిపోచగా భావించు, అలక్ష్యంచేయు.

**తెగడు:** నిందించు; తిరస్క రించు; బెదరించు.

**తెగులు, తెవులు:** రోగం, జబ్బు; చీడ.

**తెగువ:** ఔదార్యం; సాహసం; నిశ్చయం.


తొండం

**తెన్ను:** దారి; విధం, రీతి.

**తెప్ప:** నీరుదాటే సాధనం.

**తెమ్మెర:** చల్లటిగాలి; దక్షిణపు గాలి.

**తెరువు:** దారి; న్యాయం, ధర్మం; ఉపాయం. తెరువరి: దారిని నడచే వ్యక్తి బాటసారి.

**తెలంగాణం:** ఆంధ్రప్రదేశ్‌లో ఒక ప్రాంతం, అదిలాబాద్, వరంగల్, హైదరాబాద్ మొ. తొమ్మిది జిల్లాలతో కూడిన దేశభాగం.

**తేజం, తేజస్సు:** కాంతి; ప్రతాపం; అగ్ని; బంగారు; చైతన్యం.

**తేజి:** మేలుజాతి గుర్రం.

**తేరసి:** త్రయోదశి (<ప్రా. తేరస-, సం. త్రయోదశ-).

**తేరు:** రథం.

**తేరుకొను:** కోలుకొను; తేటగా అగు.

**తేరుగడ:** ముగింపు; నేర్పు.

**తైలం:** నూనె, తిలల (నువ్వులు) నుంచి తీసిన చమురు.

**తొంటిచేయి:** ఈచపోయిన చేయి.

**తొండం:** ఏనుగు తొండం (<సం. తుండమ్).

**తొంబ:** గుంపు.

**తొక్కిస:** అటుఇటు తిరగడం. తొక్కిసలాట.

**తొట్టెల:** ఉయ్యాల.

**తొడవు:** ఆభరణం.

**తొడుసు:** చిక్కు; బాధ; విసుగు.

**తొత్తు:** బానిస, ధాసి.

**తొయ్యలి:** స్త్రీ.

**తొరపడం:** వడ్రంగి బెజ్జాలు వేసే పరికరం.

**తొలకరి:** వర్షకాలం.

**తొలగు:** తప్పుకొను; పక్కకి పోవు; మరలు; దూరమగు. తొలగించు: పోగొట్టు; విడుచు.

**తొలి[1], తొల్లి:** మొదటి, పూర్వం.

**తొలి[2]:** కన్నం, తొర్ర.

**తొలిచూలు:** మొదటి బిడ్డ.

**తొలిదిక్కు:** మొదటిదిక్కు, తూర్పు.

**తొలినెల:** మొదటినెల, చైత్రమాసం.

**తోకచుక్క:** ధూమకేతువు.

**తోబుట్టువు:** తోడబుట్టిన వ్యక్తి. అన్న, తమ్ముడు, అక్క, చెల్లెలు.

**తోడా:** చేతికిగాని కాలికిగాని తొడిగే బిరుదు కడియం.


తోమాలియ


తొడవు


త్రాసు


త్రుంచు


తొలిదిక్కు


తోకచుక్క


తోడా

**తోమాలియ:** ఆకులు పువ్వులు కూర్చికట్టిన దండ.

**త్యాగం:** దానం; వదలిపెట్టడం.

**త్రాణ:** బలం, శక్తి; జాగరూకత.

**త్రాసు:** తక్కెడ ( ఉ.తరాజూ).

**త్రికం:** మూడింటి సమూహం; ఆ,ఈ,ఏ-అనే మూడు అచ్చులు.

**త్రిణయనుడు:** మూడు కన్నులుగలవాడు, శివుడు.

**త్రిలింగం:** శ్రీశైల దాక్షారామ కాళేశ్వరాలనే మూడు లింగాల మధ్యగల దేశం; తెలుగుదేశం.

**త్రివేణి:** గంగాయమునా సరస్వతులనే మూడు నదులు కలిసే పవిత్రప్రదేశం.

**త్రిశంకుస్వర్గం:** ఎటూకాని స్థితి.

**త్రుంగు:** తునకలగు; రాలిపోవు; ముగిసిపోవు.

**త్రుంచు:** ముక్కలుచేయు; చించు; చంపు.

**త్రుళ్ళు:** సంతోషంతో గంతులు వేయు, ఉప్పొంగు; ఎగసిపాటు. త్రుళ్ళిపడు: కోపం భయం గర్వం మొ. వాటివల్ల ఎగిరిపడు.

**త్రెళ్ళు:** రాలు, కూలు; విరుగు; చచ్చు.

# ద

**దండ[1]:** వైపు, పక్క; దగ్గర; చోటు; తోడ్పాటు.

**దండ[2]:** హారం; భుజబలం.

**దండన:** దండించడం.

**దండనాయకుడు:** సేనానాయకుడు.

**దండప్రణామం:** కర్రలాగా నేలపై సాగిలపడి నమస్కరించడం.

**దండయాత్ర:** శత్రురాజులపై దాడి వెడలడం.

**దండించు:** శిక్షించు.

**దండు[1]:** డబ్బు మొ.వాటిని చందాలెత్తు.

**దండు[2]:** సేన; గుంపు.

**దంతధావనం:** పళ్ళుతోము కొనడం.

**దంతం:** పల్లు; ఏనుగుకోర.

**దంతి:** పెద్ద దంతాలు(పళ్ళు) కలది, ఏనుగు.

**దక్కు:** దొరకు; లొంగు; నిలుచు. **దక్కించు:** నిలబెట్టు; కాపాడు.



దక్షిణాపథం



దండ



దండప్రణామం



దబ్బనం



దంతధావనం

దంతి



దర్పణం

**దక్షిణాపథం:** దక్షిణ భారత దేశం.

**దక్షుడు:** సమర్థుడు; తెలిసినవాడు; చురుకైనవాడు.

**దగ:** దప్పిక; తాపం; అలసట.

**దగా:** మోసం. **దగాకోరు:** దగాచేయువాడు, మోసగాడు.

**దగుల్బాజీ:** మోసగాడు; దొంగ.

**దట్టుడు:** ధీరుడు; శూరుడు.

**దడ[1]:** భయం; వణకు; గుండె మొ.వాటి కదలిక.

**దడ[2]:** కొయ్యత్రాసు, తక్కెడ.

**దప్పి, దప్పిక:** దాహం.

**దబ్బ:** వెదురుబద్ద.

**దబ్బనం:** గోనెసంచులు కుట్టే పెద్దసూది.

**దబ్బర:** అసత్యం; మోసం; తిట్టు; తప్పు.

**దయాళువు:** దయగలవాడు.

**దయిత:** భార్య.

**దయితుడు:** భర్త; ఇష్టుడు.

**దరి:** గట్టు; తీరం; హద్దు; దగ్గర.

**దరిబేసి:** దీనుడు; పిసినారి (< ఉర్దూ. దర్వేష్: ముస్లింసాధువు).

**దర్పణం:** అద్దం.

**దర్పం:** గర్వం; ఉత్సాహం.

**దర్శకుడు:** నేర్పరి; పరిశీలించేవాడు.
**దర్శనీయం:** చూడదగినది, అందమైనది.
**దర్శించు:** పెద్దలను చూచు.
**దళం:** సైన్యభాగం; పూవురేకు; ఆకు.
**దళవాయి:** సేనానాయకుడు.
**దళసరి:** మందం, పల్చనకానిది.
**దళితం:** చీల్చబడినది; అణగదొక్కబడినది; అటూఇటూ చిమ్మబడినది.
**దవ్వు:** దూరం; దూరప్రదేశం.
**దశ:** పది; స్థితి; వరుస; దీపపువత్తి.
**దసరా:** ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుంచి దశమివరకు జరిగే పదిరోజుల పండుగ; విజయదశమి పండుగ.
**దస్తరం:** కాగితాలమూట, వడ్డీ పత్రాలకట్ట
**దస్తా:** 24 తావులు, రీములో 1/20 భాగం.
**దస్తూరి:** చేవ్రాలు.
**దహించు:** కాల్చు.
**దాపరం:** దొంగిలించడం; మోసం.


దర్శనీయం


దాడి


దసరా


దస్తరం


దస్తూరి


దాలి

**దాపురం:** దాచడం; రహస్యం; భద్రపరచడం; రహస్య స్థానం, దాచినసొమ్ము.
**దాక్షిణాత్యుడు:** దక్షిణ దేశపువాడు.
**దాక్షిణ్యం:** కనికరం; ఒద్దిక; నైపుణ్యం.
**దాడి[1]:** దండయాత్ర.
**దాడి[2]:** గడ్డం.
**దాణా:** గుర్రం మొ.వాటికి పెట్టే ఉడికించిన ఉలవలు మొ. తిండి.
**దాత:** దానంచేసేవాడు.
**దాది:** పెంచిన తల్లి (< సం. ధాత్రీ).
**దాపల:** ఎడమవైపు.
**దామం:** దండ.
**దామెన:** పెద్దతాడు (< సం. ధామనీ).
**దాయం[1]:** జూదంలోని పందెం; ఆపద.
**దాయం[2]:** దానం; కట్నం; సారె.
**దాయాది:** తాత తండ్రుల ఆస్తిలో భాగం పంచుకునేవాడు; జ్ఞాతి; కొడుకు.
**దాలి:** నిప్పులగుంట.

**దావా:** వ్యాజ్యం; దొంగతనం.

**దాసు, దాసుడు:** భక్తుడు; సేవకుడు.

**దిక్కు:** వైపు; స్థానం; రక్షణ; తూర్పు మొ. దిక్కు. దిక్కుమాలిన: దిక్కులేని, ఆధారంలేని.



దాసు

**దిక్సూచి:** దిక్కులను చూపే పనిముట్టు.



దిక్సూచి

**దిగసన:** తక్కువ. ఏండ్లువిగసన, బుద్ధిదిగసన.

**దిగాలు:** వ్యాకులత. దిగాలు పడు: చిన్నబోవు.



దివ్వటీ

**దిగుమతి:** ఇతరదేశాల నుంచి వలసిన సరకులను తెప్పించుకోవడం.

**దిగులు:** భయం; అధైర్యం.



దిగుమతి

**దిటవు:** ధైర్యం, శక్తి.

**దిడ్డి:** చిన్నద్వారం, దిడ్డివాకిలి: చిన్నతలుపు.

**దిద్దు:** నేర్పించు; సరిజేయు; తిలకం మొ.వి పెట్టుకొను; సవరించు; వ్రాసిన అక్షరాలపై తిరిగి వ్రాయు.

**దినబత్తెం:** రోజువారి బత్తెం.

**దినవహి:** రోజువారీ జమా ఖర్చులెక్క.

**దినవెచ్చం:** రోజువారీ అయ్యే ఖర్చు.

**దినుసు:** సరకు; ప్రకారం, రీతి; రకం; సమానం (<ఉర్దూ. జిన్స్).

**దిప్పకాయ:** కొంటెవాడు.

**దివాణం:** రాజభవనం; కొలువు కూటం.

**దివి:** స్వర్గం; ఆకాశం.

**దివియ, దివె, దివ్వె, దీవియ:** దీపం (<ప్రా. దీవియా, సం. దీపికా).

**దివ్వటీ, దివటీ:** ఇనుపచువ్వకు గుడ్డలు చుట్టి ముట్టించే దీపం (<ప్రా. దీవట్టి, సం. దీపయష్టిః).

**దిసంతు:** నింద. దిసంతులు కొట్టు: నిందించు. దూషించు.

**దిష్టి:** చూపు, దృష్టి కిసరు, దృష్టిదోషం. (<సం. దృష్టిః). దిష్టికొట్టు, దిష్టితగులు: దృష్టిదోషం కలుగు.

**దీక్ష:** గట్టిపట్టుదల.

**దీటు:** సవరించు; కదలించు; సమానం; తగినది. దీటు వచ్చు: సరిపోవు.

**దీనారం:** ఒక బంగారునాణెం (ఇది గ్రీకు భాషాపదం).

**దీప్తి:** వెలుగు, ప్రకారం.

**దీర్ఘనిద్ర:** చావు.

**దీర్ఘం:** పొడవైనది; రెండు మాత్రలకాలంలో ఉచ్చరించే అచ్చు. ఆ, ఈ, ఊ మొ.వి.

**దీర్ఘసూత్రుడు:** చాల నెమ్మదిగా పనిచేసేవాడు.

**దీర్ఘాయువు:** చాలకాలం బతికే వ్యక్తి.

**దీలు:** బలహీనమగు; ఊడిపడు. దీలుపడు: బలహీనమగు. (<ప్రా. సఢిల-, సం. శిథిల-)

**దీవన, దీవెన:** ఆశీర్వచనం.

**దీవి:** నీటి నడిమిదిబ్బ, ద్వీపం (<ప్రా. దీవ-, సం. ద్వీపః).

**దుంగ:** కొయ్యమొద్దు.

**దుండగం:** చెడుపని; కీడు; తప్పు.

**దుకాణం:** అంగడి (< ఉర్దూ. దూకాన్).

**దుక్కి:** దున్నడం; నాగటి చాలు.

**దుడుకు:** తొందర; చెడ్డపని; దుష్టం.

**దుడ్డు[1]:** డబ్బు; ఒకరాగినాణెం.






















**దుడ్డు[2]:** లావాటికర్ర; గద.

**దుత్త:** చిన్నమూతిగలకడవ.

**దుప్పి:** మచ్చలుగలజింక.

**దుమారం:** పెద్దదుమ్ము, ఊహించని వార్తవల్ల కలిగిన అల్లకల్లోలం.

**దుమ్ము[1]:** ధూళి. దుమ్మెత్తిపోయు: తిట్టు.

**దుమ్ము[2]:** ఎముక. దుమ్ముల గొండి: ఎముకలు కొరికి తినే ఒక జంతువు.

**దురపిల్లు:** దుఃఖించు; కలత నొందు.

**దురాచారం:** చెడ్డనడవడి, చెడ్డ అలవాటు; చెడు సంప్రదాయం.

**దురితం:** పాపం; కష్టం.

**దుర్భరం:** భరించరానిది.

**దుర్భావన:** చెడ్డతలంపు.

**దుర్భిక్షం:** కరవు; భిక్షదొరకక పోవడం.

**దుర్మతి:** చెడ్డబుద్ధి కలవాడు; మూఢబుద్ధి కలవాడు.

**దుర్లభం:** దొరకనిది; పొంద శక్యం కానిది.

**దులుపు:** రాల్చు; జాడించు; మేల్కొలుపు; తిట్టు.

**దుస్తరం:** దాటడానికి వీలు కానిది.

**దుహిత:** కూతురు.

**దూప:** దప్పిక; అలసట.

**దూరదర్శనం:** దూరంగా ఉన్నవాటిని చూడడానికి వీలైన సాధనం.

**దూరదృష్టి:** ముందు ఆలోచన కలవ్యక్తి; దూరపుఆలోచన.

**దృక్పథం:** దృష్టిమార్గం; అభిప్రాయం.

**దృఢవ్రతుడు:** గట్టిపట్టుదల కలవాడు.

**దృష్టాంతం:** ఉదాహరణ.

**దెప్పరం:** ఆపద; ఆధిక్యం; చెడుమాట.

**దెప్పు:** నిందించు; ఎత్తిపొడుచు.

**దెస[1]:** దిక్కు; వైపు; ఆశ్రయం; చోటు (< ప్రా. దిసా, సం. దిశా).

**దెస[2]:** స్థితి; కష్టదశ; రీతి. (<ప్రా. దసా-, సం. దశా).

**దేవదాయం:** దేవునకు సమర్పించినది; దేవతల భాగం.

**దేవనాగరి:** ఒకలిపి, సంస్కృత లిపి.



దూరదర్శనం



దేవళం



దేహం



దేహళి

**దేవమాతృక:** మేఘమే తల్లిగాగలది, వాననీళ్ళచేత పంటలు పండేపొలం.

**దేవరహస్యం:** దేవతలకు కూడ రహస్యమైనది, చాలరహస్యమైనది, Strictly Confidential.

**దేవలుడు:** దేవతార్చనవల్ల జీవించేవాడు.

**దేవళం:** దేవునిగుడి (< ప్రా. దేవులం, సం. దేవకులం).

**దేవస్వం:** దేవతల కర్పించిన సొమ్ము.

**దేవి:** దేవతాస్త్రీ; రాణి.

**దేవేరి:** రాణి; భార్య.

**దేశాంతరం:** వేరేదేశం; ఇంకొక ప్రాంతం.

**దేశికుడు:** గురువు; బాటసారి.

**దేశ్యం:** దేశంలో పుట్టినది; తెలుగుభాషా పదాలలో ఒక విభాగం.

**దేహం:** శరీరం.

**దేహళి:** ఇంటిగడప.

**దైవజ్ఞుడు:** జోస్యుడు.

**దైవవాణి:** దేవతలభాష, సంస్కృతభాష.

**దొంతర, దొంతి:** ఒక దానిపై ఒకటిగాపేర్చిన వస్తువుల వరుస; వరుస.

**దోహనం:** పాలు పిదకడం; పాలు పిదికేపాత్ర; కొరినకోరికలను నెరవేర్చడం.

**దోహలం:** ఉత్సాహం; గట్టి కోరిక.

**దౌత్యం:** దూతచేయవలసిన పని, రాయబారం.

**దౌహిత్రి:** కూతురుకూతురు, మనుమరాలు. దౌహిత్రుడు: కూతురుకొడుకు.

**ద్రవం:** పరుగెత్తేది; కరగేది; స్రవించేది; నీటివలె ఫలుచనైనది. ద్రవించు: కారు.

**ద్రవ్యం:** డబ్బు; పదార్థం; పూత పూసే వస్తువు.



దొంతర



దోహనం



ద్వారం

**ద్రావకం:** కరగించేది; కరగేది.

**ద్రోవది:** ద్రౌపది, పాండవుల భార్య (<సం. ద్రౌపదీ).

**ద్రోహం:** కీడుచేసే తలంపు; హింస; మోసంతో చంపడం. ద్రోహి: ద్రోహంచేసేవాడు.

**ద్వారం:** వాకిలి; ప్రదేశం; ఉపాయం.

**ద్విపద:** రెండుపాదాలుగలపద్య భేదం.

**ద్వీపం:** చుట్టూ నీరుగల భూభాగం. ద్వీపకల్పం: ఇంచుమించుగా ద్వీపం వంటిది; కొన్నిదిక్కులలో మాత్రం నీరుగల భూభాగం.



ద్వీపం



ధనం: డబ్బు.

ధనువు, ధనుస్సు: విల్లు; పన్నెండు రాసులలో ఒకటి.

ధన్యవాదం: కృతజ్ఞతను తెలిపే మాట.

ధమని: రక్తనాళం, గొట్టంలా బోలుగా ఉండేనరం.

ధర: భూమి, నేల; వెల.

ధరణి: నేల, భూమి.

ధర్మం: ఆచారం; దానం; న్యాయం; మంచిపని; స్వభావం.

ధర్మశాల: అన్నదానంకోసం కట్టినఇల్లు; ధర్మసత్రం.

ధర్మాసనం: న్యాయాధిపతి-జడ్జి కూర్చుండేపీఠం.

ధవళం: తెల్లటిది; మంచివిద్దు.

ధాత: బ్రహ్మ.

ధారపోయు: దానంచేయు.



ధనం



ధనువు



ధరణి



ధూమం

ధారాళం: అడ్డు లేనిది; ఔదార్యం; సులభం.

ధారావాహిక: వరుసగావచ్చేది.

ధిక్కరించు: తిరస్కరించు; బెదరించు; కాదను. ధిక్కారం: బెదరింపు, భయపెట్టుడం; తిరస్కరించడం.

ధీనిధి: బుద్ధిశాలి.

ధీమంతుడు: మంచి బుద్ధి కలవాడు; విద్వాంసుడు.

ధీరుడు: ధైర్యంకలవాడు; బలం కలవాడు; పండితుడు; గట్టి పూనికకలవాడు.

ధురంధరుడు: కార్యభారం నేర్పుగా నిర్వహించేవాడు. ముఖ్యుడు.

ధురీణుడు: బరువు మోసేవాడు; పనులు చేయడంలో నేర్పరి.

ధూపం: సుగంధ ద్రవ్యాల నుంచివచ్చేపొగ.

ధూమం: పొగ; తోకచుక్క.
ధూమకేతువు: తోకచుక్క.
ధూమపానం: పొగతాగడం.

ధూర్జటి: బరువైన జడలుకలవాడు, శివుడు.

**ధూర్తుడు:** మోసగాడు; జూదరి.

**ధూళి:** దుమ్ము. ధూళిగలుపు: దుమ్ములోకలుపు, నాశనం చేయు.

**ధేనువు:** ఆవు. కామధేనువు: కోరినకోర్కెలను తీర్చే దేవలోకపు ఆవు.

**ధైర్యం:** మనస్సులో కలత లేకుండడం; భయంలేకపోవడం.

**ధోరణి:** పద్ధతి; ప్రవర్తన.

**ధ్యానం:** ఆలోచించడం; విషయమందు మనస్సు నిలిపి తలంచడం.







**ధ్యేయం:** లక్ష్యం; ఉద్దేశించినది.

**ధ్రువ:** సాధువైన ఆవు; గుర్రపు సుడి.

**ధ్రువం:** స్థిరమైనది, కదలనిది, ఎప్పుడూ ఉండేది; ఎడతెగనిది; ధ్రువనక్షత్రం ఉత్తర ధ్రువం, దక్షిణ ధ్రువం.

**ధ్వంసం:** నాశనం; కూలడం, కిందపడడం; జారడం.

**ధ్వజం:** జండా; ధ్వజస్తంభం; గుర్తు. ధ్వజారోహణం: దేవతోత్సవాలలోను, జాతీయోత్సవాలలోను పతాకాలను ఎత్తడం.

**ధ్వని:** చప్పుడు.



# న

నంగ: నంగనాచి.

నంగనాచి: చతురురాలు; సాహసపు పనులు చేస్తూ కూడా ఏమీ తెలియని దానిలాగా నటించే స్త్రీ.

నంగి: ముక్కుతో పలుకునది; స్పష్టంకానిది.

నంజ[1]: నంజుకొను పదార్థం.

నంజ[2]: మాగాణి భూమి (<తమిళం, నంజై).

నంజు: విషం. కూర, పచ్చడి మొ. వ్యంజనం.

నంజుకొను: తిను, కూరలు మొ.వాటిని తిను.

నంజుడు: మాంసం; పచ్చడి, కూర.

నందనుడు: కొడుకు, సంతోషం కలిగించేవాడు.

నందిని: కూతురు.

నంబి: భక్తుడు, దాసుడు; దేవుడు, పూజారి.


నకిషీ


నకులం


నక్రం


నక్షత్రం


నఖం


నగరు


నగారా

నకిషీ/నగిషీ: చెక్కడపుపని (<ఉర్దూ.నక్షీ).

నకులం: ముంగిస.

నక్కజిత్తులు: మోసాలు.

నక్కు: ఒదుగు, దాగు; బంగారంమొ.వాటిబిళ్ళలేక ముక్క; నాగటికర్రు.

నక్రం: మొసలి.

నక్షత్రం: చుక్క.

నక్షత్రమాల: 27 పద్యాల సంపుటి; 27 ముత్యాలహారం.

నక్షత్రశాల: అంతరిక్షం లోని గ్రహాల, నక్షత్రాల చలనాలను, కక్ష్యలను, యంత్రాల తోడ్పాటుతో చూపే చోటు. Planetarium.

నఖం: గోరు.

నఖముఖాలు: అన్నిదిక్కుల నుంచి; అన్నివిధాలా.

నగ: భూషణం; పొగాకు దూది మొ. వాటికంట్లపుమూట.

నగరు: అంతఃపురం; కొలువు కూటం; దేవాలయం.

నగారా: పెద్దఢంకా (<ఉర్దూ. నగారా).

నగ్గు: ముక్కలు ముక్కలగు; అణగు.

నచ్చు[1]: ఇష్టమగు; నమ్మకం కలుగు.

నచ్చు[2]: పీడించు; తొందర పెట్టు.

నజరానా: పాలకులను చూడడానికి వెళ్ళినపుడు ఇచ్చే కానుక (< ఉర్దూ. నజరానా).

నజరు: కానుక (< ఉర్దూ. నజర్).

నటన: అభినయం, నాట్యం; కపటప్రవర్తన.

నట్టు[1]: ఆగు, నిలుపు. వాడు పాఠం నట్టుతూ చదివాడు.

నట్టు[2]: ఇల్లు; స్థానం.

నట్టుకొట్టు: వెనుదీయు, సందేహించు.

నడబావి: దిగుడుబావి

నడవ: తలవాకిలికి నడిమి వాకిలికిమధ్యగలచోటు; దారి; మెట్టు.

నడవడి: నడక; ప్రవర్తన; ధర్మం; వృత్తి.

నడుమంతరం: (నడుము+అంతరం) మధ్యలో కలిగినది. నడుమంత్రం, నడుమంత్రపు సిరి.

నడుముకట్టు: సిద్ధపడు.



నత్త



నత్తు



నన



నమాజు

నత్త: సంకుగుల్లలో ఉండే నీటి పురుగు.

నత్తనడక: నెమ్మదిగా సాగే నడక.

నత్తు: స్త్రీలు ముక్కున ధరించే పోగు.

నదం: పడమటి దిక్కుగా ప్రవహించే ఏరు. ఉదా: తపతి సింధు మొ.వి.

నది: ఏరు.

నదీమాతృక: ఏటినీళ్ళచే పంటలు పండే పొలం, నదీముఖం, నదీముఖద్వారం: నది సముద్రంలో కలిసేచోటు.

నన: చిగురు; పువ్వు; మొగ్గ.

ననలెత్తు: పూచు; చిగురించు.

నమాజు: మహమ్మదీయుల దైవప్రార్థన (< ఉర్దూ. నమాజ్).

నమూనా: మాదిరి.

నరకేసరి: నరసింహావతారం; నరులలో శ్రేష్ఠుడు.

నర్తనశాల: నాట్యం నేర్చుకునే హాలు.

నలువ: నాలుగు ముగాలు కలవాడు, బ్రహ్మ.

నల్ల[1]: నెత్తురు, రక్తం.

నల్ల[2]: నలుపు; మచ్చ; తప్పు; బొగ్గు.

నల్లపూస: నల్లటిగాజుపూస.

నల్లి: నెత్తురుతాగేది.



నల్లి

నవ: తొమ్మిది, నవగ్రహాలు, నవధాన్యాలు, నవరత్నాలు, నవరాత్రులు.



నాణెం.

నవనీతం: వెన్న.

నవారు: పట్టెమంచానికి అల్లే పట్టెడ.



నవారు

నస: దురద; గొణుగుడు.

నాంచారు: వైష్ణవదేవత, స్త్రీ (< తమిళం.నాచ్చియార్).

నాంది: ఆనందం; మొదలు.

నాచు: నీటిలోనిపాచి, నీటిలో పుట్టే తీగ.

నాచు

నాగరి: ఒకలిపి.

నాగరికత: మంచిపౌరులు జీవించే పద్ధతి. Civilization.

నాపసాని

నాగలి, నాగేలు: పొలందున్నే పనిముట్టు (<ప్రా. ణంగల, సం. లాంగం–).

నాగలి

నాగసరం: పాములవాడు ఊదే బుర్ర(< ప్రా. నాగసర–, సం. నాగస్వరః).

నాగసరం



నాడి: రక్తనాళం.

నాడీమండలం: శరీరంలోని నాడుల నిర్మాణం.



నాడీమండలం

నాడు: దినం; గ్రామం; దేశం.

నాణెం: రూపాయ మొ. నాణెం.

నాణ్యం: వస్తువులమంచిచెడ్డలు; శ్రేష్ఠత్వం.

నాతం: బత్తెం, Allowance. జీతనాతాలు: PayandAllowance.

నాదం: ధ్వని

నాదారు: చిక్కిపోయిన; బీద వాడు (< ఉర్దూ. నాదార్)

నాన: సిగ్గు; అవమానం (<ప్రా. ణాణ–, సం. జ్ఞాన–). నానగండ, నానగేడి: సిగ్గులేని మనిషి

నానుడి: లోకోక్తి సామెత (నాడు+నుడి).

నాపసాని: పెద్దముత్తైదువ.

నాపసానికబుర్లు: ఆరిందా మాటలు.

నామకరణం: పేరు పెట్టడం.

నామం[1] పెట్టినపేరు.

నామవాచకం: పేర్లను తెలిపేది.

నామం[2]: నుదుట పెట్టుకొనే బొట్టు, కస్తూరినామం, గీరునామం, మూడునామాలు.

నాము[1]: పొగరు, గర్వం.

నాము[2]: లేతపైరు; గింజలేని ఎన్ను.

నాయంకరం: చిన్నభూభాగం పైపాలనాధికారం
నార: పీచు (గోగునార, జనపనార); చెట్లపైని బెరడు; నారతోనేసిన బట్ట.
నారచీర: నారతోనేసినచీర.
నారసం: బాణం; ఇనుపఊచ (< ప్రా.నారాచ-, సం. నారాచ-).
నారి[1]: స్త్రీ; భార్య.
నారి[2]: వింటితాడు; నరం.
నారు: మొక్కలు మొలవడానికి చల్లేవిత్తులు; బంతినారు, వంగనారు; చిన్నమొలకలు.
నాళిక: గొట్టం; తామర మొ. వాటికాడ.
నావ: ఓడ.
నావికుడు: ఓడను నడపేవాడు; ఓడలో పనిచేసేవాడు.
నాసి: తక్కువరకం.
నాసిక: ముక్కు; ఒక పట్టణం పేరు.
నాస్తికుడు: దేవుడుగాని, పరలోకంగాని లేదనే నమ్మకం కలవాడు; వేదాలను నమ్మనివాడు.


నింగి


నికేతనం


నారి


నాళిక


నావ


నాసిక

నింగి: ఆకాశం; స్వర్గం.
నికరం[1]: రాశి; మొత్తం; సమూహం.
నికరం[2]: మంచిది, శ్రేష్ఠం.
నికేతనం: ఇల్లు.
నిక్కం, నిక్కువం: నిజం, సత్యం; స్పష్టం.
నిగారం: మెరుగు, కాంతి.
నిగ్గు: కాంతి; కిరణం; జిడ్డు; సారం.
నిగ్రహం: అడ్డగించడం; ఓడించడం; దండించడం; సాధించడం.
నిగ్రహించు: ఆపు, అదుపులో పెట్టు.
నిదర్శనం: ఉదాహరణ.
నిదానం[1]: నెమ్మది.
నిదానం[2]: మూలకారణం; రోగం ఫలానా అని నిర్ణయించడం.
నిధానం: ఆధారం; పాతిపెట్టిన సొమ్ము.
నిపుణత: నేర్పు.
నిపుణుడు: నేర్పరి.
నిమిత్తం: కారణం; గుర్తు; శకునం.
నిమిషం: రెప్పపాటంత కాలం, 60 సెకండ్లకాలం.

**నిమ్మళం:** తగ్గినది; నెమ్మది; స్వాస్థ్యం.

**నిరంకుశం:** (నిర్+అంకుశం)– అంకుశం లేనిది; అడ్డులేనిది; అడ్డగించరానిది.

**నిరంకుశత్వం:** అడ్డులేకపోవడం.

**నిరక్షరాస్యులు:** చదువురానివాడు.

**నిరర్థకం:** అర్థంలేనిది; పనికిరానిది.

**నిరవధికం:** అవధిలేనిది, కాలనిర్ణయం లేనిది. పరీక్షలు నిరవధికంగా వాయిదావేశారు.

**నిరశనం (నిర్+అశనం):** అశనంలేనిది, భోజనం లేనిది; ఉపవాసం.

**నిరశనదీక్ష:** నిరాహారదీక్ష.

**నిరసనం:** తిరస్కరించడం, ఖండించడం, వ్యతిరేకించడం, అసమ్మతిని తెల్పడం.

**నిరాఘాటం:** అడ్డులేనిది, ఎదురులేనిది.

**నిరాడంబరం:** ఆడంబరంలేనిది.

**నిరాధారం:** ఆధారంలేనిది.


నిర్ఝరం


నిరోధించు


నిర్మించు


నివాళి

**నిరుద్యోగి:** పనిలేనివాడు; ఉద్యోగం లేనివాడు.

**నిరూపించు:** నిర్ణయించు; ఆధారాలతో రుజువుచేయు.

**నిరోధించు:** అడ్డగించు.

**నిర్ఝరం:** సెలయేరు.

**నిర్ధారణం:** నిశ్చయించడం.

**నిర్బంధం:** బలాత్కారం; గట్టిగా కట్టివేయడం; చెరసాలలో ఉంచడం.

**నిర్మించు:** (గ్రంథాలను) రచించు; ఇల్లు మొ. వాటిని కట్టు.

**నిర్మూలం:** మూలంలేనిది; ఆధారంలేనిది; పూర్తిగా నశించినది.

**నిర్యాణం:** మరణం, శ్రీకృష్ణ నిర్యాణం.

**నిర్వచనం:** మాటాడనిది; వచనంలేని కావ్యం.

**నిర్వాణం:** ఆరిపోయినది; మరణం; ముక్తి. బుద్ధుని మహానిర్వాణం.

**నివాళి, నివ్వాళి:** ఆరతి.

**నివేదించు:** ఎరిగించు, విన్నవించు; అప్పగించు; సమర్పించు.

**నివేశనం:** ఇల్లు, శిబిరం.
**నివ్వటిల్లు:** నెరవేరు; ఎక్కువగు; పెరుగు; వ్యాపించు.
**నివ్వెర:** ఆశ్చర్యం; మిక్కిలి భయం.
**నిశాచరుడు:** రాత్రులందు తిరిగేవాడు; దొంగ; రాక్షసుడు.
**నిశానీ:** వేలిముద్ర; జండా; గుర్తు (< ఉర్దూ. నిశానీ).
**నిశానీదారు:** చదువురానివాడు.
**నిషేధం:** మరలించడం; కూడదని ఆపడం.
**నిష్క్రమణం:** ఇంటి నుంచి వెడలిపోవడం. మహాభినిష్క్రమణం: బుద్ధుడు ఇల్లు వదలిపోవడం.
**నిష్ఠ:** ఆసక్తి; ధర్మం మొ. వాటిపై శ్రద్ధ నియమనిష్ఠలు.
**నిష్పత్తి:** రెండు సంఖ్యలకు గల సంబంధం.
**నిష్ఫలం:** ఫలంలేనిది; ప్రయోజనం లేనిది.
**నిసర్గం:** సహజం; స్వభావం.
**నిస్త్రాణం:** త్రాణలేనిది, బలం లేనిది.
**నిస్పృహ:** ఆశలేనిది.
**నీచు[1]:** నీచుడు, చెడ్డవాడు.


నివేశనం


నిశానీ


నృత్యం


నృపాలుడు

**నీచు[2]:** చెడువాసన.
**నీరదం:** నీటిని ఇచ్చేది, మేఘం.
**నీరధి:** నీటికిస్థానం, సముద్రం.
**నీహారం:** మంచు.
**నుడి:** మాట.
**నుడికారం:** చమత్కారమైన మాట; పలుకుబడి.
**నుదురు:** నొసలు.
**నుదుటికన్ను:** శివుని నొసటి కన్ను.
**నూపురం:** కాలిఅందె.
**నృత్యం:** నాట్యం, ఒడిసీ, కథక్, కథకళి, కూచిపూడి, భరతనాట్యం, మణిపురి మొ.వి. కొన్ని నృత్యరీతులు.
**నృపాలుడు,నృపుడు,:** రాజు.
**నెగడు:** వృద్ధిచెందు; గర్వించు; ప్రవర్తిల్లు.
**నెగ్గు:** జయంపొందు; నెరవేరు; కార్యసిద్ధిని పొందు.
**నెచ్చెలి:** ప్రాణస్నేహితుడు, ప్రాణస్నేహితురాలు.
**నెట్టం, నెట్టెం:** గుండ్రటి తలపాగా.
**నెత్తం[1]:** జూదం; పందెం. నెత్తపలక: జూదమాడే బల్ల.

(క్రప్రా. నేత్తం, సం. నేత్ర - కళ్ళ వంటి గుర్తులు కలది).

**నెత్తం²:** కొండమీది చదునైన ప్రదేశం; గ్రామనెత్తం: ఉమ్మ ఉమ్మడిబీడు.

**నెపం:** వంక; నింద; కారణం; తప్పు.

**నెమకు:** వెదకు.

**నెమరువేయు:** మింగిన ఆహారాన్ని పశువులు మరల నోటిలోనికి తెచ్చుకొని నమలు; జ్ఞప్తికి తెచ్చుకొను.

**నెయ్యం:** స్నేహం; ప్రీతి; ఆసక్తి; చుట్టరికం.

**నెయ్యుడు, నెయ్యురాలు:** ఇష్టమైన వ్యక్తి.

**నెరియ, నెరె, నెఱె:** నేలపగులు, బీటు; ఛీలిక.

**నెల:** మాసం; చంద్రుడు. నెల వంక: బాలచంద్రుడు.

**నెలత:** స్త్రీ; భార్య.

**నెలవు:** పరిచయం; సుందరమైనది.


నేత


నేత్రం


నెమరువేయు


నెరియ


నెల


నొసలు

**నెళవు:** రహస్యం; గట్టు; అలవాటు; పరిచయం. నెళవరి: గుట్టుతెలిసినవాడు.

**నేత:** నాయకుడు; అధిపతి.

**నేత్రపర్వం:** కన్నుల పండుగ.

**నేత్రం:** కన్ను; కవ్వపుతాడు; వస్త్రం.

**నేస్తం:** స్నేహం; మిత్రుడు. నేస్తకత్తె, నేస్తకాడు.

**నైజం:** సహజం; తనది.

**నైష్ఠికుడు:** నిష్ఠకలవాడు.

**నైసర్గికం:** స్వభావసిద్ధంగా ఉన్నది.

**నొంచు:** నొప్పించు; చంపు.

**నొగ:** బండికాడి కట్టే కఱ్ఱ.

**నొగులు:** నొప్పిపడు; నలిగిపోవు; బాధ.

**నొసలు:** నుదురు.

**నోము:** వ్రతం; పూజ; పూజించు.

**నౌక:** ఓడ, నౌకాశ్రయం: ఓడలు నిలిచేచోటు.

**నౌబత్తు:** ఒక చర్మవాద్యం.

**న్యూనం:** తక్కువైనది.

# ప

**పంకజం:** బురదయందు పుట్టేది, కమలం.

**పంకం:** బురద; బురదనేల; పట్టుదల.

**పంకా:** పెద్దవీవన (< ఉర్దూ. పంఖా).

**పంకించు:** చలించు, భయపడు (< ప్రా. పంఖ- రెక్క, వైపు, సం. పక్ష).

**పంక్తి:** వరుస.

**పంగం:** పన్ను, భాగం (< ప్రా. పంగ- గ్రహించు స్వీకరించు, సం. ప్రగ్రహ-).

**పంగించు:** కోపగించు; దెప్పి పొడుచు.

**పంచాంగం:** తిథివార నక్షత్ర యోగకరణాలు అనే ఐదింటిని తెలిపే గ్రంథం.

**పంచాక్షరి:** 'నమఃశివాయ' అనే ఐదు అక్షరాలుగల మంత్రం.


పంచాయతి


పంకజం


పంజరం


పంతులు


పంక్తి


పకీరు

**పంచాయతి:** (ఐదుగురు సభ్యులతో కూడిన) గ్రామ పాలనా వ్యవస్థ.

**పంచారం:** విస్తారం, అతిశయం. (< సం. ప్రచార-), పంచారించు: విస్తరించు; వ్యాపించు.

**పంజరం:** పక్షులను ఉంచే గూడు.

**పంజు:** కాగడా, దివటీ.

**పంతం:** పట్టుదల; పోటీ; పౌరుషం; ప్రతిజ్ఞ.

**పంతులు:** చదువులు చెప్పే అయ్యవారు.

**పంద:** పిరికివాడు; చెడ్డవాడు; సోమరి, పందతనం: పిరికితనం; సోమరితనం.

**పందెం:** జగడం, ప్రతిజ్ఞ.

**పంపు:** భాగం; పొలం.

**పంబు[1]:** ఎక్కువగు; చెలరేగు; వ్యాపించు.

**పంబు[2]:** గట్టిగా ఈడ్చి కట్టేవాడు.

**పకీరు:** ముస్లిం బిచ్చగాడు, సాధుపురుషుడు (<ఉర్దూ. ఫకీర్).

**పక్క:** వైపు, దిక్కు, పార్శ్వం; పడక.

**పక్కం:** పార్శ్వం; మిత్రుడు (<ప్రా.పక్ఖ- భాగం, రెక్క, పక్క, సం-పక్ష-).

**పక్కెర, పక్ఖెర:** గుర్రం మొ. వాటికి తొడిగే కవచం. (<ప్రా.పఖర-, సం.ప్రఖర-).

**పక్కు:** పక్వం; ఎండినది, వరుగు; ఎండుమెతుకు. (<ప్రా.పక్క-, సం.పక్వ-).

**పక్షం:** పక్షిరెక్క; పక్క; తెగ; సైన్యం; పదైదు రోజుల కాలం. పాండవపక్షం కౌరవ భీష్మం.

**పగడం, పవడం:** నవరత్నాలలో ఒకటి. (<ప్రా.పవాళ-, సం. ప్రవాళ-).

**పగ్గం:** తాడు (< ప్రా.పగ్గహ-, సం. ప్రగ్రహ-).

**పగ్గె:** శక్తి; డంబం, గొప్పలు చెప్పుకొనడం(<సం.ప్రజ్ఞా).

**పచరించు:** ప్రసరింపజేయు; చాచు, సవరించు, సిద్ధపరుచు, అమర్చు (< ప్రా.పసార-, సం.ప్రసార-).

**పచ్చడం:** ఉత్తరీయం, దుప్పటి, వస్త్రం (< ప్రా. పచ్ఛడం, పచ్చడం: వస్త్ర విశేషం, సం.ప్రచ్ఛద- కప్పు కొనునది.


పజ్జ


పక్షం


పగ్గం


పట్ట


పచ్చడం

**పజ్జ[1]:** వెనుక; చోటు; దగ్గర (< ప్రా.పచ్ఛా: తర్వాత, వెనుక, మిగిలింది, సం.పశ్చాత్).

**పజ్జ[2]:** దారి, దోవ. (<ప్రా.పజ్జా: మార్గం; సం.పద్యా: దారి).

**పటాటోపం:** డాంబిక ప్రదర్శనం.

**పటాణి:** యవనుడు, యవన దేశపు గుర్రం.

**పటాపంచలు:** చెల్లాచెదరు; చినిగినది.

**పటాలం:** సైన్యంలో భాగం.

**పటికం.** రత్నవిశేషం. (<సం. స్ఫటిక-).

**పటేలు:** గ్రామాధికారి(<మరాఠీ. పటేల్, ప్రా.పట్టవాల-, సం.పట్టపాల-).

**పట్ట:** చెట్టుమొ.వాటి తొక్క, నార; నారతోనేసిన గుడ్డ; ఇనుము మొ.వాటి బద్దె; నవారు.

**పట్టణం:** నీటి ఒడ్డునగల జనావాసం.

**పట్టం:** అధికారపీఠం; డిగ్రీ; బిరుదు.

**పట్టి[1]:** కొడుకు; కూతురు.
**పట్టి[2]:** పొలం; పొలంలో భాగం.
**పట్టింపు:** పట్టుదల, పంతం.
**పట్టీ:** వస్తువుల పట్టిక.
**పట్టుగొమ్మ:** ఆధారం.
**పడగ[1]:** జెండా, టెక్కెం (<ప్రా. పడాగా, సం. పతాకా).
**పడగ[2]:** పాముపడగ (<ప్రా. ఫడగా, సం. ఫణక-).
**పడవాలు:** సేనాపతి (<ప్రా. భడవాల-, సం. భటపాల-).
**పడిగం:** తమ్మపడిగ (<ప్రా. పడిగ్గహ-: పాత్రం; పళ్ళెరం; సం. ప్రతిగ్రహ-, పతద్గ్రహ-).
**పడిసెం:** రొంప, జలుబు.
**పడిహారి:** ద్వారపాలకుడు; సేవకుడు. (< ప్రా. పడిహార-, సం. ప్రతీహార-).
**పడ్డ:** తొలిచూలి ఆవు లేక గేదె; దూడ.
**పణిహారి:** ద్వారపాలకుడు, వాకిటికావలివాడు.
**పతకం:** రత్నాలుపొదిగిన బిళ్ళ; ప్రతిభకు గుర్తింపుగా ఇచ్చే వెండి/ బంగారు బిళ్ళ.
**పతాకం:** జెండా.


పత్రం


పడగ


పడిహారి


పనస


పతకం


పతాకం

**పత్రం:** ఆకు; కాగితం; దస్తావేజు; పక్షిరెక్క.
**పత్రిక:** కాగితం; తాటాకు; వార్తాపత్రిక; ఆహ్వానపత్రిక.
**పథికుడు:** బాటసారి.
**పదను[1]:** సరియైన సమయం; పద్ధతి; పరిపక్వం.
**పదను[2]:** తడి, విత్తులు చల్లడానికి అవసరమైన తేమ.
**ఫదను[3]:** వాడియైనది; వాడిమి.
**పదం:** పాదం; పద్యపాదం; అధికారస్థానం; పాట.
**పదవి:** అధికారస్థానం; దారి.
**పదార్థం:** వస్తువు; పదం యొక్క అర్థం.
**పదిలం:** గట్టిది; సురక్షితం; నిలుకడ; జాగరూకత
**పనస[1]:** ఏభైమాటలుగల వేదభాగం (< ప్రా. పణ్ణాస, పన్నాస: ఏభై; సం. పంచాశత్).
**పనస[2]:** పనసచెట్టు, పండు.
**పనిముట్టు:** వేర్వేరు వృత్తులకు చెందినవారు తమ పనులు చేయడంలో వాడేపరికరం.
**పన్నాగం:** ఎత్తుగడ, కుట్ర.

**పన్నిదం:** పందెం, జూదం మొ.వాటిలో పందెం ఒడ్డడం; పట్టుదల (<ప్రా.పణిదం, సం.పణిత-).

**పబ్బం:** పండగ, ఉత్సవం; భోజనం (<ప్రా.పబ్బ-, సం.పర్వ-).

**పయనం, పైనం:** ప్రయాణం, బైలుదేరడం (<ప్రా.పయాణం; సం.ప్రయాణ-).

**పరమతం:** ఇతరులమతం. పరమతసహనం: ఇతర మతాల పట్లసహనంకలిగిఉండడం.

**పరమహంస:** ఉత్తమపదం పొందిన సన్యాసి. రామకృష్ణ పరమహంస.

**పరస:** యాత్రకైవచ్చే జనుల గుంపు (<ప్రా.పరిసా: సభ, గుంపు; సం.పరిషత్-).

**పరమాణువు:** అతి సూక్ష్మమైన అణువు, atom.

**పరస్పరం:** అన్యోన్యం, ఒకరికొకరు.

**పరాక్రమం:** శౌర్యం, దేహబలం; ప్రయత్నం పరాక్రమించు: శౌర్యంచూపు.

**పరాగం:** పుప్పొడి.


పబ్బం


పరమహంస


పరమాణువు


పరిచారిక

**పరాజయం:** అపజయం, ఓడిపోవడం; అవమానం.

**పరాన్నభుక్కులు:** ఆహారం కోసం తక్కిన మొక్కల మీద, జంతువులమీద ఆధారపడేజీవులు.

**పరాభవం:** అవమానం; తిరస్కారం.

**పరావర్తనం:** వెనుకకు మరలడం.

**పరికించు:** పాటించు, లెక్కచేయు; పరిశీలించు, ఆలోచించు, వెదకు, తెలుసుకొను, చూచు. (<ప్రా.పరిక్ఖ, సం.పరీక్ష).

**పరికీర్తించు:** పొగడు; పేర్కొను.

**పరిక్రమించు:** వెడలిపోవు, వెనుదిరుగు.

**పరిగణించు:** లెక్కించు; తలంచు.

**పరిచర్య:** సేవ; ఆరాధనం.

**పరిచారిక:** సేవకురాలు.

**పరిచ్ఛేదం:** గ్రంథభాగం.

**పరిజ్ఞానం:** తెలివి.

**పరిణమించు:** మారు; లీనమగు.

**పరిణామం:** మార్పు.

**పరిత్రాణం:** రక్షించబడినది.

**పరిధి:** ఆవరణం; చుట్టురేఖ.

**పరిపాటి:** విధం, రీతి; సాధారణం.



**పరిభ్రమణం:** వర్తులం యొక్క చుట్టుకొలత; చుట్టూ తిరగడం.

**పరిమళించు:** మంచి వాసన వ్యాపించు.

**పరివర్తన:** మార్పు; మరలి రావడం.

**పరివేష్టించు:** చుట్టూ కూర్చుండు.

**పరిశోధన:** బాగుగా శోధించడం; కొత్తవిషయాలను కనుక్కోవడానికి శాస్త్రీయంగా చేసే ప్రయత్నం.

**పరిహాసం:** నవ్వులాట, వెక్కిరింత.

**పరుషవర్ణాలు:** కచటతప మొ.వి.

**పర్యవసానం:** ముగింపు; ఫలితం.

**పర్యాయం:** ప్రకారం; వంతు; అనుక్రమం.



పల్లకి



పరిశోధన

**పర్వం:** ఉత్సవం, పండుగ; మహాభారతంలోని గ్రంథ విచ్ఛేదభాగం.

**పలవు, పనవు:** ఏడ్పు (< ప్రా. పలావ-, సం. ప్రలాప-).

**పలాయనం:** పారిపోవడం. పలాయనమంత్రంపఠించు.

**పలువ:** నోటికి వచ్చినట్లు మాటాడేవాడు; దుష్టుడు.

**పల్లకి, పాలకి:** మనుషులు మోసే పాలకి (< ప్రా. పలిఅంక, పల్లంకి, సం. పర్యంక-).

**పల్లటం:** కష్టం; చంచలత. (< ప్రా. పల్లట్ట: తలకిందులు, సం. పర్యస్త-: తలకిందైనది).

**పల్లనం:** అంబారి, గుర్రపుజీను. (< ప్రా. పల్లాణం: జీను).

**పల్లవం:** చిగురు, చిగిర్చిన కొమ్మ. పల్లవించు: చిగుర్చు; అతిశయించు.

**పవడం:** రూ. పగడం: పగడం. (< ప్రా. పవాల-, సం. ప్రవాల-).

**పవనం:** గాలి.

**పశ్చాత్తాపం:** చేసినతప్పు తెలుసుకొని దుఃఖపడడం.

**పస:** చేవ; నేర్పు ; శక్తి వాసన; కాంతి; పద్ధతి.

**పసదనం[1]:** బహుమతి; అన్నం. (<సం. ప్రసాదనమ్).

**పసదనం[2]:** అలంకారం, భూషణం (< సం. ప్రసాధనమ్).

**పసిడి, పైడి:** బంగారం.

**పహారా:** గస్తుతిరగడం; కావలికాయడం.

**పాండవబీడు:** చాలాకాలంగాదున్నని బీడు.

**పాచిక:** జూదమాడేసారె; పన్నుగడ. (<ప్రా. పాసక-, సం. పాశకః).

**పాటకుడు:** పాటపాడేవాడు, గాయకుడు.

**పాటించు:** అవలంబించు; ఆచరించు; అనుకరించు.

**పాడి[1]:** న్యాయం, ధర్మం; ఆచారం. (< ప్రా. పాడీ, సం. పాటీ).

**పాడి[2]:** క్షీరం, పాలు; ఆవుల మంద. పాడిఆవు, పాడి పంటలు.

**పాతర[1]:** నాట్యంచేసే స్త్రీ, నర్తకి. (< సం. పాత్రమ్: నటుడు).


పాతర


పాదం


పాటకుడు


పావకోళ్ళు

**పాతర[2]:** ధాన్యం మొ.వి నిల్వ చేయడానికితవ్విన గొయ్యి.

**పాతిక:** నాల్గోభాగం; ఇరవైఐదు (< సం. పాదికా: నాల్గోవంతు).

**పాదం:** కాలి అడుగు; మంచం కాలు; పద్యపాదం.

**పామరుడు:** తెలివిలేనివాడు; చదువురానివాడు.

**పారతంత్ర్యం:** ఇతరులమీద ఆధారపడి ఉండడం.

**పారితోషకం:** బహుమతి.

**పారుబోతు:** పారిపోయే స్వభావంకలవాడు, పిరికివాడు.

**పాలపుంత:** పాలవెల్లువలా కనిపించే నక్షత్రాల గుంపు.

**పాలసుడు[1]:** రాక్షసుడు (<ప్రా. పలాస-: మాంసంతినేవాడు, సం. పలాశః).

**పాలసుడు[2]:** చెడ్డవాడు; మూఢుడు. (<ప్రా. బాలిస-, సం. బాలిశః).

**పాలు[1]:** క్షీరం.

**పాలు[2]:** భాగం; లోకువ; పక్షం.

**పావకోళ్ళు:** కర్రచెప్పులు.

**పావడం[1], పావడా:** లంగా, వస్త్ర విశేషం. (< ప్రా. పావుడ-: స్త్రీలుకట్టుకునే వస్త్రం సం. ప్రావృత-).

**పావడం**: కానుక, నజరానా. (< ప్రా.పాహుడం: కాన్క, సం.ప్రాభృత-).

**పావు**: నాల్గోవంతు; ఒకకొలత (<ప్రా.పాఉ, సం.పాద-).

**పాశ్చాత్యులు**: పడమటి దేశాల వారు.

**పించం, పించెం**: నెమలిపురి (<ప్రా.పింఛం, సం.ఫించ-).

**పింజె**: మడతపెట్టి వెనుకకు దోపుకునే దోవతికొంగు.

**పిడివాదం**: మొండితనం; మొండిగా వాదించడం.

**పిళ్ళారి**: వినాయకుడు (<తమిళం. పిళ్ళైయార్).

**పీఠం**: పదవి; పీట; సంస్థ.

**పీడ**: బాధ; కీడు. పీడించు: బాధించు.

**పీడనం**: ఒత్తిడి. అల్పపీడనం.

**పీతాంబరుడు**: పసుపు పచ్చ బట్టలు కట్టేవాడు, విష్ణువు.

**పీయూషం**: అమృతం.

**పీరు**: మొహరం పండగలో పూజించే విగ్రహం. పీరు జాదా: పీర్లను పూజించే వాడు.


పావు


పుంజు


పించం


పీఠం


పుట్టి

**పుంజ**: మెట్టభూమి, వానలతో పండేనేల.

**పుంజి**: సమృద్ధి; నాల్గురెట్లు; నాలుగు.

**పుంజు**: కోడిపుంజు; పక్షులలో మగది.

**పుంత**: సన్నటిదారి.

**పుక్కిలి**: బుగ్గలోపలి భాగం. పుక్కిలించు: నీళ్ళు మొ.వాటిని పుక్కిటిలో చప్పుడయ్యేటట్టు కదలించు. పుక్కిటిపురాణం: ఆధారం లేని కథ.

**పుచ్చె**: తలపుర్రె, పునుక; కొబ్బెర మొ.వాటి పిందె.

**పుటం**: దొన్నె; దొన్నెవంటి పాత్ర. పుటాకారం: లోపలికి వంగిన ఆకారం.

**పుట్టం**: వస్త్రం. (<ప్రా.పుట్ట; సం.పుత్రకా).

**పుట్టి**[1]: బుట్ట; ఏరుదాటడానికి వాడే పెద్దబుట్ట. పుట్టిమునుగు: చెడు, ధ్వంసమగు. పుట్టిమునుక: నష్టం, చెరుపు.

**పుట్టి**[2]: ధాన్యంకొలత. పోకకు పుట్టెడు.

**పుట్టు:** పుట్టుక, జన్మం. పుట్టు భోగి: పుట్టినప్పటినుంచి సుఖాలను అనుభవించే వాడు.

**పుడమి:** భూలోకం; రాజ్యం; నేల. (<ప్రా. పుఢవీ, సం. పృథివీ).

**పుత్తడి[1]:** బంగారం.

**పుత్తడి[2]:** కొయ్య, గుడ్డ మొ. వాటితో చేయబడ్డబొమ్మ. (<ప్రా. పుత్తలియా, సం. పుత్తలికా).

**పుత్రిక:** కూతురు.

**పుత్రుడు:** కొడుకు.

**పునశ్చరణం:** పదే పదే మంత్రాన్ని చదవడం.

**పునాది:** ఆధారం; బలానికై గోడకు అడుగుభాగాన పెట్టేగోడ (< ఉర్దూ. బున్యాద్).

**పున్నెం:** పుణ్యం; పవిత్రం. (<ప్రా. పుణ్ణం, సం. పుణ్యం).

**పుప్పొడి:** పూలలోనిపొడి.

**పురంధ్రి:** మగడు పిల్లలుగల ఇల్లాలు.

**పురం:** పెద్దపట్టణం.



పురాణం



పుడమి



పురాతనం



పురి



పుప్పొడి

**పురస్కారం:** పూజించడం; కానుక, బహుమతి. పురస్కరించు: పూజించు; ముందు ఉంచుకొను.

**పురాణం:** పూర్వం జరిగినవని చెప్పే కథ. పురాణాలు పద్దెనిమిది. మత్స్యపురాణం, కూర్మపురాణం, బ్రహ్మపురాణం మొ.వి.

**పురాణించు:** పెరుగు, వర్ధిల్లు.

**పురాతనం:** పూర్వకాలం నాటిది.

**పురి[1]:** నెమలి పింఛం; ఉత్సాహం; గోనెసంచులు కుట్టేతాడు. పురికొల్పు: ప్రేరేపించు.

**పురి[2]:** నగరం.

**పురుడించు:** పోల్చు; సాటియగు.

**పురుషకారం:** మానవ ప్రయత్నం.

**పురోగతి:** ముందుకు పోవడం; అభివృద్ధి.

**పురోగామి:** ముందు నడచేవాడు; ముఖ్యుడు.

**పులకండం:** కలకండ, పటికి బెల్లం.

**పులుము:** కప్పు; పూయు; నలుచు; కొట్టు; మోస పుచ్చు.
**పులుసు:** పుల్లటిది; గర్వం.
**పుష్కరం:** 12 సంవత్సరాల కాలం; 12 సంవత్సరాలకు ఒకసారి ఆయా నదుల పేరిట జరిగే ఉత్సవం. కృష్ణా పుష్కరాలు, గోదావరి పుష్కరాలు.
**పుష్కరిణి:** కోనేరు.
**పుష్కలం:** సమృద్ధి; ఎక్కువ.
**పుష్టి:** పెరుగుదల; బలం.
**పుస్తె:** మంగళసూత్రం, తాళి బొట్టు.
**పూజ్యం:** పూజించదగినది; సున్నం, శూన్యం. వాడికి బుద్ధిపూజ్యం.
**పూను:** ప్రయత్నించు; ప్రారంభించు; ఉద్దేశించు; పట్టుకొను.
**పూర్ణాంకం:** నిండు అంకె, ఒకటి, రెండు..మొ.వి.
**పూస:** గాజు లోహం మొ.వాటి గుళిక. పూసగుచ్చినట్లు: వరుసగా, వివరంగా. పూస యెముక: వెన్నెముక, కశేరుక.


పెంట


పుష్కరిణి


పెండారం


పుస్తె


పెండెం


పూస

**పృథివి. పృథ్వి:** భూమి, నేల. పృథివీపతి: రాజు.
**పెంట[1]:** పేడ మొ.వాటి కుప్ప; చెత్త; పసులదొడ్డి; లేనిపోనిచీదర. పెంటకుప్ప: కసవు కుప్ప.
**పెంట[2]:** పెద్దపట్టణాన్ని ఆనుకొని ఉన్న చిన్న ఊరు, పేట; అంగడివీధి; స్థానం. (<సం. పింఠా).
**పెండారం, పెండెరం, పెండేరం:** పెద్దపండితులు, కవులు, పేరుగల వీరులు కాలికిధరించే అందె. గండపెండేరం.
**పెండెం:** కంపతలుపు, గడ్డి మోపు.
**పెచ్చు:** ఎక్కువ; కొసరు; అధిక ప్రసంగం.
**పెడ:** పక్క. పెడచెవినిబెట్టు: శ్రద్ధగా వినకుండ. పెడదారి: తప్పుదారి.
**పెత్తనం:** అధికారం; మునలితనం.
**పెద్దరికం:** ఘనత; గౌరవం; వివేకం.

పెన్నిధి: పెద్దనిధి; గొప్ప నిక్షేపం.

పెన్నుద్ది (పెను+ఉద్ది): పోటీ చేసేవారి నాయకుడు, జట్టు పెద్ద.

పెర: తేనెపట్టు. పెరతేనె: పెర నుంచి తీసినతేనె.

పెరుమాళ్ళు: విష్ణువు; దేవుడు.

పేట: పట్టణంలో ఒకభాగం; అంగడివీథి. చూ. పెంట.

పేచీ: చిక్కు, బాధ; గొడవ, తగాదా. పేచీకోరు: తంటాలమారి.

పేరంటం: శుభకార్యాలలో ముత్తైదవలను పిలవడం ముత్తైదవలు చేసేవేడుక. పేరంటాలు: ముత్తైదవ.

పేరణి: కుండపైచేసే నృత్యం.

పేరు: అతిశయించు; దట్టమగు; గడ్డకట్టు (పెరుగు మొ.వి. తోడుకొను).

పేరు[1]: పెద్దపేరకమ్మ: పెద్దనది (కృష్ణానది), పేరీదు: ఖర్జూరపుచెట్టు, పేరడవి: పెద్ద అడవి, పేరాకలి: గొప్పఆకలి, పేరాస: ఎక్కువఆకలి, పేరామని:


పెన్నిధి


పెర


పెరుమాళ్ళు


పేరు


పేరంటం


పైకం


పైద

గొప్పవసంతకాలం, పేరోడ: పెద్దఓడ, పేరోలగం: పెద్ద కొలువు కూటం.

పేరు[2]: నామం, ప్రఖ్యాతి, కీర్తి, ప్రతిష్ఠ. పేరుగాంచు: కీర్తిని పొందు. పేరెక్కు: అతిశయించు. పేరొందు: ప్రఖ్యాతినిగాంచు. పేర్కొను: పేరుపెట్టి పిలుచు, పొగడు. పేరుంగరం: పేరు చెక్కిన ఉంగరం.

పేరు[3]: దండ, హారం. ముత్యాల పేరు: ముత్యాలుకూర్చిన దండ.

పేరెం: పరుగు. గుర్రం మొ. వాటి నడకలలో భేదం.

పేలాలు: నిప్పుసెగలో వేగించిన మొక్కజొన్న మొ.వాటి గింజలు. పేలగింజ, పేల పిండి.

పైకం: డబ్బు; వెల; ఒకనాణెం.

పైచేయి: ఎక్కువది. తరగతిలో అందరికంటె పైచేయి.

పైద[1]: పిల్లవాడు.

పైద[2]: బంటు; సేవకుడు.

పైదల: స్త్రీ. (క.త. పైదల్).

**పైనం:** పయనం, ప్రయాణం.

**పైరు:** చేను; పంట; ధాన్యం.

**పొంకం:** సౌందర్యం; కాంతి; గొప్పది.

**పొంగలి:** పాలుచేర్చి పొంగించిన అన్నం; మకర సంక్రాతి పండుగ.

**పొంగు:** మించు; వ్యాపించు; సంతోషించు, గర్వం, సంతోషం; ఒకచర్మవ్యాధి.

**పొంత:** సమీపం; ఒడ్డు; వైపు; ప్రసక్తి.

**పొందిక:** స్నేహం, చేరిక; స్వభావం.

**పొందు:** స్నేహం; చనవు; తోడ్పాటు; సంధి; అనుభవించు; ఆశ్రయించు, ఏకమగు.

**పొడము:** పుట్టు, ఉదయించు; జరుగు; కనబడు; బయలుపడు.

**పొడుపుకథ:** రహస్యమైన అర్థం గలచిక్కుప్రశ్న; a riddle.

**పొత్తం:** పుస్తకం. (<ప్రా. పోత్థం, సం.పుస్తక-).

**పొత్తరం, పొత్రం:** పచ్చళ్ళు మొ.వాటిని నూరే గుండ్రాయి. (<ప్రా.పత్థర-, సం. ప్రస్థర-).


పైరు


పొంగలి


పొది


పొడము


పొన్ను


పొత్తం


పొత్తరం

**పొత్తి:** మెత్తటి గుడ్డముక్క; బొమ్మలకు కట్టేగుడ్డ ముక్క; బట్టబద్దె. (<ప్రా. పోత్తీ, సం.పుత్రికా).

**పొత్తు:** స్నేహం; సహపంక్తి భోజనం; వివాహ సంబంధం.

**పొదలు:** వర్ధిల్లు; కలుగు; వికసించు; ప్రకాశించు; పొంగు; విజృంభించు; వ్యాపించు.

**పొది:** బాణాలపొది; క్షౌర సాధనాలు ఉంచేతోలు సంచి; మోపు, వరుస.

**పొదుపు:** మితవ్యయం; వృద్ధి. డబ్బు పొదుపు జనాభా అదుపు.

**పొన్ను[1]:** బంగారం.

**పొన్ను[2]:** రోకలి మొ.వాటి కొనలో అమర్చే లోహపు వలయం.

**పొరలు, పొర్లు:** అటునిటు దొరలు; తిరుగు; ప్రవర్తిల్లు. పొరలుదండాలు: మొక్కుబడికినేలపైదొర్లుతూచేతులుమోడ్చిచేసే దండాలు.

**పొరి:** చంపడం, పొరిగొను: చంపు; నాశనంచేయు.

**పొరుగు:** దగ్గర; పక్క; పక్కన ఉన్నది. ఇరుగు పొరుగు: రెండు పక్కలఉన్నవారు. ఇరుగు పొరుగుతో చెలిమి ఇంటికి బలిమి.

**పొలకువ:** జాడ, సూచన; చప్పుడు.

**పొలతి, పొలతుక:** స్త్రీ.

**పొల, పొలసు:** మాంసం. పొల దిండి, పొలసుదిండి: మనుషులను చంపి వారిమాంసం తినేవాడు, రాక్షసుడు.

**పొలికలను:** యుద్ధభూమి.

**పొలికేకలు:** పంట పెరుగుదలకై 'పొలో' అని వేసే పెద్దకేకలు; పెద్ద కేకలు.

**పొలిమేర:** ఊరిహద్దు.

**పొలియు:** చచ్చు; నశించు; పాడగు.

**పొల్లు:** గింజలేని ధాన్యం; తప్పు; అబద్ధం; నిస్సారం. పొల్లు మాట: అసత్యం.

**పొసగు:** నెరవేరు, సరిపడు; దొరకు; కలుగు; సాధ్యమగు; కలసిఉండు. పొసగుడుకాడు: మధ్యవర్తి బేరం కుదిర్చేవాడు.


పొరుగు


పొలతి


పొలికేకలు


పోరాటం


పౌజు

**పోకిరి, పోకిరీడు:** చెడ్డవాడు, తుంటరి.

**పోటి:** స్పర్థ; ద్వేషం; సాటి, సమానం.

**పోటు:** దెబ్బ, యుద్ధం; సముద్రపు పొంగు.

**పోడిమి:** అందం; మేలు; సుఖం; గౌరవం; సంపద; శక్తి; పరాక్రమం; రూపం; నడవడి.

**పోడు:** తుప్పలు పెరిగిన అడవి నేల, చిట్టడవి. పోడుగట్టు: అడవినేలలోని తుప్పలు మొ.వాటిని నరకి చదును చేయు. పోడుసేద్యం: పోడునేలలో చేసే వ్యవసాయం.

**పోతరం:** గర్వం, మదం. పోతరమెత్తు: గర్వించు. పోతరీడు: మదించినవాడు.

**పోరాటం:** యుద్ధం; జగడం.

**పోరు:** యుద్ధం; జగడం; కలహించు; పిల్లలు ఏడ్చు; ఎదిరించు. పోరుపెట్టు: ఆకలిచేగాని, బాధచేగాని పసి పిల్లలు ఏడ్చు.

**పౌజు:** సైన్యం; పంక్తి; వరుస. (<ఉర్దూ. ఫౌజ్).

పౌరుడు: పురంలో నివసించే వాడు; ఒకదేశానికి చెందిన వాడు.

పౌష్టికం: శరీరానికి బలాన్ని కలిగించేది. పౌష్టికాహారం: బలం కలిగించే తిండి.

ప్రకంపనం: ఎక్కువగా కదలించునది.

ప్రకటన: వెల్లడిచేయడం; పదిమందికీ తెలపడం.

ప్రకృతం: ఇప్పటివిషయం; ఇప్పుడు.

ప్రఖ్యాతి: ప్రసిద్ధి, కీర్తి; పొగడ్త.

ప్రగతి: పురోభివృద్ధి.

ప్రజాస్వామ్యం: దేశపాలనలో ప్రజలందరూ భాగంకలిగి ఉండడం.

ప్రణాళిక: అభివృద్ధిని సాధించడానికి తయారుచేసిన పథకం. పంచవర్ష ప్రణాళిక.

ప్రతాపం: పరాక్రమం; శక్తి; ఉత్సాహం; కాంతి; వేడిమి.

ప్రతారణం: మోసగించడం.

ప్రతిఘటించు: ఎదిరించు.

ప్రతిజ్ఞ: ఏదైనా ఒకపనినితప్పకచేస్తానని గట్టిగా చెప్పడం.


ప్రతిన


ప్రతిమ


ప్రత్యర్థి


ప్రమద

ప్రతిన: ప్రతిజ్ఞ, శపథం; పోలిక (<సం. ప్రతిజ్ఞా).

ప్రతిపక్షం: ఎదిరిపక్షం. Opposition.

ప్రతిపాదనం: నిరూపించడం; వివరించడం.

ప్రతిభ: వికసించే బుద్ధి.

ప్రతిమ: రాయి మొ.వాటితో చేసిన బొమ్మ.

ప్రతివాది: వాదికి ఎదురు పక్షం వ్యక్తి.

ప్రతిష్ఠ: కీర్తి; నిలకడ; గౌరవం; దేవతా విగ్రహాలను నిల్పడం.

ప్రతీకారం: పగతీర్చుకొనడం.

ప్రత్యర్థి: పోటీచేయువాడు; ప్రతివాది; శత్రువు.

ప్రదర్శనం: విశదంగా చూపించడం.

ప్రబలు: వర్ధిల్లు, అతిశయించు, ఎక్కువగు.

ప్రబోధం: చక్కగా బోధించడం.

ప్రమద: స్త్రీ. ప్రమదవనం: ప్రమదావనం. అంతఃపుర స్త్రీలు విహరించే ఉద్యానవనం.

ప్రమాణం: కొలత; హద్దు; సరియైన ఆధారం; శపథం.
ప్రమాదం: ఏమరిపాటు; మిక్కిలిమత్తు; అపాయం.
ప్రయోగం: వాడుక; నాటకాదులను ప్రదర్శించడం; ఆచరించడం. ప్రయోగశాల: ప్రయోగాలు జరిపేచోటు, Laboratory.
ప్రయోజనం: ఉపయోగం.
ప్రల్లదం: పరుషపుమాట; చెడ్డపని; పనికిరానిమాట. ప్రల్లదుడు: చెడ్డవాడు; పొగరుబోతు; దుండగుడు. ప్రల్లదురాలు: దుష్టురాలు.
ప్రవచనం: అర్థం చెప్పి చక్కగా వివరించడం.
ప్రవర్తనం: నడవడి.
ప్రవాసం: పరదేశ నివాసం.
ప్రసంగం: చర్చావిషయం; ఉపన్యాసం. ప్రసంగించు: ప్రస్తావించు; విస్తరించి చెప్పు.
ప్రసన్నం: నిర్మలం; దయగలది; సరియైనది.
ప్రసరించు: వ్యాపించు; పుట్టు; ప్రవర్తించు.


ప్రసాదం


ప్రహరి


ప్రసంగం


ప్రాచీనం

ప్రసవం: కాన్పు; బిడ్డ; పువ్వు; పండు. ప్రసవించు: బిడ్డను కను; పువ్వుపూచు.
ప్రసాదం: అనుగ్రహం; తేటదనం; దేవతలకు నివేదించినది; పెద్దలు తినగామిగిలిన అన్నం మొ.వి. ప్రసాదించు: దయతో ఇచ్చు.
ప్రసారం: వ్యాపింపజేయడం; వ్యాపించడం; వెలువరించడం.
ప్రస్తుతించు: మిక్కిలి కొనియాడు.
ప్రస్థానం: దండయాత్ర.
ప్రహరి: చుట్టుగోడ, ప్రాకారం; కాపుదలకై ఊరుకోట మొ.వాటి చుట్టు తిరుగుతూ జాముజామునకూ గంటలు కొట్టే బంటు.
ప్రహసనం: పెద్దనవ్వు, పరిహాసం; హాస్య ప్రధానమైన దృశ్యకావ్యం.
ప్రాచీనం: చాలాకాలంకిందటిది.
ప్రాణసంకటం: గొప్ప ఆపద.
ప్రాథమికం: మొదటిది; మునుపటిది.

ప్రాధాన్యం: ప్రధానత్వం, గొప్పతనం.
ప్రాధేయపడు: వేడుకొను.
ప్రారంభించు: మొదలుపెట్టు.
ప్రాసాదం: రాజభవనం.
ప్రియం: ఇష్టమైనది; ఎక్కువ వెల గలది.
ప్రియవచనం: ఇచ్చకపుమాట.
ప్రియదర్శనం: చూడడానికి ఇంపైనది; సుందరం.
ప్రీతి: సంతోషం; తృప్తి; ప్రేమ; స్నేహం.
ప్రెగ్గడ, ప్రగడ, ప్రగ్గడ, ప్రెగడ: మంత్రి. ఎఱ్ఱాప్రెగ్గడ.
ప్రేలు[1]: వదరు; చెడుమాటలాడు. ప్రేలరి: వదరుబోతు.


ప్రేలు


ప్రాధేయపడు


ప్రాసాదం

ప్రేలు[2]: కాలిపోవు; వేడిచేకాగి బద్దలగు; భయంతో అదరిపడు. (ప్రేల్చు: కాల్చు); వేగజేయు, ప్రేలుడ పదార్థాలు.
ప్రొద్దు: సూర్యుడు; సమయం; రోజు; పూట. ప్రొద్దులు: ప్రసవదినాలు.
ప్రోచు: రక్షించు; పెంచు; పాలించు.
ప్రోడ: సమర్థుడు; అధికుడు, చతురుడు. చతురస్త్రీ. (<సం. ప్రౌఢ-).
ప్రోలు: పట్టణం; లోకం; స్థానం. పెదప్రోలు, నిడుబ్రోలు, అమ్మనబ్రోలు.


ప్రొద్దు

# ఫ

ఫణం: పాముపడగ.

ఫరమానా: రాజశాసనం, ఉత్తర్వు. (<ఉర్దూ. ఫర్మానా).

ఫలం: పండు; పంట; పరిణామం; ఫలితం, ఫలసాయం: పంట.

ఫలకం: పలక.

ఫాలం: నుదురు. ఫాలనేత్రుడు, ఫాలాక్షుడు: నుదుటిపై కన్నుగలవాడు, శివుడు.


ఫలకం


ఫాలం


ఫుప్పుసం


ఫణం


ఫరమానా


ఫలం


ఫూత్కారం

ఫిరాయించు: మారు.

ఫుప్పుసం: ఊపిరితిత్తి. ఫుప్పుస ధమని: గుండెనుంచి చెడు రక్తాన్ని ఊపిరి తిత్తులకు తీసుకపోయె రక్తనాళం. ఫుప్పుససిర: ఊపిరితిత్తుల నుంచి మంచిరక్తాన్ని గుండెకు తీసుకుపోయే రక్తనాళం.

ఫూత్కారం: పాము బుస్సుమని బుసకొట్టడం.

ఫేరవం: నక్క.

ఫేష్వా: ఖజానా అధికారి (<మరాఠీ. పీష్వా).


ఫేరవం


ఫేష్వా

# బ

**బంటు:** సేవకుడు, పరిచారకుడు; శిష్యుడు; భక్తుడు.

**బంటరి:** శూరుడు.

**బంటరికం:** దాస్యం.

**బంటుతనం:** పరాక్రమం.

**బంట్రోతు, బంట్రౌతు:** (బంటు+రౌతు) సేవకుడు; శూరుడు.

**బండరి, బండారి:** ఖజానా అధికారి.

**బండరు, బండారం, బండారు:** ఖజానా, కోశాగారం; డబ్బు (< ప్రా. భాండా అర-, సం. భాండాగార-).

**బండాలం.** మూలధనం; నాయకత్వం.

**బంతి:** వరుస; భోజనానికి కూర్చునె వారి వరుస. (< ప్రా. పంతి, సం. పంక్తి-).

**బంద, బందా:** లొంగిపోయినాడు.


బందిపోటు


బంటు


బంట్రోతు

బందూకు


బంతి


బక్క

**బందాకోరు:** స్వాధీనమైనవాడు

**బందీఖానా:** చెరసాల.

**బందిపోటు:** ఆపి దోచుకొవడం.

**బందిపోటుదొంగ:** దోపిడీ దొంగ.

**బందు:** చుట్టుకొనడం; ఆపివేయడం, దుకాణాలు మొ. మూసివేయడం.

**బందుగు, బందువు:** చుట్టం, బంధువు.

**బందూకు:** తుపాకి.

**బందె:** పశువులచెరసాల, బందెల దొడ్డి.

**బందోబస్తు:** ముందు జాగ్రత్తగా రక్షణ కోసం చేసిన ఏర్పాటు; కట్టుదిట్టం (<ఉర్దూ. బందోబస్త్).

**బక్క:** అల్పం, నీచం; కృశించినవాడు. బక్కచిక్కు, బక్కటిల్లు: కృశించు.

**బగ్గం:** చెడినది, పాడైనది (< ప్రా. భగ్గం, సం. భగ్నం).

**బచ్చు:** కోశాధికారి; వర్తకుడు (< ప్రా. వేస్స–, సం. వైశ్య–).

**బచ్చెన:** మైపూత; మోసం; రంగు, గుర్తు (< ప్రా. పచ్ఛణ్ణ–, సం. ప్రచ్ఛన్న–).

**బడాయి:** గర్వం..

**బడిగల్లు:** రాతిబోను.

**బడుగు:** క్షీణించినది; బీదతనం.,

**బదులు:** మారు; మార్పు; జవాబు. చేబదులు.

**బధిరులు:** చెవిటివారు.

**బన్నం:** అవమానం; అపజయం; ఆపద (< ప్రా. భిన్నం, సం. భగ్నమ్).

**బయకాడు:** గాయకుడు; వీణ వాయించేవాడు; సంగీతం నేర్పేపంతులు..

**బయకారం:** గానం, సంగీతం.

**బరణి:** చిన్నడబ్బి.

**బరమా:** చెక్కలు మొ. వాటికి బెజ్జాలు వేసే పనిముట్టు.

**బరవసం:** ధైర్యం; పట్టుదల; ఉత్సాహం.

**బరి:** హద్దు; గీత; పక్క..

**బరిగోల:** ఏనుగులను తోలే వెదురు కర్ర.


బరిసె


బలశాలి


బధిరులు


బయకాడు


బరణి


బరమా


బస్తా

**బరిసె:** బల్లెం..

**బలకరం:** బలం కలిగించేది; దృఢమైనది.

**బలగం:** బంధువర్గం; సేవకులు; సైన్యం; గుంపు.

**బలశాలి:** బలం కలవాడు.

**బలాదూరు:** దిగదుడుపు (< ఉర్దూ బలాదూర్).

**బలా, బలారె, బళా, బళారె:** మెచ్చుకోవడం.

**బలిమి:** బలం; పరాక్రమం; బలాత్కారం.

**బలియుడు:** బలవంతుడు, శూరుడు; సమర్థుడు.

**బల్లిదం:** బలంగలది..

**బల్లిదుడు:** బలవంతుడు; శూరుడు, గొప్పవాడు.

**బళి, బళిర, బళిరా, బళిరే, బళీ:** పొగడేమాట.

**బవరం:** యుద్ధం (< ప్రా. పహార, సం. ప్రహార–).

**బవరి, బవిరి:** గుండ్రనిది (< ప్రా. భమర–, సం. భ్రమర–).

**బస:** విడిది, నివాసం (< ప్రా. బస–, సం. వస–, వాస–).

**బస్తా:** గోనెసంచి; ఒక కొలత.

**బస్తీ:** పట్టణం (< ఉర్దూ, బస్తీ సం. వసతి–).

**బహిష్కారం:** వెలివేయడం.

**బహుమతి, బహుమానం:** గొప్పగౌరవం, కానుక.

**బహువచనం:** రెండు అంతకంటెవస్తువులనుతెలిపేది.

**బహూకరించు:** సన్మానించు; బహుమతి ఇచ్చు.

**బాకా:** ఊదేవాద్య విశేషం.

**బాకీ:** అప్పు.

**బాకు:** కత్తి.

**బాగాలు:** వక్కలు, పోక చెక్కలు.

**బాజు:** వరుస.

**బాజుబందు:** సందిట కట్టుకొనే భూషణం.

**బాట:** దారి; ప్రదేశం.

**బాటసారి:** దారిననడచేవాడు.

**బాడిగ, బాడుగ:** అద్దె, కిరాయి, జీతం. (< ప్రా. భాడగ–, సం. భాటక–).

**బాడిస:** కొయ్యలుచెక్కే పని ముట్టు.

**బాదువ:** పల్లపునేల.

**బాన:** పెద్దకుండ, పాత్ర (< ప్రా. భాణ–, సం. భాజన–).

**బానసం:** వంటసాల; వంట, (< ప్రా. మహాణసం, సం. మహానస–).


బహుమతి


బార

బాకా


బారు


బాట


బావి


బాడిస


బాన


బాసట

**బాపురే:** మెచ్చుకొనడం, ప్రశంసార్థకం.

**బాము:** పుట్టుక; కష్టం (< ప్రా. భవ–, సం. భవ–).

**బార[1]:** అడ్డంగా చాచిన రెండు చేతులతోడి రొమ్ము కొలత

**బార[2]:** పన్నెండు. (< ప్రా. బారహ–, సం. ద్వాదశ–).

**బారు:** వరుస; బంతి; గుంపు; పొడుగైనది బారులుదీరు: వరుసగా ఏర్పడు.

**బారువ, బారువు:** ఇరవైమణుగుల తూకం.

**బాలకుడు:** పదారేళ్ళలోపు వయస్సుగల అబ్బాయి.

**బాలిక:** చిన్నవయస్సుగలది; ఆడపిల్ల.

**బావి:** మెట్లనూయి; చెరువు (< ప్రా. వావి, సం. వాపీ).

**బాస:** మాట; శపథం, ఒట్టు; ఒడంబడిక, వ్రతం (< ప్రా. భాసా, సం. భాషా).

**బాసట:** తోడు, సహాయం (< ప్రా. పాసట్ఠ, సం. పార్శ్వస్థ–).

బాహత్తరి: డెబ్బైరెండు (< ప్రా. బాహత్తరి, సం, ద్విసప్తతి).

బాహోటం: బయట పడినది; బహిరంగం.

బింకం: గర్వం, బిగువు, పట్టుదల.

బింగీలు: గుంజిళ్ళు.

బిందువు: చుక్క, బొట్టు, సున్న. అర్ధబిందువు: అరసున్న. పూర్ణబిందువు: నిండుసున్న.

బిందె: సన్నటిమూతిగల లోహపాత్ర.

బికారి: దరిద్రుడు; భిక్షుకుడు; అసమర్థుడు (< ప్రా. భిక్ఖారి, సం. భిక్షాకారి–).

బిచ్చం: తిరిపెం, భిక్ష. (< ప్రా. బిచ్చా, సం. భిక్షా) బిచ్చగత్తె, బిచ్చగాడు, బిచ్చమెత్తు.

బిడారం, బిడారు: నివాసం, వీడిది వర్తకుల గుంపు..

.యం: సిగ్గు, (< ప్రా. వీడా, సం. వ్రీడా).

బిస: మీటు, యంత్రపుకీలు.

బీగం: తాళం..

బీగపుచెవి: తాళపుచెవి.


బీట


బింగీలు


బిందె


బిచ్చం


బుడుత


బీగం


బీగపుచెవి

బీట: పగులు. బీటలుతియు, బీటలుపోవు: పగులు, బద్ద లగు.

బీటిక: బీట, పగులు.

బీడు: దున్ననినేల, బంజరునేల.

బీతు: భయం (< సం. భీతః).

బీతుగొను: భయపడు.

బుంగ: చిన్నమూతిగలకుండ.

బుగ్గ[1]: చెక్కిలి, చెక్కిలి లోపలి భాగం.

బుగ్గ[2]: ఎల్లప్పుడు నీరుపైకి ఉబికేచోటు; నీటిబుడగ.

బుజ్జగ(వ)ము: ఉపలాలనం, బుజ్జగించు.

బుడతకాళీలు: బుడతకాల్ (పోర్చుగీసు) దేశంనుంచి దిగుమతైనబట్టలు.

బుడుగు: పొట్టి.

బుడుత: చిన్న, లేత; బాలిక; బాలుడు. బుడుతడు: పిన్నవాడు.

బువ్వ, బువ్వం: అన్నం, భోజనం; సహభోజనం. బువ్వంబంతి: పెళ్ళివారు కలిసి భోజనంచేయడం. (< ప్రా. భోవ-, సం. భోగ-)

**బూటకం:** మోసం; అబద్ధపు మాట.

**బూమె:** మోసం, వంచన; మాయమాట, అబద్ధం; మారువేషం (< ప్రా. భూమియా, సం. భూమికా).

**బెట్టిదం:** తెగువ; గర్వం; క్రూరం; పరుషవచనం. బెట్టిదుడు: క్రూరుడు; శూరుడు. బెట్టిదురాలు: కఠినురాలు.

**బెట్టు:** బింకం; అతిశయం; గర్వం.

**బెడద:** కష్టం; చిక్కు; గొడవ; నింద.

**బెల్లి:** మోసం. బెల్లించు: మోసపుచ్చు;. ముఖస్తుతిచేయు. బెల్లింపు: ఉబ్బించడం; అతిగా పొగడడం.

**బేడలు:** పొట్టుతీసిన కాయ ధాన్యాలపప్పు. కందిబేడలు, సెనగబేలు మొ.వి.

**బేడా:** గర్భాలయం చుట్టూ ఉండేమండపం.

**బేడిగె:** పన్ను.

**బేరం:** కొనుగోలు అమ్మకాలకు సంబంధించినది; వాణిజ్యం. బేరమాడు, బేరసారం. బేరి: వర్తకుడు- చూ. బేహారం.


బేహారం


బొంది


బొక్కెన


బొత్తి


బొమ్మ

**బేసి:** సరిసంఖ్య కానిది. 1,3,5 మొ.వి. (< ప్రా. విసమ-, సం. విషమ-).

**బేహారం:** క్రయ విక్రయ వ్యాపారం. (<ప్రా. వవహార-, సం. వ్యవహార-.)

**బొంకు:** అబద్ధమాడు; అబద్ధం; తప్పు.

**బొంది:** శరీరం.

**బొందు:** దారం; గింజపట్టని పైరు.

**బొక్కణం:** బొక్కెన, బకెట్; విభూతి పోసుకునే సంచి; జోలె; తాంబూలపుతిత్తి.

**బొక్కసం:** ఖజానా, కోశాగారం; పెట్టె; మూట.

**బొక్కెన:** నీళ్ళుతోడే సాధనం; గుర్రంనోటికి తగిలించే దాణా సంచి.

**బొట్టె:** కొడుకు; కూతురు.

**బొత్తి:** దొంతి, దొంతర.

**బొప్పి:** దెబ్బతగలడంవల్ల కలిగే బుడిపి.

**బొబ్బరలు:** అలసందలు.

**బొమ్మ[1]:** చిత్రం; ఆటబొమ్మ.

**బొమ్మ[2]:** బ్రహ్మ. (<ప్రా. బంభ-, సం. బ్రహ్మన్).
**బొమ్మ[3]:** కనుబొమ్మ, బొమముడి (< ప్రా. భుముఅ-, సం. భ్రూః).
**బొమ్మరం:** బొంగరం (<ప్రా. భమ్మర-, సం. భ్రమరక-).
**బొరియ:** కన్నం, కలుగు; గొయ్యి; పుట్ట.
**బొరుగులు, బోరులు:** మరమరాలు.
**బోకి:** ముక్కలైన మట్టిపాత్ర; జలగడుగు దోనె.
**బోగం:** సౌఖ్యం; వెల (< ప్రా. భోగ-, సం. భోగ-).
**బోద:** పక్షి మొదలైనవాటివల్లి బోదడు: బాలుడు. (<సం. పోతః).
**బోదె:** స్తంభంమీది భాగం; చెట్టు బోదె.
**బోనం:** అన్నం, ఆహారపదార్థం; దేవతలకు పెట్టేనైవేద్యం. (< ప్రా. భోణం, సం. భోజన-), బోనకత్తె: వంటలక్క. బోనపుట్టిక: అన్నముంచే గంప.
**బోను:** పెంపుడు జంతువులు ఉండడానికి చుట్టు కమ్మెల మర్చి చేసినపెట్టె; క్రూర మృగాలను పట్టిబంధించడానికి వాడే కపట యంత్రం.


బొమ్మరం


బొరియ


బ్రహ్మముడి


బ్రహ్మర్షి


బోను

**బోర:** రొమ్ము; కడుపు.
**బోరెం:** దూది మొ.వాటి మూట.
**బోసి:** నోటిలోపళ్ళు లేనిది; అలంకారం లేనిది. బోసి నోరు, బోసిమెడ మొ.వి.
**బ్రదిమి, బ్రదుకు:** జీవనోపాయం; జీవితకాలం. బ్రతుకు: జీవించడం; జీవించు; బ్రదుకుతెరువు: జీవనంచేసే మార్గం, వృత్తి.
**బ్రహ్మముడి:** పెళ్ళి సమయంలో వధూవరుల వస్త్రాల కొంగులను చేర్చి పురోహితుడు వేసేముడి.
**బ్రహ్మరథం:** బ్రాహ్మణులు మోసే పల్లకి, రథం మొ.వి. బ్రహ్మరథంపట్టు: గొప్పగా గౌరవించు.
**బ్రహ్మర్షి:** బ్రహ్మతత్త్వం తెలిసిన ఋషి.
**బ్రహ్మలిపి:** బ్రహ్మరాత, ఎవరికీ తెలియని లిపి.
**బ్రహ్మస్వం:** బ్రాహ్మణుల భాగం.
**బ్రహ్మాస్త్రం:** గొప్పశక్తిగల బాణం. తిరుగులేనిది.

# భ

**భంగం:** అవమానం; చీలిక, కోత; భ్రష్టత. ఓడిపోవడం. భంగపడు: అవమానం పొందు. భంగపరుచు: అవమానించు.

**భగీరథుడు:** స్వర్గంనుంచి గంగా నదిని భూమికి తెచ్చిన ఒక రాజు. భగీరథప్రయత్నం: గొప్ప ప్రయత్నం.

**భజనం:** పూజ, ఆరాధన; చుట్టూచేరి ఎక్కువగా పొగడడం.

**భరతంపట్టు:** అంతుతేల్చు.

**భవనం:** ఇల్లు; పుట్టుక.

**భాండాగారం:** సరకులు నిలువ చేసే గది.

**భిన్నత్వం:** వేర్వేరు లక్షణాలు అలవాట్లు కలిగి ఉండడం. భిన్నత్వంలో ఏకత్వం మన ప్రత్యేకత.

**భీతి:** భయం. దైవభీతి; పాపభీతి.

**భూతం:** పిశాచం; గడచినకాలం.

**భూమిక:** మారువేషం; వేషం.

**భూషణం:** నగ, అలంకారం; పొగడ్త.



భేకం



భజనం

భ్రమణం



భ్రమరం





భూషణం

**భృగుపాతం:** కొండమీదినుంచి దూకి ప్రాణాలర్పించడం, ఒక రకం మొక్కుబడి.

**భృత్యుడు:** పోషించదగినవాడు; సేవకుడు.

**భేకం:** కప్ప.

**భేదనం:** చీల్చడం; విడదీయడం; విరోధం పుట్టించడం, కలతలు కలిగించడం.

**భేదం:** తేడా, తారతమ్యం; మార్పు; నాల్గు ఉపాయాలలో మూడవది, శత్రు పక్షం వారిలో పరస్పర విరోధం పెట్టడం.

**భేషజం:** ఆరోగ్యకరం; రోగాలు పోగొట్టేది, మందు; అహంకారం.

**భ్రమ:** కోరిక; గుండ్రంగా తిరగడం.

**భ్రమణం:** తిరగడం; కదలిక; వణకు.

**భ్రమరం:** తుమ్మెద.

**భ్రాంతి:** పొరపాటు; తప్పు అభిప్రాయం; కోరిక.

**భ్రాత:** సోదరుడు.

# మ

మంకు: మొండితనం, మూర్ఖత్వం; అవివేకి.
మంగలం[1]: వేపుడుపెనం.
మంగలం[2]: క్షేమం; శుభం; శుభ సమయం.
మంగళసూత్రం: తాళిబొట్టు.
మంగళహారతి: శుభకరమైన ఆరతి.
మంచె: పొలాలలో కట్టిన ఎత్తైన చప్పరం (< ప్రా. మంచియా, సం. మంచః).
మంజస, మందసం: చిన్నపెట్టె (< ప్రా. మంజుసా, మంజూసా, సం. మంజూషా).
మంట: అగ్నిజ్వాల; కోపం; కాలడంవల్లకలిగేనొప్పి.
మంటగలియు: చెడిపోవు.
మంటమారి: కోపస్వభావం కల వ్యక్తి.
మంటినూనె: మంటినుంచి తీసిన చమురు, కిరసనాయిలు.


మండ


మండీ


మంచె


మంద


మందడి

మండ[1]: చిన్నకొమ్మ.
మండ[2]: చీలమండ; మనికట్టు.
మండలం: దేశ విభాగం; 40 రోజుల కాలం; గుంపు; సూర్యచంద్రుల బింబం.
మండలికుడు: చిన్న దేశభాగానికి పాలకుడు.
మండీ: దుకాణం; బజారు.
మంతనం: రహస్య ఆలోచన; ఏకాంతం (< ప్రా. మంతణ- సం. మంత్రణమ్).
మంతరం, మంత్రం: కాన్పునకు సంబంధించిన జ్ఞానం.
మంతరసాని, మంత్రసాని: సుఖంగా కాన్పుజరిపే ఉపాయం తెలిసిన స్త్రీ.
మంతి: ప్రసంగం; ప్రస్తావన. మాటామంతీ.
మంతిరి, మంతు: మంత్రి, ఆలోచన చెప్పేవాడు. (< సం. మంత్రీ).
మంద: ఆవులు మొ. వాటి గుంపు.
మందపట్టు: పశువులు వుండే చోటు.
మందడి: గుర్రం; గుర్రపుసాల (< ప్రా. మందురా, సం. మందురా).

మందబుద్ధి: తెలివితక్కువవ్యక్తి.
మందం: బలుపు; దళసరి; లావైనది.
మందల[1]: జీవనం; ప్రాణం.
మందల[2]: మేర, హద్దు; సమీపం; దారి; రీతి, విధం.
మందలవిడుచు: ప్రాణంతో విడిచిపెట్టు.
మందలించు: చీవాట్లుపెట్టు, హెచ్చరించు; నిర్ధారణచేసి చెప్పు; ఆజ్ఞాపించు.
మందలింపు: చీవాట్లుపెట్టడం.
మందసం: పెద్దపెట్టె (< ప్రా. మంజుసా, మంజూసా, సం. మంజూషా).
మంపు: మత్తు; మిడిసిపాటు.
మకరం: మొసలి, 12 రాసులలో ఒకటి.
మకుటం: కిరీటం; శతకపద్యాలలో చివరవచ్చే పదం –భాస్కరా, సుమతీ మొ.వి.
మక్కా, మక్ఖా: అరేబియాదేశంలోని ఒక పట్టణం; పైగంబర్ మొహమ్మద్ జన్మస్థానం; ముస్లింల పవిత్ర యాత్రాక్షేత్రం.


మక్కి


మందం


మక్కె


మందసం


మకరం


మకుటం


మక్కా

మక్కి: ఈగ (< ప్రా. మక్ఖి–, సం. మక్షికా).
మక్కికిమక్కిగా: ఉన్నదున్నట్లుగా.
మక్కు: చచ్చు; రూపుచెడు; కృశించు.
మక్కించు: చంపు; చెరుచు; గెల్చు.
మక్కువ: ప్రేమ; మైత్రి; వాత్సల్యం.
మక్కె: ఎముక. ఘక్కెలు విరుచు.
మచ్చరం: ఈర్ష్య; పగ; పట్టుదల; పోటీ (< ప్రా. మచ్ఛర–, సం. మత్సరః).
మచ్చరించు: పోటీచేయు; ద్వేషించు.
మచ్చిక: ప్రేమ; చనవు; స్నేహం.
మచ్చు[1]: మిద్దె; డాబా.
మచ్చు[2]: ఆకర్షించు; మచ్చుమందు.
మచ్చు[3]: ఒరగల్లు, బంగారు వన్నె పరీక్షించడంలో ఉపయోగించే గీటురాయి; ఉదాహరణ.

మచ్చెం: చేప (< ప్రా. మచ్ఛ–, సం. మత్స్య–).


మచ్చెం

మజిలీ: విడిది; దూరప్రయాణంలో ఆగేచోటు.

మజ్జనం: స్నానం; మునగడం (<ప్రా. మజ్జణం, సం. మార్జనం).


మజ్జనం

మట్ట: ఆవులు మొ. వాటితోక; తాటి చెట్టు మొ. వాటి కమ్మ.


మట్ట

మట్టు: తొక్కు; అణగదొక్కు; బాధించు; పడవేయు; ప్రదేశం; మేర.


మత్కుణం

మడక: నాగలి.


మడక

మడమ: చీలమండ కింది భాగం.


మడమ

మడవ: పాదులకు నీరు పారే కాలువ.

మడి: మాగాణి పొలంలోని కయ్య; పొలం; మడి వస్త్రం; మడిమాన్యాలు.


మద్దెల

మడినంచి: మడి బట్టలుంచుకునే నంచి.

మడుగు[1]: అణగు; వంగు.

మడుగు[2]: తెల్లటిబట్ట; పరిశుభ్రత.

మడుగు[3]: కొలను; సరస్సు.


మడుగు

మడుగు[4]: రెట్టి. కోటిమడుగులు: కోటిరెట్లు.

మతం: అభిప్రాయం; నమ్మినది; ఉపాయం; జ్ఞానం; దేవునిపై నమ్మకం

మతి: బుద్ధి; కోరిక.

మతిభ్రమ: పొరపాటు.

మతిమంతుడు: తెలివిగలవాడు.

మత్కుణం: నల్లి.

మత్స్యం: చేప.

మథనం: కవ్వంతో చిలకడం.

మదం: గర్వం; మత్తు.

మది: బుద్ధి; మనస్సు (< ప్రా. మది–, సం. మతిః).

మదింపు: అంచనా, ఇంత అని వెల మొ. వాటిని ఊహించడం.

మదుపు: పెట్టుబడి.

మద్దతు: తోడ్పాటు.

మద్దెల: మృదంగం (< ప్రా. మద్దల, మద్దలా, సం. మర్దలం).

మద్యం: కల్లు; సారాయి.

మధురం: తీయనిది; ఇంపైనది.

మధువు: తేనె; పంచదార; కల్లు; తీపి.

మధ్య: నడుమ.
మధ్యం: నడిమిది; మధ్యభాగం.
మనవి: విజ్ఞప్తి.
మనువు: జీవనం; నడత; వివాహ సంబంధం
మనోహరం: అందమైనది; ఇంపైనది.
మన్నన: గౌరవం; నియమం; ఆదరం.
మన్నించు: ఆదరించు; గౌరవించు, క్షమించు (< ప్రా. మణ్ణణం, సం. మాన్య–).
మన్నిక: ఎక్కువకాలం ఉండడం.
మప్పు: మరపు; అలవాటు చేయు.
మబ్బు: మేఘం; చీకటి; తెలివి లేనితనం.
మభ్యపెట్టు: మోసంచేయు; తెలివిగా తప్పించు.
మమత: ప్రేమ; మమకారం.
మయూరం: నెమలి.
మర: కీలు; తిరుగుడుచీల; యంత్రం.
మరమేకు: తిరుగుడుచీల, స్క్రూ. మరగు: అలవాటు పడు; మచ్చికపడు; లొంగిపోవు; కోరుకొను.


మధ్యం


మరుగుజ్జు


మల


మబ్బు


మయూరం


మశకం


మరమేకు

మరలు: వెనుకకు తిరుగు.
మరియాద: మర్యాద; నియమం; సంప్రదాయం; కట్టుబాటు (< సం. మర్యాదా).
మరుగుజ్జు: పొట్టివ్యక్తి; గూను గలవ్యక్తి.
మరుడు: మన్మథుడు (< ప్రా. మార–, సం. మారః, స్మరః).
మరులు: ప్రేమ; పిచ్చి; అజ్ఞానం.
మర్యాద: హద్దు; నీతి; న్యాయ మార్గం; గౌరవం.
మల: కొండ; అడవి. ఎర్రమల, తిరుమల.
మలచు: విగ్రహాలను చెక్కు; దిద్దు; తయారుచేయు.
మల్లగుల్లాలు: వాదులాడడం.
మలిగ, మలిగె: అంగడి.
మశకం: దోమ.
మసక: కొద్ది నలుపు; మునిచీకటి. మసకవెలుతురు.
మసనం: శ్మశానం (< ప్రా. మసాణం, సం. శ్మశానమ్).
మసలు: ఆలస్యంచేయు; వెనుకకు తిరుగు.

**మసాలా:** తాళింపుసామాను. మసాలాగారె.

**మసీదు:** ముస్లింల ప్రార్థనా మందిరం.


మసీదు

**మసూచి:** స్ఫోటకం; అమ్మవారి జబ్బు.


మసూచి

**మస్తు, మసటు:** మురికి.

**మస్తు:** సమృద్ధి; మత్తు.

**మహత్తు, మహత్వం:** గొప్పది; పవిత్రమైనది; బలం.

**మహనీయుడు:** గొప్పవాడు.

**మహలు:** మేడ (< ఉర్దూ. మహల్).

**మహాత్ముడు:** గొప్పకీర్తి కలవాడు; ఘనత చెందిన వాడు; పుణ్యాత్ముడు. గాంధీ మహాత్ముడు.

**మహాభాగుడు:** గొప్ప భాగ్యశాలి; చాలపవిత్రమైనవాడు; కీర్తిమంతుడు.

**మహావీరుడు:** జైనమత స్థాపకుడు; గొప్ప శూరుడు.

**మహి:** భూమి.

**మహిళ:** స్త్రీ.

**మహిషం:** దున్నపోతు.

**మహిషి:** ఎనుం, గేదె, బర్రె.

**మహీధరం:** కొండ.


మాగాణి


మహాత్ముడు


మహిషం
మహిషి

**మహీపతి:** రాజు.

**మాగాణం:** రాజ్యం; దేశం.

**మాగాణి:** నీటి ఆధారంతో పండే పొలం; పల్లపు భూమి.

**మాతరపితలు, మాతాపితలు:** తల్లిదండ్రులు.

**మాతామహి:** తల్లి తల్లి, అమ్మమ్మ.

**మాతామహుడు:** తల్లితండ్రి.

**మాతృభాష:** తల్లిభాష.

**మాదిరి:** సమానం; పోలిక; పద్ధతి. (< సం. మాతృకా).

**మాదిరిసేయు:** పోల్చు.

**మానవుడు:** మనుష్యుడు.

**మానవి:** స్త్రీ.

**మానవం:** మనుష్యులకు సంబంధించినది.

**మానవత, మానవత్వం:** సాటి మనుష్యులను ఆదరించడం.

**మానికం:** మాణిక్యం (< ప్రా. మాణిక్యం, సం. మాణిక్య-).

**మానికె:** ఒక కొలత. (< ప్రా. మాణీ, సం. మానికా).

**మానిసి:** మనిషి (< ప్రా. మాణుస-, సం. మానుష-).

**మాన్యం:** పన్ను లేకుండ కవులకు, పండితులకు పూజ్యులకు రాజులు మొ. వారు ఇచ్చిన భూమి.
**మారాం:** పెంకెపట్టు.
**మారాంచేయు:** ఏదైనా కావాలని చిన్నపిల్లలు పట్టు పట్టు.
**మార్గం:** దారి; ఉపాయం; పద్ధతి.
**మార్గదర్శకం:** దారిచూపించేది; ఆదర్శం.
**మార్జాలం:** పిల్లి.
**మార్దవం:** నెమ్మది; మెత్తదనం.
**మార్బలం:** శత్రుసైన్యం.
**మాల:** దండ; వరుస.
**మాలకరి:** పువ్వుదండలు కట్టే వ్యక్తి.
**మాలిమి[1]:** చనవు, ఎక్కువ పరిచయం; వాత్సల్యం.
**మాలిమి[2]:** ఓడనడపేవాడు.
**మాలిగ:** మేడ; మిద్దెటిల్లు.
**మావటీడు, మావతుడు:** ఏనుగును నడపేవాడు (< ప్రా. మహామత–, సం. మహామాత్ర–).
**మావి, మావిడి:** మామిడిచెట్టు.


మాసం


మారాంచేయు




మార్జాలం


మాల


మావటీడు


మామిడి

**మాసం[1]:** ఒక కొలత, రెండు వ్వరచిన్నాలయెత్తు(< ప్రా. మాస–, సం. మాషః).
**మాసం[2]:** నెల; చంద్రుడు.
**మించు:** ప్రకాశించు; పెరుగు; జయించు; మెరపు; కిరణం.
**మిడిమేలం:** గర్వం.
**మిడిసిపడు:** పైకిఎగురు; గర్వించు.
**మిడిసిపాటు:** గర్వం.
**మిడుత:** శలభం, పంటలుపాడు చేసే పురుగు. మిడుతల దండు.
మిడుత
**మిణుగురుపురుగు:** చీకటిలో తళతళమెరిసే పురుగు.
**మితం:** పరిమితిగలది.
**మితి:** గడువు; హద్దు; కొలత; మితిమీరిన ఖర్చు.
**మిత్తి:** మృత్యుదేవత; చావు (< సం. మృత్యు).
**మిత్రుడు:** స్నేహితుడు.
**మిత్రభేదం:** స్నేహాన్ని చెడగొట్టడం.
**మిత్రలాభం:** స్నేహితులను సంపాదించుకోవడం; మిత్రులవల్లకలిగే మేలు.
**మిన్న, మిన్నా:** మంచిది; ఎక్కువ.

**మిన్ను:** ఆకాశం. కన్నూ మిన్నూ కనిపించదు: కిందా మీదా కనపడదు.

**మిన్నేరు:** ఆకాశగంగ.

**మిరాసి:** వంశపరంపరగా వచ్చే హక్కు (< ఉర్దూ. మీరాస్) మిరాసిదారు

**మిరియం:** మిరియపుగింజ (< ప్రా. మిరిఅం, సం. మరీచమ్).

**మిసిమి:** కాంతి; వెన్న; సంపద; నున్ననిది.

**మిసుకు:** కదలు; భయపడు.

**మీనం, మీను:** చేప.

**ముంగిలి:** వాకిటికి ఎదురుగా ఉండే ప్రదేశం; అంగణం; ముంగిటి నిధానం: ఎదుట నున్న సంపద; ముంగిటి ముత్యం: ఎదుటనున్న ముత్యంవంటిది.

**ముంజి:** దర్భల మొలతాడు.

**ముంజె:** లేత తాటికాయలోని గిజురు. తాటిముంజెలు.

**ముందంజ:** ముందడుగు.

**ముక్కిడి:** ముక్కులేని వ్యక్తి.

**ముక్తాయింపు:** ముగింపు.

**ముఖాముఖి:** సమక్షంలో.


మిన్ను


ముచ్చిక





ముంగిలి


ముదం

**ముచ్చ:** స్పృహలేకుండడం; తెలివి తప్పడం; ముచ్చముడుగు; చేష్టలు లేకుండు (< ప్రా. ముచ్ఛా, సం. మూర్ఛా).

**ముచ్చట:** కోరిక; ప్రేమ; వార్త; కులాసాగా చెప్పుకునే మాట; వేడుక; అచ్చట ముచ్చట.

**ముచ్చిక:** టెంకాయ మొ.వాటి తొడిమ కింది బిళ్ళ.

**ముచ్చిలికా:** ఒడంబడికపత్రం.

**ముఠా:** కొన్ని పల్లెల గుంపు; గుంపు; (< ఉర్దూ. ముఠా).

**ముడుపు:** డబ్బు; డబ్బు మూట; దేవతలకైముడుపు గట్టిన సొమ్ము.

**ముత్తెం, ముత్తియం, ముత్యం:** ముత్యం (< ప్రా. ముత్తియం, సం. మౌక్తికమ్).

**ముదం:** సంతోషం.

**ముదల:** ఆజ్ఞ; లక్ష్యం. ముదలించు; ఆజ్ఞాపించు; ఎదిరించు; ప్రశ్నించు.

**ముది, ముదిమి:** ముసలితనం. ముదియు; ముసలితనం పొందు; సడలిపోవు.

**ముద్రణం:** అచ్చుపని; ముద్రించిన ప్రతి; **ముద్రణాలయం:** అచ్చువేసే చోటు; **ముద్రాక్షరం:** ముద్రవేసిన అక్షరం; **ముద్రారాక్షసం:** అచ్చు వేయడంలో దొర్లిన తప్పు.
**మునుం:** వరుస; ఎదురు; ఎదుటి భాగం.
**మున్నరక (మున్ను + అరక):** తొలిదుక్కి.
**మున్నీరు (మున్ను + నీరు):** మొదటి నీరు, సముద్రం.
**మున్ను:** పూర్వం; మొదలు.
**ముప్పిడి (మూడు+ పిడులు):** ఒక విధమైన బాకు.
**ముప్పిరి (మూడు+ పిరులు):** మూడుపిరులు గలది; ముప్పిరి; **ముప్పిరిగొను:** ఎక్కువగు.
**ముప్పు:** ముసలితనం; ఆపద; హాని.
**ముబ్బడి:** ముమ్మడి; మూడు రెట్లు; **ముమ్మడి:** మూడవ.
**ముమ్మరం:** అధికం; తీవ్రం; సాంద్రత.
**ముమ్మొన:** మూడు మొనలు కలది, **ముమ్మొనవాలు:** త్రిశూలం.


మురళి


మునుం


ముళ్ళపంది


ముసుగు


ముమ్మొన


ముస్తాబు

**ముమ్మోటు (మును + మోటు):** మూర్ఖులలో మొదటివాడు.
**మురళి:** పిల్లంగోవి.
**మురిపెం:** ముద్దు; సంతోషం; చక్కదనం.
**ముల్లియ, ముల్లె:** మూట; వెల, విలువ (< ప్రా. ముల్లియ, సం. మూల్యక).
**ముళ్ళపంది:** ఒళ్ళంతా ముళ్ళుండే అడవి పంది. ఏదు పంది.
**ముప్వన్నె:** మూడు వన్నెలు (రంగులు) గలది; ముప్వన్నెజెండా.
**ముష్కరుడు:** చెడ్డవాడు; దీనుడు; మూర్ఖుడు.
**ముష్టి:** పిడికిలి; పిడికెడు బియ్యం; బిచ్చం. **ముష్టివాడు:** బిచ్చగాడు.
**ముసుగు:** ఒంటిపై కప్పుకునే వస్త్రం; అడ్డు.
**ముసురు:** ఎడతెగని వాన.
**ముస్తాదు, ముస్తీదు:** తయారు కావడం, సంసిద్ధం (< ఉర్దూ. ముస్తఇద్).
**ముస్తాబు:** అలంకరణం.

**ముహూర్తం:** కొద్ది సమయం; 48 నిమిషాల కాలం; ఏదైనా వేడుకకు నిర్ణయించిన సమయం.

**మూక:** గుంపు; సైన్యం.

**మూర:** రెండుజేనల కొలత.

**మూర్ఖుడు:** తెలివిలేనివాడు; ఎవరు ఎన్నివిధాల చెప్పినా విననివాడు.

**మూర్ఛ:** తెలివి కోల్పోవడం.

**మూల[1]:** కొప్పు.

**మూల[2]:** విదిక్కు; రెండు దిక్కుల మధ్య గలది; కోణం; గొంది; చాలైన తావు.

**మూలం:** మొదటిది; ఆధారం; చెట్లవేరు; కింది భాగం; కారణం.

**మూలగ. మూలుగు:** ఎముకల [illegible]మ ఉండే మాంస[illegible]రం.

**మూల్యం:** వెల; పెట్టుబడి ధనం.

**మూషికం:** ఎలుక.

**మృగం:** నాల్గుకాళ్ల జంతువు; అడవి జంతువు.

**మృగతృష్ణ:** ఎండమావులు.

**మృగనాభి:** కస్తూరి.


మృదంగం


మెట్టు


మూల


మేకు


మేయు


మూషికం


మృగనాభి

**మృగ్యం:** వెదకదగినది; లేనిది.

**మృదంగం:** మద్దెల.

**మృదువు:** మెత్తనిది; మంచిది.

**మెండుగా:** ఎక్కువగా.

**మెక్కు:** ఎక్కువగా తిను.

**మెట్టపంట:** వర్షాధారంతో పండే పంట.

**మెట్టు:** తొక్కు; అణగదొక్కు; (అడుగు) పెట్టు; తిరుగు; ప్రవేశించు; సోపానం; పాద రక్ష. మెట్టిన ఇల్లు: అత్తవారిల్లు.

**మేకు:** ఇనుము మొ.వాటితో చేసిన చీల, ఏకు మేకైనది.

**మేదకుడు:** వెర్రిబాగులవాడు.

**మేధ:** తెలివి; బుద్ధి. మేధావంతుడు: గొప్ప తెలివిగలవాడు.

**మేను:** శరీరం; పుట్టుక; పక్క ; మేనుమరచు: పరవశమగు.

**మేయు:** పశువులు మొదలైనవి గడ్డిని భక్షించు. మేత: పశుపక్షుల ఆహారం.

**మేర:** హద్దు; దూరం; క్రమం; న్యాయం(< ప్రా. మేరా, సం. మర్యా), మేరమీరు: హద్దు దాటు.

**మేలం:** పరిహాసం. మేలమాడు: గేలిసేయు, పరిహసించు.

**మేలిమి:** శ్రేష్ఠత; ఆధిక్యం; ప్రేమ; మంచిబంగారం.

**మేలు:** గొప్పతనం; ఉపకారం; సుఖం; లాభం; శుభం; శ్రేయస్సు; అందం; సారం; మంచిది. మేలుబంతి: విద్యార్థులువరవడిదిద్దేఒజ్జబంతి, వరవడి.

**మేషం:** గొర్రె; మేషరాశి. మేషి: ఆడుగొర్రె.

**మైకం:** మత్తు.

**మైత్రి:** స్నేహం; దయ.

**మైదానం:** బయలు నేల. గంగా సింధు మైదానం.

**మైనం:** తేనెతీయగా మిగిలిన జిగురు (< ప్రా. మయణం, సం. మదనం), మైనపు జిడ్డు: మైనపు గుడ్డ. మైనపు వత్తి: మైనంతో చేసిన వత్తి.

**మైల:** మురికి; చీకటి; మురికి గుడ్డ. మైల సంత: చేపలు మొ. అమ్మే సంత.

**మైలారు:** శైవ సంప్రదాయంలోని ఒక స్థానిక దేవత. మైలారి: మైలారు దేవుని పూజించే వాడు.

**మొకం(గం):** ముఖం (<సం. ముఖమ్).


మొక్క


మేషం


మొగసాల


మొగిలు


మొదవు

**మొక్క¹:** మొలక; చిగురు; మొక్కా మోడూ

**మొక్క²:** మొద్దుబారిన మొన; మొనచెడినది. మొక్కపడు: చెడు. మొక్కపరచు: అవమానించు; చెరుచు. మొక్కపాటు: అవమానం; పరాభవం.

**మొక్కుబడి:** మొక్కు తీర్చుకోవడం. మొక్కుబడిగా: తప్పదన్నట్లుగా.

**మొగం:** నోరు; ముఖం; ముందు భాగం (< సం. ముఖమ్).

**మొగమోటం, మొగమోటమి:** సంకోచం (మొగము + ఓటమి).

**మొగసాల, మోసాల:** ఇంటి ముందు చావడి (< సం. ముఖశాలా).

**మొగిలు, మొగులు:** మేఘం. మొగిలుదారి: ఆకాశం.

**మొట్టు:** పిడికిలితో తలపై పొడుచు (< ప్రా. ముట్ఠి, సం. ముష్టిః).

**మొదవు:** ఆవు; పాడిఆవు.

**మొన:** సైన్యం; యుద్ధం; కొన; కత్తివాదర; ముందు భాగం. మొనగాడు: ముఖ్యుడు; శూరుడు; సేనాపతి.

మొప్పె: మూర్ఖుడు.
మొర, మొర్ర: ఆర్తధ్వని; రక్షించుమని ఏడుస్తూ కోరడం.
మొరకు, మోరకు: మూర్ఖుడు; క్రూరుడు; మోటుమనిషి.
మొసరు: పెరుగు.
మొహరం: షియా తెగ ముస్లింలు జరుపుకునే పది రోజుల పీర్ల పండుగ.
మొహరీ: ఒక బంగారునాణెం (< ఉర్దూ. మొహర్).
మొహరు: ముద్ర (< ఉర్దూ- ముహర్).
మోకరించు: మోకాళ్ళు నేలకు ఆనేటట్టు ముందరికి వంగు.
మోట: కపిలె; ఎడ్లనుకట్టి నీళ్ళు తోడే సాధనం.
మోటు: చాటు ప్రదేశం; కరకైనది.
మోడ్చు: చేతులుజోడించు, మొక్కు; కళ్ళు మూసుకొను.
మోతాదు: ఒకసారి ఇచ్చేమందు; ఎచ్చుతగ్గులు కానిది(< ఉర్దూ. మోతాద్).


మోపు


మోము


మొహరి


మోసు


మోట


మోడ్చు


మోతాదు

మోపు: ఆనించు; లేనిది కల్పించు; గుచ్చు; మోయడం; గుంపు; కట్ట; మూట; బరువు.
మోము, మొగం: ముఖం (< ప్రా. ముహం, సం. ముఖ-).
మోస, మోసం: తప్పు; అసత్యం; అజ్ఞానం; పొరపాటు; అపాయం; వంచన (< ప్రా. మోసం, సం. మోష), మోసపుచ్చు: మోసగించు.
మోసు: మొలక.
మోహం: మూర్ఛ; అజ్ఞానం; వలపు.
మోహరం: యుద్ధం; సైన్యం; గుంపు (< ప్రా. మోహరం, సం. మౌఖరి), మోహరించు: ఎదిరించు.
మౌనం: మాట్లాడకుండడం.
మౌల్వీ: ముస్లిం పండితుడు.
మ్రాకు, మ్రాను: చెట్టు.
మ్రోల: ముందు; ఎదుట; సమీపం.

# య

**యంత్రం:** కొద్ది కాలంలో తక్కువ శ్రమతో పెద్ద పనులు చేయడానికి ఏర్పర చిన సాధనం, మర.

**యజనం:** యజ్ఞం.

**యజమానుడు:** ఇంటి పెద్ద.

**యతి:** సన్యాసి.

**యత్నం:** పూనిక; పట్టుదల. యత్నించు: పూనుకొను.

**యథాతథం:** నిజంగా జరిగి నట్లు; ఉన్నదున్నట్లు.

**యథార్థం:** సత్యమైనది; తగి నది; సరియైనది.

**యథావిధి:** తగినట్లు.

**యథాశక్తి:** శక్తికొలది.

**యథేచ్ఛగా:** కోరినట్లుగా, ఇష్టం వచ్చినట్లుగా. కావలసినం తగా.

**యథోచితం:** తగినట్లు.

**యవనిక:** తెర.

**యశం, యశస్సు:** కీర్తి. యశస్వి: కీర్తిగలది.

**యాచకుడు:** బిచ్చగాడు.

**యాతన:** తీవ్రమైన బాధ.


యాత్ర


యంత్రం


యజనం


యతి


యోధుడు

**యాత్ర:** ప్రయాణం; జాతర; గొప్ప ఉత్సవం; తీర్థ యాత్ర, దండయాత్ర, విహా రయాత్ర.

**యాత్రికులు:** తీర్థయాత్రలు చేసేవారు.

**యావచ్ఛక్తి:** శక్తికొలది.

**యావజ్జీవం:** బతికి ఉన్నంత కాలం.

**యుక్తం:** కూడుకొన్నది; సరి యైనది.

**యుక్తి:** ఉపాయం; పన్నుగడ.

**యువజనులు:** పదారు మొదలు ముప్ఫయ్యేండ్ల లోపు వయస్సు గలవారు.

**యోగక్షేమం:** సంపాదించడం దానిని భద్రపరచడం.

**యోగ్యత:** అర్హత. యోగ్యతా పత్రం: అర్హతలను ధ్రువీక రించే కాగితం. యోగ్యుడు: తగినవాడు; మంచి గుణాలు కలవాడు.

**యోజనం:** కలపడం; ఆమడ దూరం.

**యోధుడు:** వీరుడు. స్వాతం త్ర్యయోధులు: దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడినవారు.

**యౌవనం:** పడుచుదనం.

# ర

**రంకులరాటం:** గుండ్రంగా తిరిగే ఉయ్యాల( ప్రా. రంఖోలే+ రహట్ట-: గుండంగ్రా తిరిగే యంత్రం), దీనిని 'రంగుల రాటం' అని మార్చారు.

**రంకె:** ఎద్దు మొ.వి కావించే అరపు; కేక.

**రంధ్రాన్వేషి:** తప్పులు వెదకే వాడు.

**రంపు:** కలకలం; లేనిపోని గొడవ.

**రక్కసి, రక్కసుడు:** రాక్షసుడు (< ప్రా. రక్ఖస, సం. రాక్షస).

**రక్తం:** నెత్తురు. రక్తపాతం: నెత్తురు చిందడం; ప్రాణ హాని. రక్తప్రసరణం: శరీరంలో నెత్తురు ప్రవహించడం.

**రక్ష:** రక్షించడం; కావలి; తాయెత్తు; రక్షకుడు; రక్షించేవాడు; కావలివాడు.


రచ్చ


రంకులరాటం


రణం


రత్నం


రక్తం


రక్ష

**రచ్చ:** రాజమార్గం; స్థానం; ఊరి పెద్దలు కూర్చునేచోటు; కొలువు; సభ; కొట్లాట (< ప్రా. రచ్చా, సం. రథ్యా) రచ్చబండ: ఊరిలో పదిమంది పెద్దలు కూర్చుండే అరగు.

**రజతం:** వెండి.

**రట్టు:** నింద; అపకీర్తి; ఆపద; అల్లరి; చౌరవ. ఇంటిగుట్టు రోగం రట్టు.

**రడ్డి, రెడ్డి:** గ్రామాధికారి; ఒకతెగ వారి పట్టపుపేరు (< ప్రా. రడ్డి: గ్రామ ముఖ్యుడు).

**రణం:** యుద్ధం. రణ రంగం: యుద్ధభూమి.

**రతనం:** మణి, రత్నం (< సం. రత్నమ్).

**రత్నం:** విలువైన వస్తువు; శ్రేష్ఠమైనది. పుత్రరత్నం; స్త్రీరత్నం; నవరత్నాలు. రత్నగర్భ: గర్భంలో రత్నాలు కలది, భూమి. రత్నాకరం: రత్నాల గని; సముద్రం. శబ్ద రత్నాకరం: రత్నాల వంటి మాటలకు స్థానం.

**రథం:** తేరు. రథయాత్ర: రథోత్సవం: రథంపై ఉత్సవ విగ్రహాలను ఉంచి ఊరేగించడం.

**రభస:** అల్లరి; గోల; ఆలోచించకుండా పనిచేయడం.

**రమారమి:** దాదాపు; సుమారు.

**రవళి:** చప్పుడు; అందెల రవళి, మువ్వల రవళి.

**రవాణా:** సరకు-సామానులు ఒక చోటి నుంచి మరొకచోటికి పంపడం. రవాణా సాధనాలు, రవాణా సౌకర్యాలు.

**రవుతు, రౌతు:** గుర్రంపై స్వారి చేసే వ్యక్తి (< ప్రా. రావుత్త-, సం. రాజపుత్ర-).

**రవ్వ[1]:** వజ్రం.

**రవ్వ[2]:** నింద; చెడుపని.

**రవ్వ[3]:** గోధుమలు మొ.వాటి సన్నటి పొడి.

**రసీదు:** చెల్లు పత్రం (ఆంగ్లం: Receipt)

**రస్తా:** దారి.

**రహదారి:** రాజమార్గం.

**రాకాసి:** రాక్షసి; రాక్షసుడు; భయంకరం (< ప్రా. రక్ఖసీ, సం. రాక్షసీ).



















**రాచ:** రాజ సంబంధమైనది. రాచ కూతురు; రాచకొడుకు, రాచబిడ్డ, రాచవారు (< ప్రా. రాచ-, సం. రాజ-).

**రాజధాని:** ప్రధాననగరం; రాజ నివాసం.

**రాజనీతి:** రాజ్యపాలకులు తెలుసుకోవలసిన మెలకువ.

**రాజస్వం:** రాజసంబంధమైన ఆస్తి; సామంత రాజులు చెల్లించే కప్పం.

**రాజీవం:** జింక; ఏనుగు; ఒకానొక చేప; కమలం.

**రాజు:** ప్రభువు; కొన్ని తెగలవారి పట్టపు పేరు (< సం. రాజ-).

**రాట్నం:** నీరు తోడే యంత్రం; చెరకు గానుగ; నూలు వడికే సాధనం (< ప్రా. రహట్ట-, సం. అరఘట్ట-).

**రాణి:** భార్య; రాజుభార్య (< ప్రా. రాణీ, సం. రాజ్ఞీ). రాణివాసం: అంతఃపురం.

**రాణించు:** శోభించు; సంతసించు; ఇష్టపడు.

**రాణువ:** సైన్యం; రాజపరివారం (< ప్రా. రాణయ-, సం. రాజ్ఞ-).

**రాయడు:** నాయకుడు; రాజు (< ప్రా. రాయ-, సం. రాజ-).

**రాయబారం:** దూతచేసే పని (< ప్రా. రాయభార-, సం. రాజభారః), **రాయబారి:** రాయబారం నడపేవాడు, దూత.

**రాయలసీమ:** అనంతపురం, కడప, కర్నూలు మొ. జిల్లాలు కలిసిన పశ్చిమాంధ్ర ప్రాంతం.

**రాయసం**[1]**:** రాచఠీవి.

**రాయసం**[2]**:** రాజలేఖ; రాయసకాడు; లేఖకుండు.

**రావు:** రాజు; ఒక తెగవారి పట్టపు పేరు; ఒక ఉపనామం (< మరాఠీ: రావు, ప్రా. రావో, సం. రాజ).

**రాశి:** గుంపు; కుప్ప; మొత్తం; మేషం మొదలైనవి.

**రాష్ట్రం:** దేశభాగం. **రాష్ట్రపతి:** దేశాధ్యక్షుడు.

**రాసి:** కుప్ప; మొత్తం (< ప్రా. రాసి, సం. రాశిః).

**రింబ, రిమ్మ:** తిక్క, ఉన్మాదం. **రిమ్మతెగులు** (< సం. రిఫ్-).


రిక్క


రుమాలు


రాశి


రూక

**రిక్క:** నక్షత్రం. **రిక్కల దొర:** చంద్రుడు (< ప్రా. రిక్ఖ-, సం. ఋక్ష-).

**రిచ్చ:** విసుగు; ఏమీతోచని స్థితి. **రిచ్చపాటు:** చేష్టలు లేకుండడం; భయపడడం.

**రిత్త:** వట్టిది; శూన్యం; లేనిది; అబద్ధం; వ్యర్థం (< ప్రా. రిత్త-, సం. రిక్తః).

**రీతి:** విధం, పద్ధతి.

**రుగ్ణం:** రోగ పడినది. **రుగ్ణుడు:** జబ్బుగా ఉన్నవాడు, రోగి. **రుగ్ణత:** రోగం.

**రుద్రాక్షపిల్లి:** మోసగాడు.

**రుద్రాణి:** రుద్రుని భార్య; పార్వతి.

**రుమాలు:** తలగుడ్డ; జేబురుమాలు.

**రువ్వు**[1]**:** విసరు; వీచు; చల్లు.

**రువ్వు**[2]**:** వేదపఠనంలోని ఆవృత్తి; వల్లెవేయడం (< ప్రా. రూవ-, సం. రూప-).

**రుసుం:** చెల్లించవలసిన పైకం.

**రూక:** ఒకానొక నాణెం (< ప్రా. రుక్క-, సం. రుక్మ-).

**రూఢి:** ప్రసిద్ధి; సంప్రదాయం.

రూపు: ఆకారం; చక్కదనం; శరీరం; విధం (< సం. రూపమ్), రూపుమాపు: చంపు; నాశనంచేయు.

రెంటం: జమిలినేత.

రెట్టి: రెండురెట్లు. రెట్టించు: ఎక్కువచేయు, రెట్టింపు: రెండురెట్లు కావడం.

రెబ్బ, రెమ్మ: చెట్టు చిన్న కొమ్మ, ఉపశాఖ.

రేఖ: గీత; వరుస. రేఖాగణితం: క్షేత్రగణితం.

రేజీకటి: రాత్రిపూట చూపుసరిగాలేని కంటిజబ్బు.

రేడు: ఏలిక, రాజు.

రేతిరి, రాతిరి: రాత్రి.

రేవు: ఓడలు, పడవలు నిలిచే తావు; నదులు మొ. వాటిలో జనులు దిగడానికి వీలుగా ఏర్పరిచిన దారి; చాకిరేవు.

రైతు: సేద్యగాడు.

రొంప: రొమ్ముకు సంబంధించిన జబ్బు; పడిసెం.

రొంపి: బురద.

రొక్కం[1]: డబ్బు; నగదు.



















రొక్కం[2]: నిర్బంధం. రొక్కించు: నిర్బంధించు.

రొచ్చు: మురికి; తిరస్కారం; నింద; కుళ్ళిన గడ్డి మొ. వాటివల్ల ఏర్పడిన బురద.

రొడ్డ: ఎడమ. రొడ్డచేయి: ఎడమచేయి.

రొద: పిట్టలు మొదలైనవి చేసే ధ్వని; కలకలం (< సం. రుతమ్).

రొప్పు: ఆయాసంతో వగర్చు; అదలించు; బాధించు (< ప్రా. రుప్పణ-, సం. రోపణ-).

రో, రోయి: శుల్కం; తాకట్టు; చేబదులు; డబ్బు.

రోదసి: ఆకాశం; అంతరిక్షం. రోదసినౌక: రోదసిలో ప్రయాణం చేయడానికి అనువైన సాధనం.

రోషం: కోపం.

రోసం: కోపం (< ప్రా. రోస-, సం. రోష-) రోసగాడు: కోపదారి మనిషి, రోసించు: కోపపడు.

# ల

**లంక:** దీవి; తలవాకిలి పక్కగది. లంకపొగాకు: లంకలలో పైరయ్యే పొగాకు.

**లంకణం:** జ్వరం మొదలైనవాటి వల్ల చేసే ఉపవాసం (< ప్రా. లంఘణమ్, సం. లంఘన-).

**లంకించు[1]:** దొరకించుకొను; దొంగిలించు; తగులుకొను; ధరించు.

**లంకించు[2]:** అనుమానించు.

**లంకె:** రెండింటిని కూడగట్టిన కట్టు; సంబంధం; కూడిక. లంకెపలుపు: రెంటిని అంట గట్టేవాడు. లంకెపీట: పశువు లను పెనవేసే మానిపలక.

**లంగరు:** ఓడ నిలిచే దానికై దాని అడుగున దిగవేసే నాగలి వంటి ఇనుపసాధనం.

**లంఘించు:** దాటు.

**లంపటు:** శ్రమ; ఆపద. లంపటు పడు: శ్రమపడు.



లంబం


లకోరి


లంగరు


లంఘించు

**లంపు:** దొంగమేత. లంపుల మారి: దొంగమేత మేసే అల వాటు కలది.

**లంబం:** పొడవైనది; నిలువుగీత; అక్షాంశరేఖ. లంబరేఖ: ఒక సరళరేఖ మీద 90° కోణం చేసే నిలువుగీత.

**లంబిక:** కొండనాలుక.

**లకోరి:** బాణం.

**లక్క:** ఒకానొక చెట్టు బంక. లక్కపిడత, లక్కయిల్లు, లక్కబొమ్మ (< ప్రా. లక్ఖా, సం. లాక్షా).

**లక్ష:** నూరువేలు.

**లక్ష్యం:** గురి; గుర్తు.

**లగ్గ:** కోటను ముట్టడించి పైకి పాకడం; ముట్టడి. లగ్గలు పట్టు: వశపరుచుకొను.

**లగ్గు:** మేలు; క్షేమం.

**లగ్నం:** ముహూర్తం; కలసినది; స్థిరమైనది.

**లఘువు:** తేలిక; చులకనిది; వడి గలది; శీఘ్రం.

**లచ్చి:** లక్ష్మీదేవి; సంపద (< ప్రా. లచ్ఛీ, సం. లక్ష్మీ).

**లడాయి:** జగడం; యుద్ధం (< ఉర్దూ. లడాయీ).

**లజ్జ:** సిగ్గు (< సం. లజ్జా).
**లత:** తీగ; కొమ్మ. లతాంతం: పువ్వు.


లత

**లత్తుక:** లక్కరసం (< ప్రా. అలత్త-, సం. లక్తక-).
**లద్ది:** గుర్రం, ఏనుగు మొదలైన వాటి పెంట. లద్దిపురుగు: చివికిన కర్రలలో ఉండే తెల్లటి క్రిమి.


లద్ది

**లప్ప:** ముద్ద; చిన్నపాత్ర. చక్కెర లప్ప: పంచదార ముద్ద.
**లబ్ధం:** పొందబడినది, సంపాదించినది; భాగించగా గాని, హెచ్చవేయగా గాని వచ్చిన సంఖ్య.
**లబ్ధి:** లాభం: ఆదాయం.
**లబ్బె:** మహమ్మదీయులలో ఒక తెగ (< ఉర్దూ. లబ్బీ, అరబ్బీ).
**లలన:** స్త్రీ.
**లలాటం:** నొసలు; నుదురు.
**లలితం:** అందం; సొగసు; మంచిది; తేలికైనది, లలిత సంగీతం.
**లవణం:** ఉప్పు.
**లహరి:** అల. ఆనందలహరి: కరుణాలహరి.


లాగ


లాలి


లలాటం


లిపి

**లాగ:** బొరియ; కన్నం.
**లాఠీ:** (పోలీసుల చేతి) దుడ్డు గర్ర.
**లాడం:** గుర్రాలగొరిజలకుకొట్టే ఇనుప తగడుబిళ్ళ.
**లాతం, లాతాం:** సన్యాసులు చేత పట్టుకునే కర్ర.
**లాయం:** గుర్రాలను కట్టేసే చోటు; గుర్రాలశాల.
**లాలాజలం:** నోటిలో ఊరే ఉమ్మి నీరు.
**లాలస:** తీవ్రమైన కోరిక; ప్రార్థన; క్రీడ. లాలసం: తీవ్రమైన కోరికకలది, ఆసక్తికలది.
**లాలి:** ఉయ్యాల. లాలిపాట: ఉయ్యాలలో పిల్లలను ఉంచి నిద్రబుచ్చేటపుడు పాడే పాట.
**లాలించు:** బుజ్జగించు.
**లావు:** బలం; ధైర్యం; సాహసం; సామర్థ్యం; స్థూలం; పెద్ద.
**లాహిరీ:** మైకం, మత్తు; మత్తుకలిగించేది.
**లిఖించు:** వ్రాయు. లిఖితం: వ్రాసినది; పుస్తకం.
**లిపి:** వ్రాత; అక్షరాలు.
**లిబ్బి:** నిధి; డబ్బు; రాశి.

**లీనం:** కరగిపోయినది; కలసిపోయినది; ఆధారపడినది.

**లీల:** ఆట; వినోదం; సొగసు; విధం.

**లుబ్ధుడు:** పిసినారి, లోభి; వేటకాడు.

**లూటీ:** దోపిడీ; దవడపుండు.

**లెంక:** యోధుడు; పరిచారకుడు; తెలుగులెంక.

**లెప్పం:** సున్నం మొదలైన వాటితోచేసే పూత (< ప్రా. లేప్పం, సం. లేప్య-).

**లెస్స:** గొప్ప; మేలు; మంచిది; శ్రేష్ఠం. దేశ భాషలందు తెలుగు లెస్స.

**లేకి:** అప్రయోజకుడు. లేకి బ్రతుకు: పేదరికం.

**లేఖ:** జాబు, ఉత్తరం; గీత.

**లేడి:** జింక.

**లేబరం:** దీనం; శూన్యం; ప్రయోజనం లేనిది.

**లేమ:** స్త్రీ, (< ప్రా. లామా, సం. రామా).

**లేమి:** పేదరికం; లేకపోవడం. కలిమిలేములు కావడి కుండలు.


లొంప


లెంక


లేడి


లేఖ


లొట్టిపిట్ట

**లేవడి:** చిక్కిపోవడం; బీదతనం; కష్టం.

**లేహ్యం:** నాలుకతో నాకదగినది; పెదవులతో పీల్చదగినది.

**లొంప:** కొంప; చిన్న ఇల్లు.

**లొచ్చు:** తక్కువ. హెచ్చులొచ్చులు: ఎక్కువ తక్కువలు.

**లొటారం:** వట్టిది; సారం లేనిది; కన్నం; మట్టి యిల్లు (< ప్రా. లోట్టార-, సం. లోష్టాగార-), లోనలొటారం పైన పటారం.

**లొట్ట:** అణగిపోయినది; లొత్త; కన్నం (< ప్రా. లొట్ట-, సం. లోష్ట-), లొట్ట కన్ను: అణగిన కన్ను.

**లొట్టి:** కల్లుతీసే ముంత. లొట్టి ముచ్చు: ఎలుగుబంటి; తాగుబోతు.

**లొట్టిపిట్ట:** ఒంటె.

**లోకకంటకుడు:** లోకానికి నొప్పి కలిగించేవాడు; దుర్మార్గుడు.

**లోకబాంధవుడు:** సూర్యుడు; విష్ణువు; శివుడు.

**లోకమాన్యుడు:** ప్రజలచే గౌరవించబడినవాడు. లోకమాన్య బాలగంగాధర తిలక్.

**లోకోక్తి:** సామెత.

**లోగిలి:** ఇంటి లోపలిభాగం.

**లోగుట్టు:** రహస్యమైన ఆలోచన; రహస్యం. లోగుట్టు పెరుమాళ్ళ కెరుక.

**లోటు:** తక్కువ; నష్టం.

**లోపించు:** తక్కువ పడు; మరుగుపడు.

**లోయ:** రెండు కొండల మధ్య భాగం.


లోయ


లోకమాన్యుడు


లోహం.

**లోలకం:** కదలేది; వేలాడదీయబడిన లోహపుబిళ్ళ.

**లోవ:** లోయ.

**లోహం:** ఇనుం, బంగారం, రాగి, వెండి మొ.వి.

**లౌకికం:** లోకహితం; లోకాచారం. లౌకిక రాజ్యం: అన్ని మతాలను సమానంగా గౌరవించే రాజ్యం.

**లౌక్యం:** తెలివితేటలు, బతకనేర్చిన తెలివి.

# వ

వంక[1]: వంకర; వంపు; తప్పు; చెడ్డపని; చిన్నవాగు. వంకలు దిద్దు: ఆక్షేపించు; తప్పులు సరిచేయు. వంకలుదీర్చు: చక్కదిద్దు.

వంక[2]: పక్క; వైపు; దిక్కు; చోటు; కారణం.

వంక[3]: ఇబ్బంది; కష్టం.

వంకర: వంపు; అడ్డాదిడ్డిమాట. వంకరకొంకర: ఎక్కువ వంకరయైనది, వంకరటింకర: రకరకాలైన వంకరలు కలది.

వంకి: వంకర కత్తి.

వంకీ: స్త్రీలు సరిదిట ధరించే నగ.

వంగసం: వంశం; తెగ; జాతి (< ప్రా. వంసో, సం. వంశ-).

వంచ: పీటిమడుగు; దారువు.

వంచన: మోసం.

వంజ: గొడ్డుటావు; గొడ్రాలు. (< ప్రా. వంఝా, సం. వంధ్యా).


వందనం


వంశి


వంక


వంకి


వడ



వంత: చింత; బాధ; ఏడుపు.

వందనం: నమస్కారం.

వంశం: తరతరాల కుటుంబం; వెదురు.

వంశి: పిల్లంగోవి. వంశీధరుడు: పిల్లంగోవి ఊదేవాడు, కృష్ణుడు.

వకాలతు: న్యాయవాది; వకీలు పని.

వక్కణం, వక్కాణం: వివరణం; చెప్పడం (< ప్రా. వక్ఖాణ-, సం. వ్యాఖ్యాన-).

వక్త: చక్కగా మాట్లాడేవాడు; బోధకుడు.

వగపు: దుఃఖం; పగ; కీడు.

వజీరు, వజీరుడు, వజ్రీడు: మంత్రి, యోధుడు, సామంత రాజు (< ఉర్దూ. వజీర్).

వట్టం: తరుగు; నష్టం; తక్కువ (< ప్రా. వట్టం-, సం. వృత్త-).

వట్టు: ఇంకిపోవు; ఎండిపోవు; చిక్కిపోవు (పశువులు) పాలు లేనివగు.

వడ[1]: వేడిమి; తాపం; బడలిక; దప్పిక; వడగాడ్పు. వడగాలి: వేడిగాలి.

వడ[2]: గారె.



వడపోయు: నీరు మొ.వాటిని గుడ్డతో తేర్చు.



వడపోయి

వడి: వేగం.

వడియం: భోజనంలో నంజుకునే వరుగు (< ప్రా. వడియం, సం. వటకమ్).

వడుకు: దూదిని నూలుగా తీయు.



వడుకు

వడుగు, వడువు: బ్రహ్మచారి, ఉపనయనం(< ప్రా.వడుగ-; సం. వటుకః).

వడ్డీ: పెరుగుదల; నెలకు నూటికింత అని నిర్ణయించిన పెచ్చుధర (< ప్రా. వడ్డి-, సం. వృద్ధి), వడ్డికాసులవాడు: తిరుపతిలోని దేవుడు.

వడ్రంగి: కర్రపనిచేసే వ్యక్తి (< ప్రా. వడ్ఢగి, సం. వర్ధకి-).



వడ్రంగి

వత్తి: దీపంవత్తి(< ప్రా. వత్తి, సం. వర్తి).

వదాన్యుడు: గొప్ప దాత.

వదినె: అన్నభార్య; భార్య అక్క (< సం. వధూనీ).

వధువు: పెండ్లికొమార్తె.



వధువు

వనం: అడవి; చెట్లగుంపు; తోట. వనమహోత్సవం: చెట్లను నాటే కార్యక్రమం.

వన్నె[1]: రంగు; కాంతి; ప్రసిద్ధి; చక్కదనం (< ప్రా. వణ్ణిఆ, సం. వర్ణాక, వర్ణికా). వన్నెవాసి: పేరుప్రతిష్ఠలు, వన్నెతెచ్చు: కీర్తితెచ్చు.

వన్నె[2]: ఒకానొక కులం; తెగ (< ప్రా. వణ్హి-, సం.వహ్ని/వృష్ణి).

వన్నె[3]: అడవికి చెందినది, ఆటవికజాతి(< సం. వన్య-).

వన్నె[4]: గుర్రాల్ని ఎక్కడానికి రెండు పక్కలా అమర్చిన ఇనుపమెట్టు(< ప్రా.వహణ-, వణ్హి-, సం. వహి, వహ్నిః: మోసేది).

వన్యప్రాణులు: అడవిలో నివసించే పక్షులు, మృగాలు మొ.



వన్యప్రాణులు

వయోజనులు: వయస్సులో పెద్దవారు; వయస్సు వచ్చినవారు. వయోజనవిద్య.

వరవుడం: దాస్యం; సేవ.

వరహా: వరాహముద్రగల ఒక బంగారు నాణెం. అయ్యవారికిచాలు అయిదు వరహాలు.

**వరాహం:** పంది.

**వరివస్య:** పూజ; సేవ.

**వరుడు:** పెండ్లికొడుకు.

**వర్గం:** విభాగం (పేద-ధనిక వర్గాలు); వర్ణమాలలో హల్లుల విభాగం (క వర్గం; చ వర్గం మొ.వి); ఒక సంఖ్యను దానిచేతనే గుణించగా వచ్చే సంఖ్య.

**వర్జించు:** విడుచు.

**వర్ణమాల:** ఒక భాషలోని అక్షరాలు, Alphabet

**వర్ణం:** రంగు; జాతి; అక్షరం.

**వర్తకం:** వాణిజ్యం; కొనుగోలు అమ్మకాలు జరిపే వృత్తి.

**వర్తమానం:** జరుగుతున్న కాలం; వార్త.

**వర్తులం:** గుండ్రటిది.

**వర్ధమాన మహావీరుడు:** జైన మత స్థాపకుడు.

**వల:** కుడి. వలకన్ను: కుడికన్ను వలపలి: కుడివైపు.

**వలస:** ఉన్నప్రాంతం వదలి ఇంకో ప్రాంతానికిపోయి స్థిర పడడం.

**వలిపిరి:** వానజల్లు; నీటితుంపర.

**వలువ:** వస్త్రం.


వరాహం


వరుడు


వల్వం


వర్తులం


వర్ధమానమహావీరుడు


వసంతం

**వల్లభుడు:** గొప్పవాడు; రాజు. తెలుగు వల్లభుడు: శ్రీకాకుళ క్షేత్రంలోని దేవుడు, ఆంధ్రవల్లభుడు.

**వల్లించు:** నేర్చు; పఠించు. వల్లె వేయు: మరల మరల చదువు.

**వల్వం:** వస్త్రం.

**వళంద, ఒళాందా:** హాలండ్ దేశం Holland (Netherland)

**వశం:** లోబడినది; చెప్పినట్లు చేసేది; మచ్చికైనది; లోకువ; లోబడడం. వశవర్తి: లోబడినవాడు; సేవకుడు.

**వశీకరణం:** లోబరుచుకొనడం; ఆకర్షించే సాధనం.

**వస:** ఒకానొక ఔషధం. వసతాగిన పిట్ట, వసపిట్ట: తెగవాగుడు వ్యక్తి.

**వసంతం[1]:** చైత్ర—వైశాఖ మాసాల కాలం, వసంత రుతువు.

**వసంతం[2]:** పసుపు—సున్నం కలపగా ఏర్పడే ఎర్రటి నీరు. వసంతాలాడు: వసంతాన్ని ఒకరి మీద ఒకరు చల్లుకొను.

**వసది:** జైనుల – బౌద్ధుల ఆలయం, బసది (< సం. వసతిః).

**వసూలు:** జమ; పోగుచేయడం (< ఉర్దూ. వసూల్).

**వస్తాదు:** ఉపాధ్యాయుడు; జెట్టి; మల్లుడు (< ఉర్దూ. ఉస్తాద్).

**వాక్యం:** పూర్తి అర్థాన్ని ఇచ్చే మాటలకూర్పు.

**వాగ్దానం:** (ఒక పనిని) చేస్తానని మాట ఇవ్వడం.

**వాఙ్మయం:** సాహిత్యం, వాక్కులతో కూడినది.

**వాచకం:** నోటితో చెప్పేది; వివరించేది; పాఠ్యగ్రంథం.

**వాటం:** ఫీటవాలైనది; అనుకూలమైనది.

**వాడ:** వీధి; పేట; వరుస; ఇండ్ల వరుస (< ప్రా. వాడ, సం. వాట-).

**వాణి:** మాట; విద్య; సరస్వతీ దేవి.

**వాణిజ్యం:** వర్తకం; వ్యాపారం.

**వాతావరణం:** ఎండ–గాలి–వాన మొ.వాటికి సంబంధించినది.


వానరం


వస్తాదు


వామి


వాయసం


వాణి

**వాదు:** కలహం; నింద; అబద్ధం; వాదం. **వాదులాడు:** పోట్లాడు.

**వాదోడు:** మాటసాయం; చేదోడువాదోడు.

**వానరం:** కోతి.

**వామనం:** పొట్టిది; కురచయైనది; చిన్నది. **వామనుడు:** పొట్టివాడు.

**వామి:** గడ్డిమేటి.

**వాయనం:** పండుగ; పేరంటాలలో ముత్తైదవకిచ్చే కానుక. కొంగువాయనం, చేటవాయనం, మూసివాయనం (< ప్రా. వాయణం, సం. వాయనమ్).

**వాయవ్యం:** పడమరకు–ఉత్తరానికి మధ్యగల మూల.

**వాయసం:** కాకి.

**వాయి:** నోరు; కొన; కత్తివాదర. నోరూ వాయీ లేనివాడు.

**వాయిదం:** వాద్యం (< సం. వాద్యమ్).

**వాయువు:** గాలి.

**వారణాసి:** వారణ అసి అనే రెండు నదులు కలిసిన పుణ్యక్షేత్రం, కాశి.

**వారధి:** వంతెన.

**వారం:** ఆదివారం మొ. వారాలు; ఏడు రోజుల కాలం; తడవ, పర్యాయం.

**వారసత్వం:** తాతముత్తాతల నుంచి వరుసగా వచ్చేది, ఆస్తిహక్కు.

**వారసులు:** ఔరసులు; దాయాదులు; తర్వాతి హక్కుదారులు (< ఉర్దూ. వారిస్).

**వారిధి:** సముద్రం.

**వారువం:** గుర్రం; వాహనం (< ప్రా. వాడవా, సం. వాడవం).

**వార్త:** సమాచారం; ప్రసిద్ధి; నీతి. వార్తాపత్రిక: సమాచారం తెలిపేది. నీలివార్త: అబద్ధపు సమాచారం.

**వాలకం:** పద్ధతి; వేషం; మోసం, వాలకం నచ్చలేదు. వాలకాలు: వేషాలు, ఒక జానపద కళారూపం.

**వాలం:** తోక.

**వాల్మీకి:** శ్రీమద్రామాయణాన్ని సంస్కృత భాషలో రచించిన కవి, ఆదికవి.

**వాసం, వాస:** ఇంటికప్పునకు ఆధారంగా వేసే కర్ర, దూలం (< ప్రా. వంస-, సం. వంశ-).



వారం



వాసెన



వారువం



వాలం



విందు



వికలాంగులు

**వాసి:** గొప్పతనం; లాభం; అందం; కీర్తి; ప్రసిద్ధి; పరాక్రమం. వాసికెక్కు: ప్రసిద్ధి చెందు.

**వాసెన:** కుండ మొదలైనవాటి మూతికి కట్టే గుడ్డ; నొప్పి తగ్గడానికి తలకుకట్టే గుడ్డ (< ప్రా. వాసణం, సం. వాసనమ్).

**వాస్తవం:** నిజం.

**వాహిని:** నది; సైన్యం.

**వింగడం:** సుందరం; విశాలం. వింగడించు: వేరుపరచు; దూకు (< ప్రా. విఘడణం, సం. విఘటన-).

**వింజం:** వింధ్య పర్వతం. వింజమాకిడు, వింజంబాకిడు (వింజము + ఆక ఇడు = వింధ్యపర్వతం అడ్డు పెట్టు) (< ప్రా. వింఝ-, సం. వింధ్యః).

**విందు:** ఆతిథ్యం, పిండి వంటల తోడి భోజనం; బంధువు; సంతోషం. ప్రియములేని విందు పిండి వంటల చేటు.

**వికలాంగులు:** ఏదో ఒక అవయవ లోపం కలవారు.

వికాసం: పెరుగుదల; వికసించడం.
వికృతి: మార్పుచెందినది; మారినది- తెలుగుభాషలోని కొంతభాగం సంస్కృత భాషకు వికృతి.
విఖ్యాతి: కీర్తి.
విగ్రహం: బొమ్మ; కలహం; పోట్లాట.
విచారణ: సాక్ష్యాలతో పరిశీలించడం; ఆలోచన.
విచారం: ఆలోచన; పరిశోధన; బాధ.
విచ్చు: (పూవులు) వికసించు; చీలిపోవు; విడిపోవు; తెరచు.
విచ్చేయు: (పూజ్యులు) వచ్చు; పోవు; కూర్చుండు.
విజయం: గెలుపు.
విజ్ఞానం: శాస్త్రీయమైన జ్ఞానం Science
విడియం, వీడెం: తాంబూలం, పాన్‌బిడా (< ప్రా. వీడియా, సం. వీటికా).
విడ్డూరం: ఉపద్రవం; వింత; మూర్ఖత (< ప్రా. విడ్డురీ, సం. విడ్వరః).
వితరణం: దానం; ఉదార గుణం.


విదుషి


విగ్రహం


విచ్చు


విద్యుత్తు


విడియం


వితరణం

విత్తం: డబ్బు; ఆస్తి. విత్తవంతుడు: ధనవంతుడు.
విదుషి: విద్వాంసురాలు.
విదూషకుడు: హాస్యంగా మాట్లాడి నవ్వించేవాడు; హాస్యగాడు.
విదేశం: వేరేదేశం. విదేశీయులు: ఇతర దేశాలవారు.
విద్దియ, విద్దె: చదువు, బడాయి మాట; మాయ (<సం. విద్యా).
విద్య: చదువు. విద్యలేనివాడు వింత పశువు. విద్యాదాత: గురువు. విద్యావంతుడు: బాగా చదువుకొన్నవాడు.
విద్యుత్తు: మెరపు; విద్యుచ్ఛక్తి విద్యుల్లత: మెరపుతీగ.
విధానం: శాసనం; శాస్త్రవిధి; పద్ధతి. విధానసభ: శాసనసభ.
వినయం: మంచి నడవడి; అణకువ; క్రమశిక్షణ.
వినియోగించు: ఉపయోగించు.
వినుతి: పొగడ్త; స్తోత్రం; కీర్తి.
వినోదం: ఆనందం; వేడుక; కాలక్షేపం. వినోదయాత్ర.
విన్నపం: మనవి (< ప్రా. విణ్ణపం, సం. విజ్ఞాపన-).

**విన్నాణం:** నేర్పు; సామర్థ్యం (< ప్రా. విణ్ణాణం, సం. విజ్ఞానమ్).

**విపరీతం:** వ్యతిరేకం; ఎక్కువ.

**విపులం:** విశాలం; ఎక్కువైనది; సమృద్ధి.

**విప్లవం:** కొట్టుకొని పోవడం; శాసనాలను లెక్కచేయక పోవడం.

**విభాగం:** పంపకం; వాటా; విడిపోవడం.

**విభాజకం:** భాగహారంలో విభజించే సంఖ్య.

**విముక్తి:** విడుదల.

**విముఖుడు:** ఇష్టం లేనివాడు; ఎదిరించినవాడు.

**వియ్యంకుడు:** వియ్యమందిన వాడు; వధూవరుల తండ్రులు ఒకరికొకరు వియ్యంకులు వియ్యంకురాలు, వియ్యపురాలు.

**వియ్యం:** వివాహసంబంధంవల్ల ఏర్పడ్డ చుట్టరికం (< ప్రా. వేవాహిఅ, సం. వైవాహిక-).

**విరటుడు:** విరాట దేశపురాజు (<సం. విరాటః).

**విరమించు:** చాలించు; వదలుకొను.


విన్నాణం


విలపించు


విప్లవం


వివాదం


విశారదుడు


విశాలం

**విరామం:** తెరపి; ఖాళీ. విరామ సమయం.

**విరాళం:** చందా.

**విరి:** పువ్వు. విరిచెండు: పూల బంతి.

**విరుద్ధం:** వ్యతిరేకం; అసమ్మతి; అడ్డు.

**విలపించు, విలాపించు:** ఏడ్చు; దుఃఖించు.

**విలసిల్లు:** ప్రకాశించు; సంతోషించు.

**విలాతి, విలాయతి:** దేశం; పరదేశం.

**వివరణం:** వివరించడం; స్పష్టంగా తెల్పడం; వర్ణించడం.

**వివాదం:** జగడం; వ్యాజ్యం.

**వివేకం:** మంచిచెడ్డలను నిర్ణయించే శక్తి.

**వివ్వచ్చుడు:** అర్జునుడు (< ప్రా. బీభచ్చ-, సం. బీభత్స-).

**విశారదుడు:** నేర్పరి; బుద్ధిమంతుడు.

**విశాలం:** పెద్దది; వెడల్పయినది; సమృద్ధి.

**విశేషం:** ప్రత్యేకించి చెప్పుకోదగినది; వార్త.

విశేషణం: నామవాచకం యొక్క గుణాన్ని తెలిపేది, adjective.
విశేష్యం: నామవాచకం, noun.
విశ్రమించు: శ్రమతీర్చుకొను, అలసట తీర్చుకొను.
విశ్వం: ప్రపంచం. విశ్వంభర: భూమి. విశ్వజనీనత: ప్రపంచ ప్రజలందరకూ హితమైన భావన.
విశ్వాసం: నమ్మకం.
విషమించు: అపాయం తెచ్చు; మార్పుచెందు.
విషూచి: విరేచనాల జబ్బు, కలరా.
విసం: విషం (< ప్రా. విస-, సం. విష-).
విసరు: ఆడించు; తిప్పు; పొడిచేయు; గాలివీచు. విసరురాయి: తిరుగలి.
విసర్గ: సంస్కృత వర్ణమాలలో ఒక అక్షరసంకేతం, రెండు నిండు సున్నలు ఒకదాని కింద ఒకటిగా గుర్తించే లిపి సంకేతం(ః).
విసర్జించు: విడుచు.
విస్మయం: ఆశ్చర్యం; గర్వం.


విశ్రమించు


వీనులు


విశ్వం


వీవన


వృక్షం


వృత్తి


విస్మయం

విస్మరించు: మరచిపోవు.
విహారం: వినోదంకోసం తిరగడం; బౌద్ధులమఠం; రాజగృహం.
వీడ్కోలు: పోవడానికి అనుమతించడం.
వీనులు: చెవులు. వీనుల విందుగా: చెవులకుఇంపుగా.
వీపు: వెన్ను.
వీరం: శౌర్యం; పరాక్రమం. వీరమాత: వీరులను కన్నతల్లి.
వీవన: విసనకర్ర.
వీసం: పదహారోభాగం. (< ప్రా. వీసం: ఇరవై, సం. వింశతి). వీసమంత: చాలకొంచెం.
వీసె: నూటిరవై తులాల తూనిక. (< ప్రా. వీసియా, సం. వింశికా).
వృక్షం: చెట్టు.
వృత్తం: గుండ్రంగా ఉండేది; సంగతి, చరిత్ర. వృత్తలేఖిని: వృత్తాలు గీసే పరికరం.
వృత్తి: కుటుంబపోషణకైఅవలంబించేపని (కమ్మరి, కుమ్మరి, జాలరి, వడ్రంగం, వ్యవసాయం మొ. వి.).
వృద్ధి: పెరుగుదల; మంచిస్థితి.

**వృద్ధుడు:** ముసలివాడు.
**వృశ్చికం:** తేలు.
**వృషభం:** ఎద్దు.
**వృష్టి:** వాన. అతివృష్టి: చాల ఎక్కువగా కురిసేవాన. అనావృష్టి: చాలతక్కువగాకురిసే వాన.
**వెంగలి:** అవివేకి, మూర్ఖుడు; వెర్రివాడు.
**వెంపర:** పీడ, బాధ. వెంపరలాడు: పీడించు; హింసించు; పాకులాడు.
**వెకలి:** అర్థంకానిది; వెర్రిది; వెర్రివాడు. వెకలితనం: అవివేకం.
**వెగడు:** తడబాటు; భయం: దుఃఖం. వెగడుపడు: తొట్రుపడు, భయపడు.
**వెచ్చం:** ఖర్చు; చిల్లరసరకుల అప్పు; చిల్లరసరకు. (<ప్రా. వెచ్చ-, సం.వ్యయ), వెచ్చపెట్టు: ఖర్చుచేయు. వెచ్చించు: ఖర్చుచేయు.
**వెజ్జు:** వైద్యుడు (< ప్రా.వెజ్జో, సం.వైద్యః).
**వెటకారం:** ఎత్తిపొడుపు.
**వెనకయ్య:** గణపతి, వినాయకుడు. (<సం. వినాయకః).
**వెన్ను:** వీపు. వెన్నువిరుగు: ధైర్యం పోవు. వెన్నెముక: వీపునడిమి ఎముక.


వృశ్చికం


వృషభం


వృష్టి


వేణువు


వెజ్జు


వెన్ను

**వెరవు:** ఉపాయం; నేర్పు; విధం. వెరవరి: ఉపాయశాలి.
**వెరసి:** మొత్తంలెక్క.
**వెలది:** స్త్రీ.
**వెలితి:** కొరత, తక్కువ; నిండనిది.
**వెల్లి:** ప్రవాహం; వరుస. పాలవెల్లి: milkyway.
**వేకువ:** తెల్లవారుజాము. వేగు: తెల్లవారు; ఉదయించు.
**వేగిరం:** తొందర; వేగం. వేగిరపరుచు: తొందరచేయు. వేగిరపాటు: తొందర.
**వేగు:** గూఢచారి; రాజకీయ రహస్య సమాచారం. వేగులవాడు: గూఢచారి.
**వేడుక:** వినోదం; గట్టికోరిక; ఉబలాటం; పండుగ.
**వేణువు:** పిల్లంగోవి.
**వేతనం:** జీతం; కూలి.
**వేదన:** బాధ.
**వేదం:** ఋగ్వేదం యజుర్వేదం సామవేదం అథర్వవేదం వేదం నాల్గువిధాలు. వేదవాక్యం: మీరరానిది. వేదాంగాలు: శిక్ష వ్యాకరణం ఛందస్సు నిరుక్తం జ్యోతిషం కల్పం అన్నవి ఆరువేదాంగాలు.

వేదవ్యాసుడు: సంస్కృతభారత కర్త, వేదాన్ని నాల్గు భాగాలుగా విభజించిన ఋషి.

వేదిక: శుభకార్యాలు, సభలు -సమావేశాలు జరపడానికి తయారుచేసిన ఎత్తైన అరగు, stage.

వేధించు: బాధించు, పీడించు.

వేనలి: జడ; జుట్టు; కొప్పు.

వేనోళ్ళు: వెయ్యి ముఖాలు, వెయ్యినోళ్ళు. వేనోళ్ళ చాటు: బాగా ప్రచారంచేయు.

వేము: వేపచెట్టు.

వేలం: ఏలం, అమ్మకంలో ఒక రకం.

వేలుచు: హోమం చేయు. వేలుపు, వేల్పు: దేవత; ఇలువేల్పు: గృహదేవత.

వేళాకోళం: పరిహాసం, నవ్వులాట.

వేసంగి, వేసగి, వేసవి: ఎండల కాలం.

వేసడం: ఒకజాతిడేగ; కంచరగాడిద (<ప్రా. వేసరో, సం. వేసరః).


వేదవ్యాసుడు


వేదిక


వేనలి


వేము


వేసడం

వేసం: నటన; మాయ; వేషం (<ప్రా. వేస-, సం. వేష-). వేసగాడు: వేషాలు వేసేవాడు. పదివేసములసామి: పది అవతారాలెత్తిన దేవుడు, విష్ణువు.

వేసారు: విసుగుచెందు; బాధపడు; శ్రమపడు.

వైతాళికుడు: స్తోత్రం చేసేవాడు, జాతిని మేలుకొల్పేవాడు. వీరేశలింగం పంతులు నవయుగ వైతాళికుడు.

వైనం: ఉపాయం; వివరణ; కారణం.

వైభవం: సంపద; మహిమ, గొప్పతనం.

వైరం: పగ; ద్వేషం. వైరి: పగవాడు, శత్రువు.

వ్యంజనం: హల్లు, consonant.

వ్యవకలనం: తీసివేత; విడదీయడం.

వ్యవధి: అవకాశం, తెరపి.

వ్యవసాయం: సేద్యం; ప్రయత్నం, పూనిక.

వ్యాకరణం: శబ్దశాస్త్రం.

వ్యాకోచం: విస్తరించడం.

**వ్యాఖ్యానం:** సందర్భం-అర్థం-పదవిభజన-తాత్పర్యం మొ.వాటితో వివరించడం; వివరణం.

**వ్యాఘ్రం:** పెద్దపులి.

**వ్యాధి:** జబ్బు, రోగం.

**వ్యాపారం:** పని; వృత్తి; వాణిజ్యం, వర్తకం.

**వ్యామోహం:** ఎక్కువప్రేమ; గట్టికోరిక.

**వ్యాయామం:** శరీర పరిశ్రమ, కసరత్తు.


వ్యాయామం


వ్యాఘ్రం


వ్యాధి


వ్యోమం

**వ్యాసంగం:** ఏదో ఒకవిషయంపై కృషిచేయడం, దీక్షగా చదవడం.

**వ్యాసం:** వృత్తం యొక్క నడిమి కొలత; ఏదైనా ఒకవిషయంపై రచనచేయడం.

**వ్యుత్పత్తి:** పుట్టుక; నేర్పు; పాండిత్యం.

**వ్యోమం:** ఆకాశం, రోదసి.

వ్యోమగామి: రోదసిలో ప్రయాణంచేసేవాడు.

**వ్రణం:** పుండు; గాయం.

**వ్రతం:** నోము; నడవడి; పని.


వ్రతం

# శ

శంక: సందేహం; అనుమానం; భయం.
శంకలుచేయు: ప్రశ్నించు.
శంకించు: సందేహించు; జంకు.
శంకరాభరణం: శంకరునకు (శివునకు) అలంకారమైనది, పాము; సంగీతంలో ఒక రాగం..
శంకువు: స్తంభం; పునాది రాయి.
శంకుస్థాపనం: ఇల్లు మొ. వి కట్టడానికి ముందు పునాది రాయివేయడం.
శంఖం: సముద్రపు గుల్ల; యుద్ధానికి ముందు సూచనగా ఊదే వాద్యం.
శకం: సుప్రసిద్ధుడైన రాజు పట్టాభిషేక వత్సరంతో లేక ఒక మహాపురుషుని (జన్మ సంవత్సరంతో) మొదలయ్యే కాల విశేషం. విక్రమార్క శకం, శాలివాహన శకం, క్రీస్తుశకం మొ.వి.


శఠకోపం


శంకరాభరణం


శంకువు


శంఖం


శరం


శలభం

శకపురుషుడు: శకసంవత్సరానికి మూలవ్యక్తి.
శకునం: మంచిచెడ్డలను సూచిస్తుందనే గుర్తు.
శఠకోపం: భక్తుల తలపై ఉంచే విష్ణుపాదాల పాత్ర.
శఠకోపంపెట్టు: మోసగించు.
శతపత్రం: తామరపువ్వు.
శతమానం: మంగళసూత్రం.
శతకం: నూరుపద్యాలూ ఏదో ఒక మకుటమూగల కావ్యం. భాస్కరశతకం, సుమతిశతకం మొ.వి.
శతాబ్దం: నూరేళ్ళకాలం.
శత్రువు: పగవాడు.
శపథం: ఒట్టు; ప్రతిజ్ఞ.
శబ్దకోశం: నిఘంటువు.
శబ్దశాస్త్రం: వ్యాకరణం.
శరణు: రక్షకం; నమస్కారం; శరణాగతి..
శరణుడు: శివభక్తుడు.
శరం: బాణం. శరాసనం: విల్లు.
శరత్తు: ఒక రుతువు (ఆశ్వయుజ-కార్తిక మాసాల కాలం).
శరీరం: ఒడలు, దేహం.
శలభం: మిడుత.

**శశం:** కుందేలు. **శశధరుడు:** చంద్రుడు; **శశి:** చంద్రుడు; కుందేలును ధరించినవాడు. **శశిధరుడు:** శివుడు.

**శాకం:** ఆకుకూర, కాయ, దుంప, పండు మొ. **శాకాహారం:** కూరగాయల వంటకం.

**శాఖ:** చెట్టుకొమ్మ; భాగం; తెగ.

**శాతం:** నూటికి ఇంత అన్న లెక్క, %.

**శాయి:** మసి, ink

**శార్దూలం:** పెద్దపులి.

**శాల:** పెద్దహాలు; ఇల్లు. గుర్రాల సాల మొ.వి.

**శాసనం:** చట్టం; పరిపాలన; ఆజ్ఞ.

**శాస్తి:** శిక్ష; ప్రతీకారం.

**శాస్త్రం:** ఆజ్ఞ; సరియైన ఆధారాలతో రుజువుచేసే విజ్ఞాన విభాగం. ఆర్థిక శాస్త్రం: భౌతికశాస్త్రం మొ.వి.

**శిఖరం:** కొండ కొన, చెట్టుకొన.

**శిథిలం:** సడలినది; పాడుపడినది.

**శిబిరం:** విడిది; గుడారం.


శశం


శిల


శాఖ


శార్దూలం


శిలాశాసనం


శిఖరం


శిథిలం

శునకం

**శిరం, శిరసు:** తల. **శిరసావహించు:** అంగీకరించు. **శిరోధార్యం:** తలదాల్చదగినది.

**శిల:** రాయి. **శిలాజం:** రాతిలో పుట్టినది. **శిలాజాలు:** రాళ్ళు గామారిన జంతువుల అవశేషాలు, fossils

**శిలాశాసనం:** రాతి మీద చెక్కిన రాజ శాసనం; శాశ్వతమైనది. **శిలాక్షరం:** చెరగనిది, స్థిరమైనది.

**శిశిరం:** చల్లనిది. **శిశిర రుతువు:** (మాఘ ఫల్గుణ మాసాల కాలం).



**శిశువు:** పసిపాప.

**శిష్యుడు:** విద్యార్థి.

**శీఘ్రం:** వేగం కలది. **శీఘ్రంగా:** వెంటనే.

**శీలం:** స్వభావం; నడవడి; మంచి నడవడి, మనుష్యుల మంచి నడవడియే శీలం.

**శుచి:** పవిత్రం; శుభ్రత.

**శుద్ధి:** పరిశుభ్రత; పవిత్రత; సవరించడం; దోషాన్ని తొలగించడం.

**శునకం:** కుక్క.

**శుభం:** మంచిని కలిగించేది; సుందరమైనది; మంచిది. శుభవార్త: మంచివార్త.

**శుభ్రం:** తెల్లటిది; ప్రకాశించేది; స్వచ్ఛమైనది; శుచీశుభ్రమూ.

**శుశ్రూష:** విధేయత; గౌరవం; పెద్దలు చెప్పే దానిని శ్రద్ధగా వినాలన్న కోరిక; పెద్దల సేవ.

**శుష్కం:** ఎండినది; సన్నగిల్లినది; కాల్చినది, వాడిపోయినది; పనికిరానిది. శుష్కప్రియాలు శూన్య హస్తాలు.

**శూలి:** శూలం కలవాడు, శివుడు.

**శేషం:** మిగిలినది.


శూలి


శైలం


శుశ్రూష


శ్రవణం

**శైలం:** కొండ.

**శోధించు:** వెదకు; పరీక్షించు; శుద్ధిచేయు.

**శోభ:** అందం; వెలుగు.

**శౌరి:** కృష్ణుడు; శూరుని సంతతి వాడు.

**శౌర్యం:** పరాక్రమం; బలం.

**శ్రమణుడు:** బౌద్ధసన్యాసి.

**శ్రవణం:** చెవి; వినడం; చదువు, విద్య. శ్రవణానందం: వీనుల విందు; చెవులకు ఇంపుగా ఉండేది.

**శ్రేయస్కరం:** సుఖాన్ని కలిగించేది.

**శ్వాసం:** ఊపిరి. శ్వాసకోశం: ఊపిరితిత్తులు.

# ష

**షట్కోణం:** ఆరు కోణాలు కలది.

**షడ్భుజి:** ఆరు భుజాలుకలది.

**షరతు:** నిబంధన.

**షష్టి:** అరవై. **షష్టిపూర్తి:** అరవై సంవత్సరాలు నిండిన వ్యక్తులు చేసుకునే ఉత్సవం.



షడ్భుజి



షహరు



షైరు

**షహరు:** పట్టణం. **షహర్‌గస్తు:** ఊరేగడం; సరిగస్తు, మొహరం పండగ సందర్భంగా పీర్లను ఊరేగించడం.

**షికారు:** వేట; విహారం. **షికారీ:** వేటగాడు.

**షైరు:** విహారం.

**షోకు:** విలాసం; సింగారం; అలంకరణం.



షోకు

# స

సంకటం: బాధ; ఇరకాటం; ఇబ్బంది.
సంకటి: చిక్కగా కాచిన అంబలి; రాగి-జొన్నముద్ద.
సంకలనం: కూడిక.
సంకెల: కాళ్లకుకట్టే గొలుసు; చెరసాల (< ప్రా. సంఖలా, సం. శృంఖలా).
సంకీర్తనం: దేవుని గుణాలను గానరూపంగా కీర్తించడం; పొగడడం. తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనాచార్యులు.
సంక్రాంతి: సూర్యుడు మకరరాశిలో ప్రవేశించేపండగ, మకర సంక్రాంతి.
సంక్షిప్తం: తగ్గించినది; సంగ్రహం.
సంక్షోభం: తొట్రుపాటు; కలవరపాటు.
సంఖ్య: లెక్కించడం; అంకె; లెక్క.
సంఖ్యావాచకం: సంఖ్యను తెలిపేది.


వీరేశలింగం పంతులు


సంకెల


అన్నమయ్య


సంచి



సంగడం: చెలిమి; స్నేహితుడు.
సంగడికాడు: చెలికాడు.
సంగరం: యుద్ధం.
సంఘం: సమాజం.
సంఘసంస్కర్తలు: చెడు నడతలను మాన్పి, గుడ్డి నమ్మకాలను పోగొట్టి సమాజాన్ని బాగుచేయడానికి పాటుపడేవారు. వీరేశలింగం పంతులు గొప్ప సంఘసంస్కర్త.
సంచకరం: బయానా; అడ్వాన్సు (< ప్రా. సచ్చంకారి-, సం. సత్యంకార-.).
సంచి: గోనెసంచి; అసిమి. సంచి కట్టువైద్యుడు; పల్లెలలోని నాటువైద్యుడు. సంచిమొదలు: మూలధనం; పెట్టుబడి.
సంజ: సంధ్యాకాలం (< ప్రా. సంఝా, సం. సంధ్యా).
సంత: నిర్ణయించిన దినాలలో ఏర్పరిచే అంగళ్ళ వరుస.
సంతసం: ఆనందం (< ప్రా. సంతోస-, సంతోష-).
సందడి: సమ్మర్దం, జనుల గుంపు; అల్లరి.
సందు: ఎడం; ఇరుకు వీథి; నెపం.

**సందేశం:** ఆజ్ఞ; సలహా.

**సందేహం:** అనుమానం; అపాయం.

**సంధి:** ఒడంబడిక; కూడిక.

**సంపెంగ:** చంపకపుష్పం(< ప్రా. చంపగ-, సం. చంపక-).

**సంప్రదాయం:** తరతరాలుగా వస్తున్న ఆచారం.

**సంప్రాప్తం:** బాగా దొరకినది.

**సంప్రోక్షించు:** శుద్ధిచేయు.

**సంబంధం:** చుట్టరికం; స్నేహం.

**సంబరం:** వేడుక; సంతోషం (< సం. సంభ్రమః).

**సంబోధనం:** పిలుపు. సంబోధించు: బాగాబోధించు; హెచ్చరించు; పిలుచు.

**సంభావన:** సత్కారం; తలంపు; ప్రేమ.

**సంవాదం:** చర్చ; పోలిక; సమాచారం.

**సంశయం:** సందేహం.

**సంస్కరించు:** చక్కబరచు. సంస్కర్త: బాగుచేయు వ్యక్తి. సంస్కారం: మంచిగుణాలు కలిగి ఉండడం; మెరుగు పెట్టడం.


సంపెంగ


సజ్జ


సంబోధనం


సత్తరువు

**సంస్కృతి:** మంచి సంస్కారం; నాగరికత.

**సకినం:** మంచినో చెడ్డనో తెలిపే గుర్తు(< సం. శకున-).

**సకి, సకియ:** స్నేహితుడు; స్నేహితురాలు; చెలికత్తె (<సం. సఖీ).

**సగటు:** సరాసరి.

**సచివుడు:** మంత్రి. సచివాలయం: మంత్రుల కార్యస్థానం.

**సజ్జ, సెజ్జ:** పరుపు, పానుపు (< ప్రా. సజ్జా, సం. శయ్యా).

**సడలు, సడిలు:** శిథిలమగు; వదలు; సన్నగిల్లు (<ప్రా. సఢిలో, సిఢిలో, సం. శిథిల-) సడలించు: విప్పు; విడుచు. సడలింపు: సడలించడం.

**సడ్డ[1]:** శ్రద్ధ; ఆసక్తి (<ప్రా. సడ్ఢా, సం. శ్రద్ధా).

**సడ్డ[2]:** ద్వేషం (<సం. స్పర్ధా).

**సడ్డకుడు:** తోడల్లుడు (<సం. షడ్డకః).

**సత్తరువు:** సత్రం; ధర్మశాల; అన్నదాన గృహం (<సం. సత్రమ్).

**సత్యాగ్రహం:** నమ్మిన సత్యం కోసం పట్టుదలతో పని చేయడం. ఉప్పుసత్యాగ్రం.


ఉప్పుసత్యాగ్రహం

**సదమదం:** నలిగినది.

**సదస్సు:** సభ. సదస్యులు: సభాసదులు.

**సదుపాయం:** సౌకర్యం.

**సద్దు:** చప్పుడు, ధ్వని (<ప్రా. సద్దో, సం. శబ్దః).

**సన్నాహం:** ప్రయత్నం; ఏర్పాటు.

**సన్మానించు:** గౌరవించు.

**సపర్య:** పూజ; సేవ; గౌరవం.

**సప్తపది:** పెళ్ళి సమయంలో నూతన వధూవరులు కలిసి ఏడడుగులు నడవడం.

**సబబు:** సరియైన కారణం.

**సమంజసం:** తగినది; సరియైనది.

**సమత:** సమానత్వం; భేదభావం లేకపోవడం.

**సమర్థించు:** బలపరుచు; రుజువు చేయు.

**సమర్పించు:** గౌరవభావంతో ఇచ్చు.

**సమాచారం:** వార్త.


సమ్మెట


సన్మానించు


సరసి

**సమాజం:** మంచి కట్టుబాట్లు గలమనుషుల గుంపు.

**సమితి:** గుంపు.

**సమీక్ష:** ఆలోచన; పరిశోధన.

**సమైక్యం:** కలసి మెలసి ఉండడం.

**సమ్మెట:** పెద్దసుత్తి.

**సమ్రాట్టు:** చక్రవర్తి.

**సరళం:** తిన్ననిది; వంకర కానిది; సాధు స్వభావం. సరళాలు: గ, జ, డ, ద, బ- అనే వర్ణాలు.

**సరసం:** నవ్వులాట; పరిహాస వాక్యం.

**సరసి, సరస్సు:** కొలను, మడుగు.

**సరి:** సమానం; సాటి; పోలిక. సరి సంఖ్య: 2, 3, 4, 6, 8 మొ. వి. (<ప్రా. సరి, సరిస, సం. సదృశ-) సరిబేసులు: ఒక పిల్లల ఆట.

**సరిహద్దు:** పొలిమేర.

**సర్వజనీనం:** జనులందరకు హితమైనది..

**సర్వజ్ఞుడు:** అన్నీ తెలిసినవాడు.

**సర్వథా:** అన్ని విధాలా; పూర్తిగా.

సర్వదా: ఎల్లప్పుడు; శాశ్వతంగా.

సర్వనామం: నామవాచకానికి మారుగా వాడే పదం.

సర్వభక్షకుడు: అన్నింటినీ తినేవాడు, అగ్ని.

సర్వమంగళం: ఏమీ లేనిది; శూన్యం.

సర్వమాన్యం: ఏవిధమైన పన్ను లేకుండా గౌరవం కోసం ఇచ్చిన భూమి లేక గ్రామం.

సర్వసిద్ధాంతం: అన్ని మతాల వారూ ఒప్పుకొన్న సిద్ధాంతం.

సర్వార్థసిద్ధుడు: బుద్ధుడు.

సలాము: నమస్కారం (< ఉర్దూ. సలాం).

సవతి: తోడి పెండ్లాము (< ప్రా. సవత్తి, సం. సపత్నీ) సవతి తల్లి: మారుతల్లి.

సవతు: సమానం; సామ్యం (< ప్రా. సవత్తో: తుల్యుడు; సం. సపత్నః: శత్రువు) సవతువచ్చు: సాటియగు. సవతుసేయు: పోల్చు.

సహకరించు: కలసి పనిచేయు; తోడ్పడు.


సాగరం


సర్వార్థ సిద్ధుడు


సాన


సాయం


సారె

సహజీవనం: కలసిమెలసి ఒద్దికగా జీవించడం.

సాకు: మిష.

సాగరం: సముద్రం.

సాజం: సహజం.

సాతు: వర్తకుల బిడారు (< ప్రా. సత్థో, సం. సార్థ-).

సాధనం: ఉపాయం; పనిముట్టు.

సాధువు: మంచివాడు; యతి.

సాధ్యం: సాధించ వలసినది; నిరూపించవలసినది.

సాన: కత్తులు మొదలైనవి నూరే రాయి; గంధం తీసే రాయి (<ప్రా. సాణ-, సం. శాణ-).

సాని[1]: సాహిణి, గుర్రపు రౌతు.

సాని[2]: రాజుగారి భార్య; వేశ్య (< ప్రా. సామిణీ, సం. స్వామినీ).

సాము[1]: సగం.

సాము[2]: వ్యాయామం, కసరత్తు.

సామెత: లోకోక్తి.

సాయం: తోడ్పాటు.

సారాంశం: ముఖ్యవిషయం.

సారె: పాచిక; గోరువంక (< ప్రా. సారిఆ, సం. శారికా).

సార్వభౌముడు: చక్రవర్తి. శ్రీనాథుడు కవి సార్వభౌముడు.

**సాల:** ఇల్లు; నివాసం (< ప్రా. సాలా, సం. శాలా).

**సాలియ:** నేతపని; బట్టలు నేసే వ్యక్తి (<ప్రా. సాలి ఆ, సం. శాలికః).

**సాహసం:** తెగింపు; చొరవ.

**సాహిణి:** గుర్రపువాడు; గుర్రపు రౌతు; గుర్రాల సాలపై అధి కారి (< ప్రా. సాహణీ, సం. సాధనీ: సైనికుడు).

**సింగం:** సింహం (< ప్రా.సింఘో, సం. సింహః).

**సింగారం:** అలంకరణ (< ప్రా. సింగార-, సం. శృంగార-).

**సిక, సిగ:** జుట్టు (<ప్రా. సిఖా, సం. శిఖా) సిగపట్లు: దెబ్బ లాట.

**సిబ్బంది:** కింది ఉద్యోగులు; సేవకులు.

**సిరి:** సంపద; శోభ; లక్ష్మీదేవి (< ప్రా. సిరీ, సం. శ్రీః).

**సిలువ:** ఏసుక్రీస్తును బంధించి హింసించిన కొర్రు.

**సీమ:** ప్రాంతం; సరిహద్దు; విదేశం.

**సుంకం:** పన్ను (< ప్రా. సుంకం, సం. శుల్క-).


సాలియ


సింగం


సుత్తి


సిక


సిలువ

**సుంకరి:** పన్ను వసూలుచేసే వాడు.

**సుకియ:** వేయించిన తినుబండా రం (< ప్రా. సుక్క-: ఎండి నది, సం. శుష్క-).

**సుడి:** గాలి గుండ్రంగా తిర గడం, సుడిగాలి; సుడి గుండం; వట్రువసుడి.

**సుతారం:** సుకుమారం.

**సుత్తి:** చిన్నసమ్మెట.

**సుద్ది[1]:** సమాచారం; వార్త; మాట (< ప్రా. సుత్తి, సం. సూక్తి-) సుద్దులకత్తె: మాటకారి.

**సుద్ది[2]:** శుభ్రం సుద్దిచేయు: శుద్ధి పరుచు.

**సుధాకరుడు:** చంద్రుడు.

**సున్న:** లేనిది; అనుస్వారం (< ప్రా. సుణ్ణం, సం. శూన్య-) అరసున్న, నిండు సున్న.

**సున్నం:** తెల్లటి కారపు పదార్థం (< ప్రా. చుణ్ణం, సం. చూర్ణ-).

**సుప్రభాతం:** పవిత్ర మైన ఉదయం; దైవ సన్నిధిని తెల్ల వారు జామున జరిపే మేల్కొలుపు.

**సుభాషితం:** మంచిమాట.

**సుభిక్షం:** పాడిపంటలు దండిగా ఉండడం

**సుమంగలి:** ముత్తయిదువ.

**సుమతి:** మంచి బుద్ధిగలవాడు.

**సురియ:** చురకత్తి.

**సులువు:** సులభం.

**సువర్ణం:** బంగారు.

**సువారం:** వంట; వంట ఇల్లు (< ప్రా. సూవార-, సం. సూపకార-).

**సువ్రతుడు:** నియమనిష్ఠలుగల విద్యార్థి.

**సుస్తి:** అనారోగ్యం; సోమరితనం.

**సూక్ష్మం:** చిన్నది; పలుచనిది; చతురత. సూక్ష్మగ్రాహి: తొందరగా గ్రహించేవాడు. సూక్ష్మదర్శి: చురుకైన చూపుగలవాడు.

**సూడిగం:** స్త్రీల చేతి గాజు (<ప్రా.చూడగ-, చూడక).

**సూడిద:** కానుక.

**సూడు[1]:** కాల్చు; అంటించు.

**సూడు[2]:** పగ; కసి; శత్రువు.

**సూది:** గుడ్డలుకుట్టే సాధనం (< సం. సూచీ).


సురియ


సుస్తి


సెలయేరు


సూడిగం


సూది

**సూనరి:** చంపేవాడు; కసాయివాడు (< ప్రా. సూణాఆర-, సం. సూనాకర-).

**సూనృతం:** సత్యవచనం; మంచి మాట.

**సూయాణం:** శత్రుభయంకరమైన దండయాత్ర (< సం. సుయానమ్).

**సూరి:** పండితుడు; విద్వాంసుడు.

**సృజించు:** నిర్మించు; పుట్టించు.

**సృష్టి:** పుట్టుక; ఉత్పత్తి; ప్రకృతి.

**సెలయేరు:** కొండమీది నుంచీ పారే చిన్న ఏరు.

**సెలవి:** పెదవి మూల.

**సెలవు:** ఆటవిడుపు, ఖర్చు, పోవడానికి అనుమతి. సెలవిచ్చు: ఆజ్ఞాపించు.

**సేకరించు:** కూడబెట్టు; సంగ్రహించు.

**సేగి:** కీడు; ఆపద; నష్టం.

**సేద:** బడలిక; ఆయాసం; మూర్ఛ (< ప్రా. సేద-, స్వేద-) సేదదేరు: బడలిక పోవు.

**సేద్యం:** వ్యవసాయం. **సేద్య కాడు:** సేద్యం చేసేవాడు, రైతు.

**సేన:** సైన్యం.

**సేనం:** చిన్నఉలి (<ప్రా. ఛేఅణం, సం. ఛేదనమ్)..

**సేమం:** శుభం; క్షేమం; కుశలం (<సం. క్షేమమ్).

**సేవియ:** గోదుమ పిండితో సన్నగా తాలికలుచేసి పాలు, పంచదార కలిపి చేసే భక్ష్య విశేషం (<ప్రా. సేవియా, సం. సేవికా).

**సేసలు:** అక్షతలు (<ప్రా. సేసా, సం. శేషః, శేషా: కట్టి విడిచినది, ముడిచి తీసినది).

**సైచు:** ఇష్టమగు; రుచించు; ఓర్చుకొను.

**సైగ:** సన్న, జాడ.

**సైతం:** కూడ (<సం. సహితమ్).

**సైదోడు:** తోబుట్టువు.

**సైరణ:** ఓర్మి; సహనం. **సైరించు:** సహించు; క్షమించు.

**సొంటు:** తప్పు.

**సొంపు:** సమృద్ధి; సుఖం; సౌందర్యం; ఠీవి.


సేద్యం


సేనం


సొరకాయ


సోది

**సొచ్చెం:** నిర్మలం; శుద్ధం(<ప్రా. సచ్ఛ-, సం. స్వచ్ఛ-).

**సొట్ట:** నొక్కు; వంకర.

**సొద్దు:** కొరత; తప్పు.

**సొత్తు:** సొమ్ము.

**సొద:** చితి.

**సొన్నం:** బంగారు; బంగారు నాణెం (<ప్రా. సొణ్ణం, సం. సువర్ణ-).

**సొన్నారి:** బంగారం పనిచేసే వ్యక్తి(<ప్రా. సొన్నార-, సం. సువర్ణకార-).

**సొబగు:** చక్కదనం.

**సొమ్ము:** డబ్బు; నగ; హక్కు. **సొమ్ములు:** గోధనం (<సం. స్వమ్: తనది, సొమ్ము), 'సొమ్మొకరిది సోకొకరిది'.

**సొరకాయ:** ఆనబకాయ; ఆనగకాయ. **సొరకాయ కోతలు:** ప్రగల్భాలు.

**సోది, సోదె:** ఎరుక. **సోదెకత్తె:** సోదె చెప్పే స్త్రీ.

**సోద్దెం:** ఆశ్చర్యం; వింత (<సం. చోద్య-).

**సోపనం:** మెట్టు (<సం. సోపాన-).

**సోమరి:** అలసుడు; మందబుద్ధి (<ప్రా. సోమార-, సం. సుకుమార).

**సోయగం:** చక్కదనం; విలాసం; విధం.

**సోరణం:** గవాక్షం; కిటికీ(<ప్రా. సోరాణ-, సం. సౌరాయణ- సూర్యునిమార్గం, సూర్యుని వెలుగువచ్చే మార్గం), సోరణ గండ్లు: గవాక్షాలు.

**సోల:** కొల పాత్ర, ధాన్యాన్ని కొలిచే పరికరం (<ప్రా. సోలస, సోలహ్: ఒక కొలత, పదహారు, సం. షోడశ-).

**సోలు:** పరవశమగు; ఒరగు; నశించు; ఓడిపోవు.

**సోలుదారు:** సైనికుడు, Soldier

**సౌందర్యం:** అందం.

**సౌకర్యం:** నేర్పు; అనుకూలం; సదుపాయం.

**సౌధం:** మేడ; సుధ (సున్నం) తో కట్టినది.

**సౌభాగ్యం:** అదృష్టం; వైభవం; గొప్పసంపద.

**సౌరకుటుంబం:** సూర్యునితో పాటు ఇతర గ్రహాల గుంపు.

**స్తవం:** పొగడ్త.


స్తూపం


సోరణం


స్మారకం


సోలుదారు

**స్తూపం:** బౌద్ధస్మృతిచిహ్నం.

**స్త్రీధనం:** తలిదండ్రులు, సోదరులు మొ. వారి నుంచి స్త్రీకి లభించిన సొత్తు.

**స్థపతి:** శిల్పి.

**స్థాణువు:** కదలనిది.

**స్థాపించు:** నిలుపు; ఏర్పరుచు.

**స్థిరం:** నిలుకడ; శాశ్వతం. స్థిరపరుచు: నిశ్చయం చేయు.

**స్పర్థ:** పోటీ; అసూయ.

**స్ఫూర్తి:** ఆవేశం; ప్రోత్సాహం.

**స్ఫోటకం:** మసూచి; అమ్మవారి జబ్బు.

**స్మారకం:** స్మృతిచిహ్నం.

**స్వచ్ఛందం:** స్వతంత్రమైనది; కల్మషం లేనిది.

**స్వయంవరం:** కన్య స్వయంగా వరుని ఎన్నుకొనడం.

**స్వరాజ్యం:** సొంత ప్రభుత్వం.

**స్వాగతం:** సుఖంగా వచ్చారా అని అడగడం; కుశల ప్రశ్న.

**స్వీకరించు:** తీసుకొను; అంగీకరించు.

**స్వేచ్ఛ:** తన ఇష్టప్రకారం ఉండడం.

# హ

హంగామా: హడావిడి.
హంగు: అనుకూల్యం; ప్రయత్నం; వనరు.
హంతకుడు: చంపేవాడు; హింసించేవాడు.
హంసపాదు: చేతిరాతలో వదలి వేసిన భాగాన్ని మళ్ళీ చేర్చినందుకు సూచనగా హంస పాదం వంటిగుర్తును రాయడం.
హంసోదకం: ఎండకు సలసల కాగి వెన్నెల చలువకు చల్లబడ్డ నీరు.
హక్కు: స్వంతం.
హజారం, హోజారం: కొలువు కూటం; మొగసాల (<పారసి. హోజిరాన్: సభాసదులు, హోజర్: సభ్యులు).
హజ్జ: పాదం, అడుగు (<కన్నడం. హజ్జె: పాదం, అడుగు).
హఠం: మొండితనం; పట్టుదల; దౌర్జన్యం.


హత్తి


హనుమ


హయం


హరికథ


హరిగ

హడపం: వక్కలాకుల సంచి.
హత్తం: చేయి (<ప్రా. హత్థం, సం. హస్త-).
హత్తి: ఏనుగు (<ప్రా. హత్థి, సం. హస్తిన్).
హత్తు: అంటుకొను; నాటుకొను; ఉండు; చేరు; కలియు; అనుకూలించు. హత్తించు: హత్తుకొను.
హదను: సరియైన సమయం (< కన్నడం. హదను, పదను).
హద్దు: సరిహద్దు, మేర. హద్దూ పద్దూలేదు. హద్దుమీరు: అతిక్రమించు, మితిమీరు (<పారసి. హద్: మేర, పొలిమేర).
హనుమ: హనుమంతుడు (<ప్రా. హణుమ-, సం. హనుమత్-).
హయం: గుర్రం.
హరికథ: నృత్యగానాలతో చెప్పే కథ; విష్ణుకథ.
హరిగ: డాలు.
హరిగోలు: ఏరుదాటడానికి వాడే చిన్నిపడవ.
హరిదళం: పసుపుపచ్చటి ధాతు విశేషం (<ప్రా. హరిదాల-, సం. హరితాల-).

**హరివాణం:** పళ్ళెరం, పాత్ర; భోజనపాత్ర.

**హరుసం:** సంతోషం (< ప్రా. హరిస-, సం. హర్ష-).

**హలం:** నాగలి.

**హళది, హళిది:** హరిద్రావర్ణం; పసుపురంగు (<ప్రా. హలిద్దీ, సం. హరిద్రా).

**హసనం:** నవ్వు.

**హాకీము:** యజమానుడు; వైద్యుడు.

**హాజరు:** రాజ సన్నిధిలో ఉండడం (<పారసి. హాజర్: సన్నిధిల్ ఉండడం. హాజరుపట్టి: Attendance register.

**హాని:** కీడు.

**హాయి:** సుఖం. సంతోషం.

**హారతి:** ఆరతి. (<ఆరతి సం. ఆరాత్రికమ్).

**హాలికుడు:** రైతు.

**హింస:** చంపడం; పీడ; బాధ.

**హితవు:** ప్రియమైనది; యుక్తం; మంచిది. (<సం. హిత-).

**హిమం:** మంచు.

**హుండీ:** దేవాలయాలలో మొక్కుబడి డబ్బును వేసే పాత్ర; డబ్బు ఇవ్వడానికి ఇచ్చే ఆజ్ఞాపత్రిక.


హరివాణం


హలం


హసనం


హారతి


హిమం


హుండీ

**హుజురు, హుజూరు:** సన్నిధి; పాలకుల సమక్షం.

**హుటాహుటి:** వేగంతో కావించే ప్రయాణం; అతివేగం.

**హుమా, హుమాయి:** గుర్రం; వాహనం (<పారసి. హుమా: నిరంతరం ఎగిరే పక్షి).

**హురుముంజి:** పారసీకదేశంలోని ఒకరేవు పట్టణం, ముత్యాలకు ప్రసిద్ధి. (<పారసి. హుర్ముజ్: పారసీక జలసంధిలోని ఒకదీవి; ఒకపట్టణం).

**హుళక్కి:** అబద్ధం; లేనిది (<కన్నడం. హుళక్కి).

**హుషారు:** జాగరూకత; ఉత్సాహం; సంతోషం. (<మరాఠీ. హుశారీ; పారసి. హుశ్యార్, హోశ్యార్: నేర్పు; జాగరూకత).

**హుసివోవు:** వ్యర్థమగు (<కన్నడం: హుసి, పుసి: వ్యర్థం).

**హూణుడు:** విదేశీయుడు.

**హృదయం:** మనస్సు; ప్రేమ; కోరిక. హృదయమిచ్చు: మనసిచ్చు; రహస్యం తెలుపు.

**హృద్యం:** అందమైనది; ఉల్లాసం కలిగించేది; మనోహరమైనది.

**హెగ్గడి:** రాజసన్నిధిలో ఉండే ఉద్యోగి. హెగ్గడికత్తె: అంతః పురదాసి, హెగ్గడికాడు: అంతఃపుర రక్షకుడు (<కన్నడం: హెగ్గడ: మంత్రి).

**హెచ్చరిక:** జాగరూకత. హెచ్చరించు: జాగ్రత్తను తెలుపు.

**హేజీబు:** మంత్రి, సలహాదారు; ప్రతినిధి (<మరాఠీ. హేజీబు: దూత, రాయబారి).

**హేజుబారి:** రాయబారి.

**హేతువాదం:** దేవుడు ఉన్నాడన్న వాదాన్ని అంగీకరించని అభిప్రాయం. హేతువాది: దేవుని ఉనికిని సందేహించే వ్యక్తి.

**హేమం:** బంగారం. హేమించు: బంగారంచేయు.

**హేమాహేమీలు:** గొప్పవారు; ఒకరిని మించిన మరొకరు (< కన్నడం: హెమ్మె: ఆధిక్యం).

**హేరాళం:** ఎక్కువ; పెద్ద; అడ్డులేనిది (<కన్నడం: హేరాళ : విస్తారం, ఆధిక్యం).



హొన్ను



హొయలు

**హేళన:** వెక్కిరించడం; వినోదించడం.

**హైరాను:** ఎటూ తోచని స్థితి; తొందర.

**హొంత:** నేర్పు. హొంతకాడు, హొంతకారి: జెట్టి, వస్తాదు. గట్టి మనస్సుకల వ్యక్తి (< కన్నడం: హొంతకార: నేర్పరి, శూరుడు).

**హొన్ను:** బంగారం; బంగారు నాణెం, వరహా (<కన్నడం: హొన్ను: బంగారం. హొంబట్టు: బంగారువన్నె గల పట్టు. హొన్నంచు: బంగారునగిషీగలఅంచు. హొన్నగరు: బంగారునగరం, రాజగృహం.

**హొయలు:** విలాసం; వేడుక (< కన్నడం: హొయల్, హొయిలు).

**హొరంగు:** సొగసు; కాంతి (< కన్నడం: హొరె: ఉత్సాహం).

**హొస:** కొత్తది; చక్కనిది (< కన్నడం: హొస: కొత్తది).

**హోదా:** పదవి (< మరాఠీ. హోదా: వాస్తవ స్థితి; మూలం).
**హోమం:** యజ్ఞం.
**హోర¹:** ప్రసిద్ధి.
**హోర²:** రాత్రీపగలు; గంట.
**హోరాట, హోరాటం:** పోరాటం; వేగిరపాటు. (< కన్నడం: హోరాట: యుద్ధం), హోరాహోరి: ఎడతెగక. హోరాహోరిగా పోట్లాడు.


హోమం


హౌదా

**హోళిగలు:** భక్ష్య విశేషం, బొబ్బట్లు, ఒబ్బట్లు. (<కన్నడం: హోళిగ).
**హౌదా:** ఏనుగుమీది అంబారి (<మరాఠీ. హౌదా: ఏనుగు మీది గద్దె) పారసి.హౌజ; అరబ్బీ). హవద: ఒంటె మూపు.

అనుబంధం

# కొలామానం-తులామానం

## మెట్రిక్ కొలతలు

### పొడవు

| | |
|---|---|
| మెగా మీటరు | = 10,00,000 మీటర్లు |
| కిలోమీటరు | = 1,000 మీటర్లు |
| హెక్టామీటరు | = 100 మీటర్లు |
| డెకామీటరు | = 10 మీటర్లు |
| మీటరు | = 1 మీటరు (100 సెం.మీ.) |
| డెసిమీటరు | = 1/10 మీటరు (10 సెం.మీ.) |
| సెంటిమీటరు | = 1/100 మీటరు |
| మిల్లీమీటరు | = 1/1000 మీటరు |
| మైక్రాన్ | = 1/10,00,000 మీటరు |
| 1 కి.మీ | = 0.62137 మైలు |
| 1 మీటరు | = 39.37 అంగుళాలు |
| 1 సెం.మీ | = 0.3937 అంగుళాలు |
| 2.54 సెం.మీ | = 1 అంగుళం |
| 30.48 సెం.మీ | = 1 అడుగు |
| 1.6 కి.మీ | = 1 మైలు |

## ఘనపరిమాణం

కిలోలీటరు = 1000 లీటర్లు = 1 ఘనమీటరు
లీటరు = 1 ఘనడెసీమీటరు
మిల్లీలీటరు = 1/1000 లీటరు
ఘనఅంగుళం= 16.3872 ఘన సెం.మీ.
ఘన అడుగు = 0.028317 ఘన.మీ.

## బరువు

టన్ను = 1000 కిలోగ్రాములు = 10,00,000 గ్రాములు
క్వింటల్ = 100 కిలోగ్రాములు = 1,00,000 గ్రాములు
కిలోగ్రాము = 1000 గ్రాములు
మిల్లీగ్రాము = 1/1000 గ్రాము
మైక్రోగ్రాము = 1/10,00,000 గ్రాము